# పీఠిక

మన పోలీసు వ్యవస్థ ప్రపంచములో కెల్ల విలక్షణమైనట్టిది. వివిధ దేశములలో సామాన్య పోలీసులకు, ప్రత్యేక సాయుధ పోలీసులకు గల క్రమశిక్షణము, తర్ఫీదు, ఆధునిక మారణాయుధములు, మోటారుబండ్లు, వైర్లెసు, టెలిగ్రాఫు టెలిఫోనులు, సాధన సామాగ్రి, పరికరములు, సరంజాములుండుటయేగాక మనవారికి ఒకవిధమైన సైనిక శిక్షణము, శాసనబద్ధములగు ప్రత్యేకాధికారములుకూడా ఉన్నవి.

మన పోలీసువారు సామాన్య నేరగాండ్రను, నిరాయుధులగు అల్లరిమూకలను మాత్రమేగాక ఆయుధములతో బందిపోట్లు ఘోరకృత్యములు చేయు అతతాయి మూకలను ఆటవిక జనమునుకూడా అరికట్టి, శాంతిభద్రతలు కాపాడగలరు. ప్రజలలో భయభక్తులు కలిగింపగలరు. అగ్నిభయము, వరదలు, అంటువ్యాధులు మొదలగు ఉపద్రవములలో పనిచేయగలరు. ఈ కార్యముల నన్నిటిని సమర్థతతో నిర్వహింపగలరు. అయితే ఏ పనినైనను అధికారపు జబర్దస్తీతో, దురుసుగా, మొరటుగా చేయగలరేగాని యుక్తాయుక్త వివేచనతో, శాంతముగా సౌమ్యముగా మర్యాదగా ఒప్పిదముగా చేయలేరు. ప్రజాప్రభుత్వ సంప్రదాయముల ననుసరించి ప్రజాసేవ చేయలేరు. దీనికి కారణము మన పోలీసు వ్యవస్థను నిర్మించినవారు నిన్న మొన్నటివరకు మన దేశ ప్రజలను అణచియుంచి నిరంకుశముగా పాలించిన బ్రిటీషువారు దానిని ప్రజాసేవకొరకు గాక ప్రజలలో భయభక్తులు కలిగించుటకే నిర్మించి యుపయోగించియుండుట.

దీనికితోడు పోలీసు వారిలో కొందరు స్వాభావికముగనే నిరంకుశులు, కఠినాత్ములు, తొందరపాటువారుగ నుండుట, కొందరు అవినీతిపరులై యుండుట. ఆ పాతపద్ధతు లింతవరకు మారకపోవుట.

మన దేశమునకు స్వాతంత్ర్యము వచ్చి చాలకాల మైనను ఇంతవరకు మన పోలీసువ్యవస్థ స్వతంత్ర ప్రజాప్రభుత్వ సంప్రదాయముల కనుగుణముగా సంస్కరించబడలేదు. మన పోలీసువ్యవస్థయొక్క పుట్టుపూర్వోత్తరములు స్వరూపస్వభావ ములు, దీనికి సంబంధించిన శాసవిధులు ప్రజలకు తెలియుట ఆవశ్యకమని తలచి నే నీ గ్రంథమును రచించినాను. మన పోలీసువ్యవస్థకు ఆంగ్లేయ పోలీసువ్యవస్థకుగల తారతమ్యము లను వివరించుట కుపయోగపడిన గ్రంథముల రచయితలకు కృతజ్ఞుడను.

మన పోలీసువ్యవస్థను సంస్కరింపవలసిన యావశ్యక తను నిరూపించుటకే అందలి లోపములను పోలీసువారు చేయు అన్యాయములను విమర్శించితిని గాని పోలీసువారిపైన నాకు ద్వేషములేదు.

మన పోలీసువ్యవస్థలో మంచివారి నుద్దేశించి వారి ప్రతినిధిగా నా మిత్రుడు శ్రీ సూర్యదేవర రామచంద్రరావు గారికీ గ్రంథము నంకితము చేయుచున్నాను

దిగవల్లి వేంకట శివరావు



శ్రీ సూర్యదేవర రామచంద్రరావు

# BIBLIOGRAPHY


Britain - An Official Hand Book published by the Central Office of Information. London 1965.

Moriarty, C C.M. Police procedure and administration 1955.

Thomas, J. L. Police Administration 1957

C. Reith, A short History of British Police. 1948.

The Police and the Public, Edited by C. H. Rolph

The Police : By Ben Whitaker. Penguin Special 1964

Royal Commission on the Police 1962 H.M.S.O

The Police Service in Britian Reference pamphlet 1959.

The Police in Britain : Central Office of Information London 1965.

Sheffield Enquiry Report.

Manual or administration of the Madras Presidency C. D. Maclean 1884.

Police Powers and Duties-Krishna Murthi.

The Police Act. 1861

The Criminal Procedure Code.

Criminal Court Mannual

Duty Hints to Police Head Constables and constables, Government of Madras. (Telugu)

గ్రామోద్యోగస్థులయొక్కయు రైతులయొక్కయు మాన్యూలు మద్రాసు గవర్నమెంటు - 1937



లండన్ పోలీసు రహదారి డ్యూటీ

# ఆంగ్లేయ పోలీసు వ్యవస్థ

ఇంగ్లాండు, స్కాట్లాండు, వేల్సు, ఉత్తర ఐర్లాండు దేశములు కలిసిన బ్రిటను రాజ్యములోని పోలీసువ్యవస్థను బ్రిటీషు లేక ఆంగ్లేయ పోలీసు వ్యవస్థయని వ్యవహరింపవచ్చును.

బ్రిటన్ రాజ్యము స్వరూపమున రాజరికమైనను స్వభావమును బట్టి ప్రజాప్రభుత్వముగల శ్రేయోరాజ్యము.

బ్రిటన్ రాజ్యములోని పరిపాలనమును నిర్వహించువారు అక్కడి ప్రజాప్రభుత్వ సంస్థయగు పార్లమెంటుకు బాధ్యత వహించు మంత్రులు, ఆదేశము నేలు రాజు లేక రాణి ప్రజాప్రతినిధులుగల కామన్సుసభ, ఆ దేశములోని ప్రభువులసభ కలిపిన రాజ్యాంగ సంస్థకే పార్లమెంటు అని పేరు. అక్కడి మంత్రులు ప్రజల యభిమతము ననుసరించి ప్రజల క్షేమ లాభముల నాలోచించి పరిపాలింతురు.

బ్రిటను రాజ్యముయొక్క సామాన్య న్యాయశాస్త్ర ధర్మము (Common Law) ను బట్టియు పార్లమెంటువారు చేసిన శాసన విధులనుబట్టియు అక్కడి స్త్రీ పురుషులకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, వ్యక్తిగౌరవము, ఆస్తిహక్కులు సుస్థిరముగా నేర్పడియున్నవి. ప్రభుత్వోద్యోగులుగాని, వ్యక్తులు

గాని ఈ హక్కులకు భంగకరముగా ప్రవర్తించినచో వారి పైనవారులు న్యాయస్థానము లందభియోగముచేసి పరిహారము పొందుటకు వీలున్నది.

ఇంగ్లాండులోని ప్రజల ప్రాణ మానధనముల రక్షణ కొరకును అక్కడి ప్రజాప్రభుత్వ సంస్థయగు పార్లమెంటు వారు చేయు శాసనములను అమలు పరచుటకును, నేరములు జరగకుండ కాపాడుటకును నేరములు చేసినవారిని పట్టితెచ్చి న్యాయస్థానములందు హాజరుపరచిశిక్షింప జేయుటకును పోలీసు వ్యవస్థ స్థాపింపబడినది. మన దేశమునందువలె శాంతి భద్రతలను కాపాడుటలోను, నేరముల దర్యాప్తులోను నేరస్థులను పట్టుకొనుటలోను గృహావరణములందు ప్రవేశించుటకు సోదా చేయుటకుఅనుమానమున్న వారిని ప్రశ్నించిసంజాయిషీ పుచ్చుకొనుటకు, మనుష్యులను నిర్బధించుటకు ఆస్తిని పట్టుకొనుటకు పోలీసువారికి ప్రత్యేకాధికారముల నిచ్చుచు చేయబడిన శాసనములు ఇంగ్లాండులో లేవు. అక్కడి పోలీసువారు ఆదేశ సామాన్య న్యాయశాస్త్రమునకు బద్ధులై ప్రజల హక్కులకులోబడి యుక్తాయుక్తము లాలోచించి తమ కర్తవ్యములను నిర్వహింప వలసియున్నారు. పోలీసువారు నేరములు జరగకుండా నివారించుటలో న్యాయముగా ప్రవర్తించినారా లేదా అను అంశమును, పోలీసువారు నేరము మోపిన వ్యక్తి నేరము చేసినట్లు రుజువు చేసినారా లేదా యను నంశమును. నిర్ణయించునది. అక్కడి స్వతంత్రన్యాయ స్థానములందు న్యాయాధిపతికి సహాయముగా పరివేష్టించు

"జూరీ" యనబడు పండ్రెండుగురు సామాన్య సంసారులే. అందువలన పండ్రెండుమంది సామాన్య పెద్దమనుష్యులకు నచ్చునట్లు పోలీసువారు ప్రవర్తింపవలెను. నేరమును రుజావు పర్చవలెను. అట్టి ధైర్యమున్నగాని పోలీసువా రెవ్వరిని పట్టుకొనరు. ఇంతేగాక పోలీసువారు ఎవ్వరినైనా పట్టుకొనునప్పుడా వ్యక్తి శరీరమునకుగాని మనస్సునకుగాని ఎట్టిబాధయు కలుగకుండ ప్రవర్తింపవలెను.

పోలీసు వారొక నిందితుని అరెస్టుచేసి పట్టుకొనుటలో తప్పనిసరి యైనప్పుడే కొంతబలము ప్రయోగింపవచ్చును. అయితే ఆవశ్యకమైన దానికన్న హెచ్చుబలము ప్రయోగింపరాదు. నిందితుడు ఎదురు తిరిగి దౌర్జన్యముచేసినచో స్వసంరక్షణముకొరకు బలము ప్రయోగింపవచ్చును. అతడు అరెస్టునుండి తప్పించుకొనుటకు పెనుగులాడినచో వానిని లొంగదీయునంత బలమును మాత్రముపయోగించవచ్చును. వానిని స్మారకములేకుండ పడవేసినచో తీసికొని వెళ్ళుట సులభమనుభావముతో అట్టి బలప్రయోగము చేయరాదు. సాధారణముగా బీటు తిరుగు పోలీసువారు సంకెళ్ళు తీసికొని వెళ్ళరు. దౌర్జన్యముచేయు ఖైదీలకును తప్పించుకొని పోవుటకు ప్రయత్నించిన వారికిని మాత్రమే వానినుపయోగింతురు. నిందితునిపట్టుకొనిన వెంటనే మేజిస్ట్రేటు నెదుట హాజరుపరుచవలెను పోలీసువా రారోపించిన నేరముయొక్క స్వభావమును పరిస్థితులను ఆలోచించి మేజిస్ట్రేటు నిందితుని జ్యూరీ సహితమైన న్యాయస్థానమునందు విచారణ జరుపుట

కు త్తసవుచేయును. ఈలోపుగా నిందితుని స్వంత పూచీకత్తు మీదగాని, జామీనుమీదగాని విడుదల చేయవచ్చును. లేదా నిర్బంధముననుంచుట కుత్తవు చేయవచ్చును. ఈ కార్యక్రమమునందెట్టి లోపము జరిగినను నిందితుడు తన హక్కులకు భంగము కలిగినందుల కభియోగముచేసి పరిహారము పొందవచ్చును. యథా రాజా తథా ప్రజా అను న్యాయమునుబట్టి ప్రపంచములోని నాగరిక దేశములందు మంచి సంప్రదాయములుగల ప్రజాప్రభుత్వముగా - శ్రేయో రాజ్యముగానున్న ఇంగ్లాండులోని పోలీసువ్యవస్థలోని ఉద్యోగులను సామాన్య కానిస్టేబిలులనుకూడ తాము కేవలము నేరముల నివారణకును నేరస్థులను శిక్షింపజేయుటకు నేర్పడిన ప్రభుత్వోద్యోగులే గాక జనసామాన్యమునకు స్త్రీలకు పిల్లలకు వృద్ధులకు అశక్తులకు సర్వవిధములైన సహాయమును చేయవలసిన ప్రజాసేవకులమను భావముతో వ్యవహరింతురు.

ఇంగ్లాండులోని పోలీసువారు అప్రమత్తులై ప్రజాసేవ చేయుచున్నను అప్పుడప్పుడు వారేదో లోపము చేయుటయు ప్రజలు న్యాయస్థానములందు ఫిర్యాదు చేయుటయు ప్రజలు ప్రజాప్రతినిధులు పార్లమెంటులో విమర్శించుటయు వానిని గూర్చి బహిరంగముగా విచారించుటకు "రాయల్ కమీషన్" అను స్వతంత్ర విచారణ సంఘములు నియమింపబడుటయు జరుగుచుండును. అట్టి కమీషనులు ఇటీవల 1929 లోను 1960 లోను నియమింపబడినవి. వాని నివేదికలవలనను ఆంగ్లేయ గ్రంథకర్తలు వ్రాసినఉద్గ్రంథములవలన

ననుఇంగ్లాండు పోలీసు వ్యవస్థను గూర్చిన విశేషములు తెలియుచున్నవి.

ఇంగ్లాండు దేశములో 19వ శతాబ్దప్రారంభము నాటికి కూడా హత్యలు దారిదోపిడ్లు మొదలగు నేరములు పెరిగి పోవుచుండుటయు పూర్వకాలపు పోలీసువారు శాంతి భద్రతలు కాపాడలేక పోవుటయు చూచి 1829 లో అప్పటి ప్రధాన మంత్రియైన సర్ రాబర్టుపీల్ గారు మంచి పద్ధతుల పైన పోలీసు వ్యవస్థను నిర్మించిరి. నాటినుండి అది ఆ దేశ సామాన్య న్యాయశాస్త్ర సంప్రదాయములకు లోబడి పరిణతి చెంది ప్రపంచములో నొక గొప్ప వ్యవస్థగా పేరు పొందినది. ఇంగ్లాండులో పోలీసు ఉద్యోగములో చేరిన వారి కందరికిని ఈ క్రింది విధముగ బోధించుట పరిపాటైనది. "సమర్థతతో పనిచేయు పోలీసువారి ప్రధానకర్తవ్యము నేరములు జరగకుండా నివారించుట, నేరములు జరిగినప్పుడు వాని జాడలుదీసి నేరము చేసినవానిని కనుగొని వారిని శిక్షింపజేయుట, పోలీసువారు నేరములు జరుగకుండా నివారించుటకే ముఖ్యముగా తమ సర్వశక్తులను వినియోగించవలెను. ఒక వ్యక్తి నేరము చేసిన తరువాత దాని జాడలు తీసి వానిని శిక్షింపజేయుటకన్న అటువంటి నేరము జరగకుండా ముందుగనే నివారించుటవలన ప్రజల ప్రాణ మాన ధనములు, ఆస్తి రక్షణము ప్రజా శాంతిని కాపాడుట అను పోలీసు వ్యవస్థయొక్క ప్రధానోద్దేశ్యములు చాలా బాగుగా నెరవేర గలవు. నేరము చేసినవానిని పట్టుకొనుటమాత్రమే గాక

సామాన్య ప్రజలను రక్షించి వారికి సహాయము చేయుటకూడ గను కర్తవ్యమని పోలీసువారెఱుగవలెను. అందువలన నేరము జరుగకుండా అప్రమత్తులై నివారించుటకును, నేరముచేసిన వారిని పట్టుకొనుటకును కృషిచేయుటతోపాటు తాము సామాన్యజనుల సంరక్షకులమను భావముకలిగి, నీతి ధర్మములను పాటించి, శాసనవిధులకు బద్ధులై ప్రవర్తించు సామాన్య పౌరులపట్ల, వారు గొప్పవారా సామాన్యులా అను భేదము లేకుండా మర్యాదతోను సహానముతోను ప్రవర్తింపవలెను.

ఇంగ్లాండులోని ప్రజలలో నూటికెనుబదిమంది లండన్ నగరమునందును ఇతర పట్టణములందును నివసించుచున్నారు. అక్కడ వర్తక వ్యాపారములు విరివిగా జరుగును. ఇటీవల మోటారుకారుల యుపయోగము చాలా హెచ్చినది. అందువలన రాజబాటలపైన విపరీతమైన వేగముతో ప్రమాదకరముగా మోటారులు నడుపుటవలన రోడ్డు మోటారు నిబంధనల నుల్లంఘించుటవలన ప్రాణాపాయములు హెచ్చినవి. అందువలన లండన్ నగరములోను ఇతర పట్టణములందును గల పోలీసువారి ఉద్యోగ కర్తవ్య నిర్వాహణమునందు సామాన్య నేరములమాట అటుండనిచ్చి రోడ్లపైన ప్రాణాపాయములు కలుగకుండా కాపాడి నేరముల నివారణోపాయ విధులను అమలు పరచుటలోను, ఇండ్లలోను, షాపులలోను దొంగతనములు జరుగకుండా నివారించుటలోను వారి సర్వశక్తులును కాలమును వినియోగింపవలసి వచ్చుచుండును. పూర్వ మింగ్లాండులో, లండన్‌లోను

పట్టణములలోను ఇండ్లకు షాపులకు నిప్పంటుకొనినపుడు స్త్రీ పురుషులను రక్షించుట అగ్నిని చల్లార్చుట మొదలగు పనులు పోలీసువారే చేయుచుండిరి. ఇటీవల అగ్నిమాపక (ఫైరుసర్వీసు) ప్రత్యేకముగా నేర్పరుపబడినది. ఇట్లే ఆకస్మిక ప్రమాదములందు స్పృహతప్పి పడిపోయినవారిని స్ట్రెచరు పైన పరుండబెట్టి బండ్లపైన ఆసుపత్రికి చేరవేయు పనినికూడా పోలీసువారే చేయుచుండిరి. ఈ పనులను చేయుట కిప్పుడు ప్రత్యేక "అంబ్యులెన్సు" సర్వీసు ఏర్పాటు చేయబడినది. ఈవిధమైన ప్రజాసేవ చేయుటకలవాటుపడిన వృద్ధపోలీసువారిది చేయు అవకాశము పోయినందులకు వగచుచుందురు.

ఇంగ్లాండు లోపల జిల్లాలలోను గ్రామ ప్రాంతములందును పెంపుడు జంతువులను గాతులను కోళ్ళను దొంగిలించువారిని పట్టుకుని శిక్షింపచేయుట పోలీసువారి ముఖ్యమైన పనిగా నున్నది. అక్కడ అగ్ని ప్రమాదములు కలిగినప్పుడు ప్రజా రక్షణముచేసి అగ్నిని చల్లార్చు పనిని పోలీసు వారే చేయుచున్నారు. గ్రామములలో పశువులకు కలుగు అంటువ్యాధులు వ్యాపించకుండా నివారణ చేయునదియు పోలీసువారే. ఈ పనులు రోజు కిరువది నాలుగు గంటలును పోలీసువారికి పని కల్పించును. ఇదిగాక గ్రామ సంస్థల కే పనికావలసినను పోలీసువారిని సహాయము చేయుమని కోరుచుందురు. గ్రామ పోలీసు కానిస్టేబిలును ఆ బీటులో వసించు కుటుంబములవారు ఇన్‌కంటాక్సు ఫారములలోని వివరములు పూర్తిచేయుటకు అతని సహాయము కోరుదురు.

ఇంతేగాక తమ కుటుంబములో జబ్బులువచ్చినప్పుడు అతనిని వైద్యసలహా నడుగుదురు. వివాహ విషయములందును గృహచ్ఛిద్రములలోనుకూడా సలహా అడుగుచుందురు. గ్రామములోనివారికి సహాయముచేయుట స్త్రీలకును పిల్లలకును ఒకవిధమైన సంరక్షకుడుగా నుండుట పోలీసువారిలో చాలామందికి సంతోషమును సంతృప్తిని కలిగించుచుండును. అయితే ఒక్కొక్కప్పుడు ఇండ్లలో అద్దెకుండువారిని వెడలగొట్టవలసినప్పుడు పోలీసువారు హాజరుగా నుండవలసి వచ్చును. ఇటువంటిపనులు వారి కంత సంతోషకరములు కావు. ఏ పని చేయవలసివచ్చినను పోలీసువారు తమ కర్తవ్య నిర్వహణమునందు ఇష్టానిష్టములు ప్రదర్శించుటకు వీలులేదు. ఇంగ్లండులోని పోలీసువారు తమ యుద్యోగములో చేరినప్పుడు నిర్భయముగను, నిష్పక్షపాతముగను, నిర్మొగమాటముగను కర్తవ్య నిర్వహణము చేయుదుమని ప్రమాణము చేయుదురు.

పోలీసువారి యుద్యోగ ప్రమాణమునుబట్టి వారు రాజసేవకులేగాని స్థానిక పరిపాలకసంస్థలక్రింద నౌకరులుకారు. అయినను వారు స్థానిక పౌరుల అభిమతమును నెరవేర్పవలసి వచ్చుచుండును. గ్రామ పరిసరములలో నేరములు నివారణ చేయుటకు బీటుతిరుగుచు నేరములు జరుగకుండా నివారింపవలెను. మన దేశములో చెంచువారు మొదలగు దేశద్రిమ్మరి జాతులవంటి జిప్సీలను జాతివా రాదేశములో గ్రామములకు వచ్చుచుందురు. వారిని ప్రక్క జిల్లాలకు పంపివేయుటకు పోలీసువారు సహాయముచేయవలసి యుండును. ఇంక నెన్నో

కర్తవ్యములు నిర్వహింపవలసి యుండును. పూర్వము స్థానిక సంస్థల అధికారులు పోలీసు కానిస్టేబిలుచేత యింటిపనులు చేయించుకొనుచుండిరి గాని అట్టివిప్పుడులేదు. మోటారుకారు నడుపుట దానిని కడుగుట మొదలగు ఇంటిపనులను మన దేశములోని పోలీసుఅధికారులు కానిస్టేబిలులచేత చేయించు కొనుట చూచుచున్నాము. ఇట్లు అక్కడను కొందరు చేయించుకొనుచుండిరి గాని ఇప్పుడది లేదు. దేశములో ప్రభుత్వమువారికి స్థానికసంస్థల పరిపాలకవర్గములవారికిని వ్యక్తులకును మధ్య సంఘర్షణలువచ్చినప్పుడు పోలీసువారు దాని తాకిడిని భరింపవలసి యుండును.

పోలీసుఉద్యోగి సామాన్యయుద్యోగ ధర్మములనే గాక అనేక కర్తవ్యములను నిర్వహింపవలసిన ప్రజాసేవకుడుగా నుండవలెనని ఇంగ్లాండు పార్లమెంటువారి యుద్దేశ్యమైనట్లు వారుచేసిన శాసన విధులనుబట్టి కనబడుచున్నది. అతడు స్థానిక ప్రభుత్వ సంస్థలమధ్యను, ప్రజలమధ్యను వచ్చు తగవులందు మధ్యవర్తిగా పనిచేయవలెను. సంఘసేవకుడుగా పనిచేయవలెను. న్యాయవాదిగాను, వైద్యుడుగాను పని చేయవలెను. న్యాయ పరిపాలనమునందు పాల్గొనవలెను. అయితే ఈ వివిధకర్తవ్యముల నిర్వహణమున కావశ్యకమైన విద్యగాని, తర్ఫీదుగాని అతనికి లేదు. తన తెలివితేటలనుబట్టి శక్తియుక్తులనుబట్టి పనిచేయుచుండును.

ఇంగ్లాండులోని పోలీసువారు అక్కడి ప్రభుత్వ సంప్రదాయములనుబట్టి తమ శక్తివంచనలేకుండా ప్రజాసేవ చేయుచుందురు. సాధారణముగా వారక్కడి ప్రజ లేమను కొందురో అను భయముతో అప్రమత్తులై ప్రవర్తింతురు. చాలామంది పోలీసువారు తమ కర్తవ్య నిర్వహణమునందు తమ కెన్ని బాధలు కలిగినను సహింతురు. మనదేశములోని వారివలె చీటికిమాటికి విసిగికొని కోపింపరు. వారు ప్రజలలో మంచిగా నుందురు. వారు సామాన్య ప్రజలు. ప్రజలేదైన పొరపాటుచేసినచో సౌమ్యముగా మందలింతురు. మోటారు బండ్లు నడుపునపుడు వారు శాసనవిధుల నుల్లంఘించినపుడు వారిని నిలిపి సరియైన విధానములను బోధించి పంపివేయు దురు. శాసనవిధులను బుద్ధిపూర్వకముగా నుల్లంఘించినవారిని మందలించి వదలుదురు. నేరముచేసినవారి పేరులు చిరు నామాలు వ్రాసికొని పంపి చర్య తీసికొందురు. వారిని దూషింపరు. వారిపైన దౌర్జన్యము గావింపరు. నేరముచేసిన వారిపైన కోపముగాని ద్వేషముగాని వహింపరు. నేరస్థులను మేజిస్ట్రేటు నెదుట హాజరుపరచి శిక్షింప జేయుదురు. ఇట్లు పోలీసువారు తమ కర్తవ్య నిర్వహణమునందు యుక్తాయుక్త వివేచనముతో ప్రవర్తింతురు. చాలామంది పోలీసువారు కేవలము తమ ఉద్యోగధర్మము నిర్వహించుటతో తృప్తి చెంది యూరకొనక యువక సమాజములు మొదలగు ప్రజా సంఘములద్వారా స్వచ్ఛంద ప్రజాసేవ చేయుదురు. ధర్మాత్ములైన పోలీసువారు నేరములకు శిక్షింపబడినవారి కుటుంబము బాధపడుటచూచి కరుణతో

వారికి సహాయము చేయుదురు. చెరసాలనుండి విడుదలైన వారికి జీవనాధారముకల్పించుటకు తోడ్పడుదురు. ఇంగ్లాండు పోలీసువారికి మనపోలీసువారికివలె తుపాకీ కత్తి లాఠీలు మొదలగు ఆయుధములులేవు. ఫ్రెంచి దేశములోని ఆయుధపోలీసువారి వంటివా రింగ్లాండులో లేరు. నిరాయుధులుగా పోరాడుట కింగ్లీషు పోలీసువారిని తర్ఫీదు చేయుదురు. పోలీసుఉద్యోగులు ధరించుఇజారు (పంట్లాము) కుడికాలు జేబులోనియుండగల చిన్న లాఠీకర్రమాత్రము ధైర్యముకొరకు కొత్తురు. దానిని వారు సాధారణముగా నుపయోగింపరు. మనదేశములో పూర్వము పోలీసువారికుండిన బేటన్ అను నునుపైన లావుపాటిలాఠీగాని, ఇటీవల సత్యాగ్రహోద్యమమునందు మనపోలీసువారు లాఠీఛార్జిలలో నుపయోగించిన ఇనుపపొన్నుగల వెదురుకర్ర లాఠీగాని ఇంగ్లాండు పోలీసువారికి లేవు. లాఠీఛార్జిఅనునది దేశములో జరుపుటకు వీలులేదు. ముప్పదేండ్లక్రిందట తీవ్రబాధ ప్రదర్శనములు జరిపిన జనసమూహములను చెదరగొట్టుటకు పోలీసువారు బేటనుల నుపయోగించిరి. అంతేగాక ఆశ్వీక పోలీసు దళమువారు గుఱ్ఱములను జనసమూహముపైకి తోలిరి. దీనిని ఇంగ్లీషు ప్రజాప్రతినిధులు గర్హించిరి. రెండవ ప్రపంచ సంగ్రామము (1939-45) నుండి పోలీసువారిట్లు చేయరాదని నిషేధింపబడినది.

గత ఇరువదేండ్లలో నింగ్లాండు పోలీసువారిపైన దుండగీండ్రుచేయు దౌర్జన్యములు ప్రబలినవి. 1962లో లండన్ నగరములో వెస్టు ఎండ్ సెంట్రల్ పోలీసుస్టేషనులో

పనిచేయు 112 ఆఫీసరులపైన దుండగులు దౌర్జన్యములుచేసిరి. అయినప్పటికిని ఇంగ్లీషు పోలీసువారు తమ కాయుధములు కావలెనని కోరలేదు. దీనికి, కారణము తాము ఆయుధములు ధరించినచో ప్రజలకు తమపైనగల సద్భావము నశించుననియె. ఇంతేగాక తా మాయుధములు ధరించినచో దుండగులు నాయుధముల నుపయోగింతురు. ఏదైన ఒకానొక ప్రత్యేక సందర్భమునందు ఆయుధములు అవసరమైనప్పుడు పోలీసువారు తుపాకీ మందుగుండు ఆయుధముల నడిగిపుచ్చుకొనుటకు వీలున్నది. అయితే అట్టి సందర్భములు సంవత్సరమునకు పదిమారులకన్న తటస్థింపవు. సామాన్యముగా అధికారు లాయుధము లిచ్చెదమన్నను పోలీసుకానిస్టేబిలులు పుచ్చుకొనరు. దీనికి కారణముప్రజలలో సద్భావము నశించుననియే.

నేరములను నివారించుటలోను నేరముల జాడలుతీసి నేరస్థులను పట్టుకొని శిక్షింపజేయుటలోను ఇంగ్లీషుపోలీసు వారికి గల అధికారములు అనిర్ణీతముగను అనిర్దిష్టములుగను నున్నవని వారికిగల అధికారములు చాలవనియు నిరపరాధులకు నష్టములేని కొన్ని అధికారములను పోలీసువారికిచ్చుట ఆవశ్యకమనియు కొందరు న్యాయశాస్త్రవేత్తలు అభిప్రాయపడుచున్నారు.

ఇంగ్లాండులో లండన్ నగరమునందును మాంచెష్టరు, బర్మింఘాము, హెర్డుఫర్డు, బ్లాకుబరను, రాకేలు, బ్రైన్ హెడ్, శాక్ఫర్డు, లివర్పూల్, చెష్టర్, వాల్లసీ, లాల్వ



జన సమూహామును అడ్డగించు విధానము

రాంస్టన్, బారోఇల్‌పర్నెస్, సౌత్ ఎండ్, రాతెర్‌హామ్, సౌతాంప్టను నగరములందును మాత్రము పోలీసువారు అనుమానము పైన ఒక వ్యక్తిని ఆపి సోదాచేసి నిర్బంధమున నుంచుటకు వీలున్నది. తక్కిన ప్రదేశములలో అట్లు చేయుటకు వీలులేదు. సాధారణముగా పోలీసువారు దబాయింపుతో గాని మరి ఏ ఉపాయముచేతగాని న్యాయశాస్త్ర విధుల చిక్కునుండి తప్పించుకొని కార్యసాధన చేయుచునే యుందురు. పూర్వ మెవ్వరినైనను దబాయించి నిన్ను ప్రశ్నించవలసియున్నది, నాతో రావలెనని పోలీసు ఉద్యోగి దబాయించినచో ఆ వ్యక్తి మారు మాటాడక వెళ్లుచుండును. అయితే ఇటీవల ప్రజలలో చాలమందికి న్యాయశాస్త్రమును బట్టి తమకుగల హక్కులు తెలియును. అందువలన ఇది కష్టమగుచున్నది. పోలీసు వారికి అవసరమైన అధికారములను స్పష్టముగా వివరించుచు శాసన విధులను చేసినచో వారు తమ కర్తవ్యము నిర్వహించుటలో హద్దుమీరరని అనుభవజులగు పోలీసు వారు చెప్పుచున్నారు.

ఇంగ్లాండులో నేరము చేసిన వానిని పోలీసువారు నీ పేరేమని నీ చిరునామా నివ్వమని అడిగినప్పుడు అతడు చెప్పనిచో అతని అనుపానులు తెలుసుకొనుట కచ్చటి పోలీసు వారు చాలా చిక్కులు పడుచుందురు. అది తెలుసుకొనుటకు వారికి మార్గములేదు. నిన్ను చార్జి చేయువరకుఆగవలసినదని అతనిని ఆపియుంచుట కధికారము లేదు. అట్టివాడు తనపేరు చిరునామా చెప్పనిరొమ్డలను, చెప్పినది నిజము కాదని అనుమానము కలిగినను వానిని అరెస్టు చేయుటకు మనదేశ

ములో నొక శాసన విధియున్నది. ప్రతి మనుష్యుడు నొక గుఱుతుపత్రమును తన ఫొటోతో సహా ఉంచుకొనునట్లు దక్షిణాఫ్రికాలో కావలె ఒక శాసన విధియున్నచో చాలాబాగుండునని కొందరాంగ్లేయులు సూచించిరి. జ్ఞాపకశక్తి నశించి దేశద్రిమ్మరులైన వారి నిండ్లకు చేర్చుటకు నిది నుపయోగించును. కాని నిట్టి ఏర్పాటు ఇంగ్లండులోని స్వాతంత్ర్యప్రియులు చేయరు. ఇంగ్లాండులోని న్యాయశాస్త్రము (లా) ప్రకారము పోలీసువారు ప్రయివేటు వ్యక్తుల నివేశనముల లోనికి ఆవరణములలోనికి ప్రవేశించుటకు వీలులేదు. ఎలక్ట్రిక్ ఇన్స్పెక్టరు గ్యాస్ ఇన్స్పెక్టరులు ప్రవేశింపవచ్చును. మనదేశమునందువలె అక్కడ పోలీసువారికి దొంగసొమ్ము పట్టుకొనుటకుగాని సాక్ష్యము సేకరించుటకుగాని నివేశనమును ఆవరణమును సోదా చేయుటకు వీలులేదు. ఆ నివేశనము యజమానివచ్చి చూచుకొనుమని కోరినగాని ప్రవేశింప వీలులేదు. కొన్ని నేరములలో మేజస్ట్రేటు వారంటు నిచ్చినగాని సోదా చేయుటకు వీలులేదు. పోలీసువారు అరెస్టుచేసిన వ్యక్తుల ఇండ్లను వారంటులేకుండా సోదాచేయుట చిరకాలమునుండి జరుగుచున్నది గాని ఇది శాస్త్రీయముకాదు. న్యాయనిర్ణయమున కిది యవసరమే. ప్రజల స్వాతంత్ర్యమున కిది భంగకరమని అనుకొన నక్కరలేదనియు దీనిని న్యాయసమ్మతము చేయుట మంచిదనియు 1929 లో రాయల్ కమీషనువారు సూచించిరిగాని ఇది జరుగలేదు. ఇది శాస్త్రీయము కానందున పోలీసువారుచేయు నిటువంటి సోదానుగూర్చి

న్యాయస్థానములో అభియోగము జరిగినప్పుడు పరిహార మిప్పించుట జరుగుచుండును.

అనుమానమున్నవారిని ప్రశ్నించుటకొరకు తాత్కాలికముగ నిరోధించి యుంచుట (Detention for questioning) మన దేశములో శాసన సమ్మతముగ నున్నది. ఇంగ్లాండులో నది శాస్త్రీయముకాదు. ఇది శాస్త్రసమ్మతము చేయుడని కమీషనువారు సిఫారసు చేసినను జరుగలేదు. అందువలన పోలీసువారేదో నేరము జరిగినట్లు బూకరించి మనుష్యులను నిలిపియుంచి ప్రశ్నించుట జరుగుచుండును. లా ప్రకారము హక్కులేనప్పటికిని ఇది ఆవశ్యకమే యని కొందరు మేజస్ట్రీటులుకూడా అభిప్రాయపడుట తటస్థించినది. న్యాయాధిపతులు హర్షించు న్యాయశాస్త్ర విధులను మీరి చరించుట కొన్ని సందర్భములందు పోలీవారికి అవసరమగుచుండును. ఇది పోలీసువారికి ప్రజలకు మధ్య అపోహలకు కారణమగుచుండును. న్యాయశాస్త్రప్రకారము తమకు తగిన అధికారములు లేకపోవుటవలన అశాస్త్రీయ పద్ధతు లవలంబింపవలసి వచ్చుచున్నదని అది బయల్పడినప్పుడు తాను న్యాయస్థానములందు నష్టపరిహారము నొసగవలసివచ్చునని ఆంగ్ల పోలీసువారు కొందరనుచుందురు. ఆంగ్లదేశములోని న్యాయశాస్త్ర నిబంధనలనెల్ల యథాతథముగా పాటించినచో ఒక్కొక్కపుడు నేరస్థులను శిక్షింపచేయుటయే దుర్లభమగుననియు అప్పుడు కూడప్రజలు తమ్ము నిందింతురనియు పోలీసువారు చెప్పుదురు.

దొంగతనములుజరిగినప్పుడు పోయినసొత్తుకొరకు తెల్లవారగనే సోదాచేయుట అత్యావశ్యకము. అయితే వారంటుపుచ్చు కొనిగాని సోదాచేయుటకు వీలులేదు. దీనివలన ఆలస్యము జరుగును. ఈలోపుగా ఇంటికి కాపలాపెట్టినయెడల ఇంటివారు పరువునష్టమునకు దావా చేయుదురు. అందువలన నీ విషయ మున న్యాయశాస్త్రవిధులు చేయవలెనని ఇంగ్లాండులోని పోలీవారి బాధల నెరిగినవారు సూచించుచున్నారు. చాలా ప్రమాదకరముగా మోటారుకారును నడిపిన నేరమును గూర్చిన సాక్ష్యము సేకరించుటకు ఆ మోటారుకారును వికోధించి అపుటకు పోలీసువారి కధికారము లేదు. మోసగింపు నేరమునకు సంబంధించిన కాగితములను పట్టుకొనుటకుగాని హత్యలో నుపయోగింపబడిన ఆయుధమును తెప్పించుటకు గాని పోలీసువారి కధికారములేదు. దానికై వారంటు పుచ్చుకొనులోపల ఆలస్యమగును. నేరస్థుడు నేరమును గూర్చిన జాడలు సాక్ష్యమును రూపుమాపును.

ఇంగ్లాండులో అక్రమముగా సేకరింపబడుసాక్ష్యమైనను అది ఆధారపూర్వకమైనట్టిదైనను లిఖితమూలక పత్రముల సాక్ష్యమైనను న్యాయస్థానము లంగీకరించునుగాని అమెరి కాలో అన్యాయముగా సేకరింపబడిన సాక్ష్యము ఎంత సత్యమైనదైనను ఎంత సంగతమైనదైనను (relevent) అది కలుషితమని అంగీకరింపరాదని 1914లో సుప్రీంకోర్టువారనిరి. పోలీసువారు సాక్ష్యమును సేకరించుటలో నింగ్లాండులో కొన్ని చిక్కులున్నవి. టెలిఫోనుసంభాషణను పోలీసువారు

మధ్యల్లో (tap లాగి నేరముల స్థాపనమునం దుపయోగింప
వలెనన్న చో ముందుగ (హోంసెక్రటరీ) దేశీయమంత్రిగారి
అనుమతి పొందవలెను. మోటారుకారులను విపరీత వేగముతో
నడిపి ప్రమాదములు కలిగించు నేరము కనుగొనుటకు రహస్య
ముగా నొక మీటరును పెట్టుటకు పోలీవారు ప్రయత్నింపగా
హాస్యాబ్రకన్ బరో కౌన్సిల్ వారు అంగీకరింపలేదు. (సి. ఐ. డి.)
అపరాధ రహస్య పరిశోధక శాఖవారు ప్రభుత్వముపట్ల జరుగు
రాజద్రోహములు మొదలగు నేరములను పరిశోధించుట
కింగ్లాండులో వీలున్నదిగాని ప్రయివేటు నేరముల జాడలు
తీయుటలో నుపయోగించుటకు ఇంగ్లాండు ప్రజాప్రతినిధులు
అంగీకరింపలేదు.

పోలీవారు జరిగించు అక్రమములకును బాధలకును
న్యాయస్థానమునందు హేబియస్ కార్పస్ రిట్ అను అభియోగ
మున కవకాశముండుట ఒక గొప్ప పరిహారక సాధనముగా
నున్నది. అధికారములు మీరినవారి పైన దావా వేసి నష్ట
పరిహారము పొందుటకు వీలున్నది. సాధారణముగా పోలీసు
వారిపైన చేయు ఫిర్యాదులందు పోలీసువారిమాటనే నమ్మ
దురుగారి ఫిర్యాదీమాటను నమ్మరు. ముద్దాయి పోలీసువారిని
నిందించినచో వాని కిదివరకుపడిన పాతశిక్షను బయల్పరచుట
న్యాయసమ్మతమగును. న్యాయమున కప్పుడు జరిగిన నేరము
నకు శిక్షించుట యుక్తముగాని పాతపురాణమును త్రవ్వి

యొక్కట అపమండపమే. సాధారణముగా పోలీసువారు పాత నేరస్థులవల్లనే అక్రమములు జరిగించుచుందురు.

నేరమును రుజావు చేయువరకు నిందితుడు నిర్దోషిగ నెంచబడవలెనను ఇంగ్లీషు న్యాయశాస్త్రసూత్రము ఇంగ్లీషు ప్రజలకు గొప్ప రక్షణముగా నున్నది. గాని ఇందులోకూడా ఒక లోపము వచ్చి చేరినది. 1871 సంవత్సరపు నేరముల నివారక చట్టముక్రింద ప్రాత నేరముల చరిత్రగలవానిని అనుమానముపైన పట్టుకుని జైలులో పెట్టవచ్చును. ఇట్లే 1924 సంవత్సరపు (వే గన్సీ) దేశద్రిమ్మరి చట్టముక్రింద ప్రాత నేరస్థు డెక్కడనైన అనుమానాస్పదముగా తచ్చాడు చున్నచో పట్టుకొని శిక్షింపవచ్చును.

అనుమాన మున్నవారిని పోలీసువారు ప్రశ్నించుటలో నీవు చెప్పునది నీకు వ్యతిరేకముగా నుపయోగింపగలము సుమా అని హెచ్చరికచేయుట అవసరము. అట్లుచేయనిచో నది గొప్ప దోషమగును. శారీరక మానసికమైన ఒత్తిడిలేనిది ఎవ్వడైన నేరము నంగీకరించునా ? జబ్బుమనిషి స్థితికూడా అట్టిదే. ఇట్టి స్థితిలో నీ హెచ్చరికవలన ప్రయోజనములేదు. ఒప్పుదల ఐచ్ఛికమైనదిగను బుద్ధిపూర్వకముగ చేసినదిగనుండ వలెను. ఒప్పుదలలోని కొన్నిభాగములుగాక పూర్తిపాఠము నుపయోగింపవలెను. ఎవ్వరైన సొలిసిటరుగాని న్యాయ వాదిగాని ఇతర పెద్దమనుష్యుడుగాని సాక్షిగా నున్నప్పుడు ఆయన సమక్షముననే ఒప్పుదలను వ్రాయవలెను. ఇట్లే ప్రశ్న

లకు జావాబులను వ్రాయవలెను. అక్కడ (Interrogation) నిందితుని ప్రశ్నించి సంజాయిషీ పుచ్చుకొనుట చాలా ప్రమాదముతో కూడినపని. అది యథాతథమై యదార్థమై యుండవలెను. 1950 లో పార్లమెంటు నోట్సు సంక్షిప్తలిపి సంగ్రహణమును న్యాయస్థానంవారంగీకరించిరి. ఇట్టివెట్టి మోసములు లేని టేపురికార్డింగు నుపయోగింపవచ్చును. అయితే అదికూడ పూర్తిపారదర్శమై యుండవలెను. నేరస్థుని స్వయముగా (స్టేటుమెంటు) వాఙ్మూలమును పోలీసులకు వ్రాసి యివ్వ వచ్చునని ఇంగ్లాండులో నొక క్రొత్త నిబంధన చేసినారు. అది మంచిపని. పోలీసువారు వ్రాయునది వినికిడి సాక్ష్యమగును కదా. ముద్దాయి వ్రాసినది ప్రత్యక్షసాక్ష్యమగును నిందితుని వలనసమాచారము సేకరించుటలో పోలీసుస్టేషనులో నేమి చేయ వచ్చును, ఏమి చేయగూడదు. అను విషయములును ఇంగ్లాం డులో స్పష్టముగా లేవు. న్యాయస్థానమునవిచారణ జరిగినపుడు అక్కడజరిగినకార్యక్రమములో కొన్నిటినిహర్షించును, కొన్ని టినిగర్హించుచుండును. అయితే పోలీసుస్టేషనులో జరిగిన సంగ తులను స్వతంత్ర సాక్ష్యముతో ఋజువుపరచినచో న్యాయా ధిపతి తృప్తిచెందును. లేనిచో అనుమానపడును.

ఇంగ్లండులో సాక్షులను న్యాయస్థానమునకు రప్పించుటకు పోలీసువారి కిప్పటికన్న హెచ్చు అధికారము లుండవలెనని ఇటీవల కొన్ని కేసులలో సూచించబడినది. రాజకీయ సాక్షులను తప్పతక్కినసాక్షులను(extradite) సాక్ష్య మివ్వగలందులకు గ్రామమువిడిచి వెళ్ళునట్లునిర్బంధచర్యతీసికొనుట అవశ్యకమగు

చున్నది. ఇంగ్లాండులో సాక్షులవలన పూచీకత్తులు పుచ్చుకొందురు. లేదా నిర్బంధమున నుంతురు. దీనివలన సాక్షులకు చాలా బాధలు కలుగుచున్నవని దీనిని గూర్చిన రక్షణ మవసర మని విమర్శలు వచ్చినవి. నేరములను గూర్చిన సాక్ష్యమును సేకరించు విషయములోకూడా ఇంగ్లాండులోని పద్ధతులు సంతృప్తికరముగా లేవని కొందరు విమర్శించినారు ఐరోపా లోని ఇతర దేశములలో ఒక నేరమును గూర్చి ఎవ్వరికైనా తెలియునినితో చినప్పుడు (Juged instruction) అనుమానమున్న వానిసేగాక ఇతరులనుకూడ ప్రశ్నించిరంజాయిషీ పుచ్చుకొనుటకును వారు జవాబు చెప్పని వో శిక్షించుటకును అధికారము లున్నవి. ఇంగ్లాండులో కూడా అట్టి యధికారములున్న బాగుండునని కొందరి యూహా. ఇంగ్లాండులోను ఇంగ్లీషు మాటలాడు దేశములలోను సాక్షులను కోర్టుకు రప్పించుటకు సమనులు, వారంట్లు జారీ చేయుదురు. వారిని నేరములలోని కొకించు ప్రశ్నలు అడిగి జవాబు చెప్పుమని నిర్బంధించుటకు మాత్రము వీలులేదు.

ఇంగ్లాండులో ముద్దాయి తన తరఫున సాక్ష్యమివ్వ వచ్చును ఇవ్వకపోవచ్చును. అతనిని ప్రశ్నించినప్పుడు జవాబు చెప్పకుండ నుండవచ్చును. దీనిని పురస్కరించుకొని అతని పట్ల వ్యతిరేక నిర్ణయము చేయుటకు వీలులేదు.

అధికార రహస్యముల చట్టము (Official secrets act) క్రింద నేరములను గూర్చిన సంజాయిషీ ఇవ్వనిచో శిక్షింప వీలున్నది.

ఒక మోటారుకారు ప్రమాదనేరము జరిగినప్పుడు మోటారు నడిపిన వారెవ్వరో చెప్పకపోయినచో శిక్షించుటకు ఇంగ్లాండులో వీలున్నది. అయితే దోపిడిగాని హత్యగాని ఇతర నేరముగాని జరిగినప్పుడీ సూత్రము నుపయోగింప వీలు లేదు. దీనికి కారణమును ఇంగ్లండులో న్యాయవిచారణము నందు క్రికెట్టుఆటలోవలె ఒక విధమైన (Spartive) న్యాయము పాటింపవలెనని ప్రజలలోగల భావమే.

ఒక నేరము జరిగినప్పుడు ముద్దాయి తానాస్థలమున లేనని అన్యప్రదేశమున నుంటినని "అలిబీ" వాదన చేసినప్పుడు అది నిజమూ కాదా అని విచారించుటకు పోలీసు వారికి అవకాశముండునట్లు న్యాయస్థానములో అట్టివాదము ముందుగ చేయవలెనని సూత్రీకరింపవలెనని కొందరి యుద్దేశ్యము. ఇట్లు న్యాయస్థానములందు ముద్దాయిని ప్రశ్నించుటకు వీలున్నచో పోలీసువారు ప్రశ్నించుటలోని చిక్కులుండవని వారి యూహ.

నిందితుడు నేరమును ఒప్పుకొనుచు ఇచ్చిన వాజ్మూలము ఐచ్ఛికముగ నుండవలెనని వానికెట్టి నిర్బంధము నుండ కూడదని పోలీసువారి వశముననుండగా చేసిన ఒప్పుదలలు న్యాయముగ నుండవని చాలా తర్జన భర్జనలు జరిగినమీాదట

1872లో ఇండియాలో సాక్ష్యస్మృతి నిర్మాణము చేయుటలో పోలీసువారు పుచ్చుకొన్న సంజాయిషీని న్యాయస్థానమున నుపయోగింపరాదనియు మేజిస్ట్రేటు సమక్షమున చేసిన ఒప్పుదలను న్యాయస్థానమున అంగీకరింప వీలుకలదనియు శాసించిరి. అయితే ఇట్టి నిబంధన ఇంగ్లండులో లేదు. ఉండిన బాగుండునని కొందరి యభిప్రాయము. ఈ విషయములందు విశేషానుభవముగల వారిట్టి ఒప్పుదలలుకూడా నిజముగా ఐచ్ఛికములుగ నుండవని పోలీసువారు ముద్దాయిని బాధించి మోసగించి సామదానభేద దండోపాయములచేత మేజిస్ట్రేటు దగ్గర ఒప్పింతురనియు చెప్పియున్నారు. ఇట్టి యుదాహరణములు బయల్పడినవి. మానవ స్వభావమునుబట్టి ఆదుర్దాగాని సానుభూతిగాని, భయముగాని, బుజ్జగింపుగాని, బెదిరింపుగాని, సూటిపోటి మాటలుగాని ఇంక నెన్నో విధములైన పద్ధతులుగాని ఒక మనుష్యునియొక్క మతిని చలింప చేయగలుగును. అందువలన శారీరకమైన మానసికమైన ప్రభావములేని ఒప్పుదల యుండుట దుర్లభము. దీనినిగూర్చి ఎంతో జాగ్రత్త వహింపవలసియుండునని ఇంగ్లీషు న్యాయశాస్త్రవేత్తల యభిప్రాయము.

ఇంగ్లాండులోని సామాన్య పోలీసువారును స్పెషల్ పోలీసువారునుకూడా సామాన్య ప్రజలవలెనే అక్కడి సామాన్య న్యాయశాస్త్రమునకు బద్ధులైయున్నారు. అందువలన వారు తమ కర్తవ్య నిర్వహణమునందు సామాన్య న్యాయశాస్త్రమునుబట్టి ప్రజలకుగల హక్కులకు భంగము కలిగించుటకు వీలులేదు. వారి చర్యలు న్యాయస్థానములందే

ప్పటికప్పుడు విమర్శింపబడుచుండును. ఏదైన ప్రత్యేక పరిస్థితులందు వారి చర్యలను పార్లమెంటువారు విమర్శించి అందు క్రమాక్రమములను న్యాయాన్యాయములను సాకల్యముగా విచారించి పరిశీలించుటకు "రాయల్ కమీషన్" అనువిచారణ సంఘములను నియమించుచుందురు.

ఇంగ్లాండులోని పోలీసువారికికూడా అక్కడిసామాన్య పౌరులకుగల ప్రాతిపదిక స్వత్వములుండును. పోలీసువారు తమ ఉద్యోగ ధర్మముల నిర్వహణమునందు ఉద్యోగకాలమున ఉద్యోగ ప్రదేశమునగాక తమ అధికారమండలము వెలుపల సామాన్యపౌరులుగ పరిగణింపబడుదురు. అట్టి పరిస్థితిలో వారు జరిగించు చర్యలకు ఉద్యోగ ధర్మము ననుసరించి జరిపినట్లెంచబడవు. ఉదాహరణమునకు ఎవ్వడైన మోటారుకారును అతివేగముతో నడిపి ఎవ్వరికైన ప్రమాదము కలిగి పారిపోవుచున్నచో ఆ నేరస్తుని పట్టుకొనుటకు పోలీసువారు తమ మోటారును అతివేగముగా నడుపవచ్చునుగాని అట్లతి వేగముగా నడిపిన పోలీసు డ్రయివరు ఎవ్వరికైన ప్రమాదము కలిగించినచో అతడు న్యాయశాస్త్ర ప్రకారము ఆ నేరమునకు శిక్షార్హుడగును. ప్రమాదకరముగా కారు నడిపినందులకు న్యాయస్థానమునందతనిపైన కేసు దాఖలు చేయబడి విచారణ జరుగును.

ఇంగ్లాండులోని పోలీసువారు సాధారణముగా ప్రజాభిమతమును న్యాయశాస్త్ర ధర్మములను పాటించి కర్తవ్య

నిర్వాహణము చేయుచుందురు. అయితే అక్కడకూడ అప్పుడప్పుడు కొంతమంది పోలీసువారు నీతి ధర్మములు తప్పి చరించిన యుదాహరణములు బయట పడుచుండును. ఒక్కొక్కప్పు డెవ్వడో యొక పోలీసు కానిస్టేబిలుగాని ఉద్యోగిగాని గొప్ప అధికారిగాని ఒకతప్పుపనిగాని దుర్మార్గమునుగాని చేయుట తటస్థించుచుండును. కొన్ని సమయములందా తప్పును దుర్మార్గమును కప్పి పుచ్చుటకు ప్రయత్నించుటయు జరుగును. అవి బయల్పడినప్పుడు చాలా అలజడి కలుగును.

సాధారణముగా పోలీసు వారిపైన ప్రజలుచేయు ఫిర్యాదులలో అవినీతి లంచగొండితనము అబద్ధపుసాక్ష్యము బనాయించుట, నిజము కప్పిపుచ్చుట, అక్రమములనుదాచుట హింసాకాండ అత్యాచారములు జరిగించుట అనునవి ముఖ్యమైనవి. ఇట్టి ఫిర్యాదులు వచ్చినప్పుడు వానిని గూర్చిఅక్కడి ముఖ్యపోలీసుఅధికారి (ఛీఫ్ కానిస్టేబిల్)విచారించుచుండును. అయితే ఇటువంటి ఫిర్యాదులు వచ్చినప్పుడు నిష్పక్షపాతమైన స్వతంత్ర న్యాయ విచారణాధికారిని నియమించి బహిరంగ విచారణ జరిపించుట మంచిదని పోలీసువారే అంగీకరించుచున్నారు.

నేషనల్ కౌన్సిల్ ఫర్ సివిల్ లిబర్టీస్ అను సంఘము ఇంగ్లండులో ప్రజల హక్కుల రక్షణ కేర్పడినది. వారికి

ప్రతి యేట పోలీసువారిని గూర్చి సగటున 300 ఫిర్యాదులు వచ్చుచుండును. ఇందులో ఏబది ఫిర్యాదులకు కారణముండు ననియు అందులో పది రుజువు చేయుటకు వీలుగ నుండు ననియు వారియభిప్రాయము. కొంతమంది పెద్ద పోలీసు అధికారులకీ సంఘమన్నగిట్టక వారడిగినసంజాయిషీ నివ్వనట్లు తెలిసినది.

1962 లో లండన్ నగర పోలీసు వారిపైన 1722ఫిర్యాదులు వచ్చినట్లును అందులో నూటికి పదిమాత్రమే రుజువైనట్లును తెలియుచున్నది. ఇంగ్లాండులో పోలీసు వారిపైన ఫిర్యాదులు వచ్చుచుండుటయేగాక, వారి శక్తి సామర్థ్యములను గూర్చి అప్పుడప్పుడు పొగడ్తలును వచ్చుచుండును.

పోలీసువారిపైన ఫిర్యాదులు చేయు వా రనేకవిధములైన కారణములతో చేయుదురు. ఒకొక్కప్పుడు ఆరితేరిన నేరగాండ్రు తమ జాడలను పసికట్టి వెంటాడు పోలీసు ఉద్యోగిని వదిలించుకొనుటకు ఏదో యొక నిందారోపణముచేసిన యుదాహరణములున్నవి. కొందరు స్వభావమునుబట్టి చీకాకు పడువారుగా నుందురు. స్వల్పవిషయములు వారి మనస్సును కలతపెట్టును. పోలీసువారు తమను బాధించుచున్నారనుభావముతో ఫిర్యాదులు చేయుదురు. కొందరెవ్వరైన యుద్యోగి తమను అనావశ్యకముగా ప్రశ్నించినాడని తమను సరిగా మర్యాద చేయలేదనితోచి ఫిర్యాదు చేయుదురు. పోలీసువారి స్వయంకృతాపరాధమువలన కూడా ఫిర్యాదులురావచ్చును.

ఒక్కొక ఉద్యోగి తనకన్న పూర్వము పనిచేసిన వానికన్న ఎక్కువ శ్రద్ధతో పనిచేసినట్లు ప్రకటించుటకు తొందరపాటు చూపవచ్చును. తనతోడి యుద్యోగి అరెస్టు చర్య మొదలగు వానిలో చేసిన లోటుపాటులను సమర్థించుటకు ప్రయత్నింపవచ్చును. పోలీసువారుకూడా సామాన్య మానవులే గనుక వారిస్వభావము వారిప్రవర్తనలో ప్రతిఫలించుచుండును. అందువలన అపోహలు కలుగు సందర్భములు కలుగవచ్చును.

## షేఫీలు సంఘటన విచారణ

ఇంగ్లాండులోని షే ల్డు పట్టణములో 14-3-1963వ తేదీన అనుమానముపైన పోలీసువారు పట్టుకొని నిర్బంధమున నుంచిన అసహాయులును ఎదురు తిరిగి ప్రతిఘటించుటకు అశక్తులును అగు ఖైదీలను కేవలము వారు నేరమును ఒప్పుకొనునట్లు చేయుటకై పోలీసువారు వారిని పిడికిళ్ళతో గ్రుద్ది బలప్రయోగము చేయుటయేగాక ట్రంచన్ అను దుడ్డుకర్రతో కొట్టియు, చాల తీవ్రమైన దెబ్బ తగులగల ఖడ్గమృగచర్మపు కొరడాతో కొట్టియు చిత్రహింసచేసి బాధించినారనియు, తాముచేసిన ఘోరకృత్యమును కప్పిపుచ్చుటకు ప్రయత్నించి అబద్ధపు సాక్ష్యమును కూడా కల్పించినారనియు ఈసంఘటననుగూర్చి తరువాత జరిగిన విచారణలో బయల్పడినది.

పోలీసువారి ప్రవర్తనను గూర్చి విచారించుటకు మొదట మామూలుగా ఛీఫ్ కానిస్టేబిలు, ఒకడిటెక్టివు ఇన్స్

క్టరును నియమించినాడు. అతడు పోలీసు వారిపట్ల సాను భూతిని ప్రదర్శించినాడు. ఛీఫ్ కానిస్టేబిలు వారిని గద్దించుటకు బదులుగా కరచాలనముచేసి వదలినాడు. అటుపిమ్మట ఇంగ్లాండు న్యాయవాదులలో "క్వీన్సుకౌన్సల్" అనుహోదాగల ఒక బారిష్టరును కానిస్టేబిలు దళ ఇన్స్పెక్టరునుకలిసి జరిపిన విచారణలో ఘోరమైన సంగతులు బయల్పడినవి. ఇంతఅక్రమము బయల్పడినను ఇంగ్లాండుప్రభుత్వమువారిహోంసెక్రటరీ గారికిస్వతంత్ర న్యాయమూర్తిచేతనే ఇటువంటివిచారణలు జరిపించవలెనని తోచలేదు. ఇది గొప్ప లోపమని చెప్పక తప్పదు.

ఖైదీలను హింసించిన పోలీసువారు (అప్పెల్లెంట్లు) తాము నేరముల నివారణ కొరకేర్పడిన (క్రైమ్ స్క్వాడ్ (Crime Squad) దళమువారమనియు, ముదట తేలిన నేరగాండ్రు చేసిన నేరములను త్వరలో కనిపెట్టి శిక్షింపజేయుటకు మొరటైన కఠిన విధానములను ప్రయోగింపవచ్చుననియు వారిలో నొకభావమును, ఇంతేగాక న్యాయస్థానములు నేరగాండ్లపట్ల చాల సౌమ్యముగా ప్రవర్తించుచుందురు కాబట్టి ఈ నేరగాండ్రు విజృంభించి న్యాయశాస్త్రవిధుల నుల్లంఘింప గలుగుచున్నారనియు పోలీసువారు వీరిని తలదన్నునట్లు ప్రవర్తింపవలసి వున్నదనియు ఒక భావమును ఈ పోలీసు వారిలో వ్యాపించియున్నట్లు దరిమిలా విచారణ జరిపిన వారికి తోచినది.

తమ వశమున అసహాయులుగానుండి ఎట్టి ప్రతి ఘటనము చేయజాలని యీ ఖైదీలను బాధించి వారు నేరము ఒప్పుకొనునట్లు చేయుటకై ఈ పోలీసు దళములోని ఇద్దరు డిటెక్టివు కానిస్టేబిలులు ట్రంచన్ అనుపూర్వకాలపు దుడ్డుకర్రతోను మెత్తగావంగి, విసురుగా తగిలి చాలా తీవ్రమైన దెబ్బ తగులగల ఖడ్గమృగ చర్మపుకొరడాతోను అతి తీవ్రముగా కొట్టి బుద్ధిపూర్వకముగా బాధించినట్లు రుజువైనదనిరి. అయితే ఈ పోలీసువారి ప్రవర్తనమును విమర్శించుటలో ఈ క్రింది యంశములు గమనింపవలసి యుండుననిరి.

1. ఈ పోలీసు ఉద్యోగులు ఈ అక్రమము చేయునప్పటికి పూర్వము చాలా గంటలు శ్రమపడి పనిచేసి అలసిపోయి ఆకలితో నుండిరి

2. నేరము దర్యాప్తు సఫలము కావలెనని వీరిపైన ఒత్తిడి యుండెను. వీరు దాని కనుగుణముగా ప్రవర్తించిరి.

3. వీరికన్న అనుభవజ్ఞులగు సీనియరు ఆఫీసరు లింతకు పూర్వము అనుమానమున్న వారిపట్ల బలప్రయోగమును హింసాకాండయు జరిగించియుండుట అట్టిపద్ధతి నీసందర్భమున నవలంబింప తగునను సూచనలు చేయుట.

4. ఈ సీనియరు ఆఫీసరులును ఇంకొక డిటెక్టివు కానిస్టేబిలును ఈ దౌర్జన్యమునందు పాల్గొనియుండుట, ఛీఫ్ కాని

స్టేబిలు జరిపిన విచారణలో వారిపైన తగు చర్య తీసికొనక పోవుట.

5. ఈ కేసు న్యాయస్థానములో విచారణకు వచ్చినప్పుడు చెప్పవలసిన అబద్ధపు సాక్ష్యమును ఆ సీనియరు అఫీసరే తయారు చేసియుండుట.

ఈ విచారణలో సాక్ష్య మిచ్చిన ఒక పోలీసుఉద్యోగి రాటుదేలిన నేరగాండ్రు సామాన్య అపరాధ పరిశోధక విధానములకు సులభముగా లొంగరనియు వారిని బాగా మర్దించి బాధించిన తప్ప లాభ ముండదనియు అనెను.

ఆఫ్రికా దేశపు నల్లజాతులవారు నేరములను గూర్చి ఒకరిపై నొకరు నిందించుకొని పోరాడునప్పు డుపయోగించు ఆయుధములనుండి ఒక ఖడ్గమృగచర్మపు కొరడాను ఆ డిటెక్టివు కానిస్టేబిలు సంగ్రహించి యుంచుకొనెను. దానినే అతడిప్పు డుపయోగించినాడు. దానితోపాటు ట్రంచన్ అను పూర్వకాలమునాటి దుడ్డుకర్రతో కొట్టినారు. ఇంతేగాక చాల మంది పోలీసువారు తమ పిడికిళ్ళతో వరుసగా ఖైదీలనందరిని 5 సార్లుగా గ్రుద్దినారు. అందులో నొకనికి 70 గ్రుద్దులు తగిలినవి. ఇది యంతయు జరుగుచుండగా డిటెక్టివు ఇన్స్పెక్టరు ఈ తమాషా చూచుచు ఆనందించుచుండెను. అతనిని ప్రశ్నింపగా ఇటు వంటివి తరుచుగా జరుగుచునే యుండునని చెప్పినాడు. నిర్భాగ్యులగు నా ఖైదీలు ఈ అక్రమ చర్యలను గూర్చి ఫిర్యాదు చెయ్యరనియు, చేసినను ఎవ్వరును నమ్మ

రవియు అత డనుకొనినట్లును విచారణలో స్పష్టమైంది. అయితే వారు న్యాయస్థానమునందు దీనిని గూర్చి చెప్పకొనిరి. దీనిని గురించి మేజస్ట్రీటు సంజాయిషీ అడిగినను మేపిల్సులోని పోలీసు వారెవ్వరును ఐదుగోజులవరకును దీనిని గూర్చి యెట్టి చర్యయు తీసికొనలేదు. ఈ అలస్యమునకు ఫలితముగా పోలీసువారు చేసిన హింసాకాండలో నుపయోగింపబడిన రెండు ఆయుధములు కనబడకుండా తగులబెట్టి వేసిరి. పోలీసువారు ఖైదీల న్యాయవాదియగు సొలిసటరుకు పొరబెట్టు సంజాయిషీనిచ్చిరి. పోలీసువారి అక్రమమును కప్పిపుచ్చుటకు నేరముల దర్యాప్తు దళము (Crime Squad) వారు అబద్ధపు కథను కల్పించి చెప్పుటయేగాక అందు కనుగుణముగా అబద్ధపు సాక్ష్యమునుకూడా కల్పించినారు. పోలీసు వారి ప్రవర్తనగూర్చి విచారించుటకు నియమింపబడిన ఛీఫ్ డిటెక్టివు ఇన్స్పెక్టరు వారిపట్ల సానుభూతితో ప్రవర్తించెను. పోలీసు వారిపైన ఫిర్యాదులు విచారించి తీర్మానించు ఛీఫ్ కానిస్టేబిలు ఈ వ్యవహారము బహిరంగమైనచో పోలీసు వ్యవస్థకు అప్రతిష్ట కలుగునను దురభిప్రాయముతో సాక్ష్యమును సరిగా గమనింపక పోలీసువారి తప్పులను పరికింపక ఊరకున్నాడు. నిందితులగు పోలీసువారిని మందలించుటకు బదులు కరచాలనముచేసి విడిచి పుచ్చినాడు. నీ వ్యవహారము పొక్కి- పెద్ద విచారణ జరుగగా అందులో పైన చెప్పిన సంగతులన్నియు బయల్పడినవి. ఈ విచారణ నివేదికను ఇంగ్లాండు

ప్రభుత్వము వారు ప్రకటించుచున్నారు. ★ఇంగ్లాండు పోలీసు వ్యవస్థలోని పెద్ద యధికారులు చిన్న యుద్యోగులు కానిస్టేబిలులు, మేజిస్ట్రేటులు దీనిని చదివి గుణపాఠము నేర్చుకొన వలసిన విశేషగాంశము లిందున్నవి.

షెఫీల్డు పోలీసు వారిటువంటి ఘోరకృత్యము చేయుటకు ముఖ్యకారణము అక్కడి సీనియరు డిటెక్టివు సి. ఐ. డి. పోలీసు ఆఫీసరులు నీతి ధర్మములయొక్క ప్రమాణములను పాటింపక ఉపేక్షించుటయే. పైవారు తమపైన చర్య తీసికొనరని జూనియరు ఆఫీసరులకు ధైర్యము కలిగిన తప్ప వారిటువంటి దౌర్జన్యములను హింసాకాండను బహిరంగముగా జరిగించుటకు సాహసింపరు.

పోలీసువారి ప్రవర్తననుగూర్చి ఫిర్యాదు వచ్చినప్పుడు పోలీసు వ్యవస్థకు సంబంధించిన అధికారులే విచారించు విధానముపోయి స్వతంత్ర న్యాయాధికారులు విచారించినగాని న్యాయము జరుగదను గుణపాఠమును షెఫీల్డు విచారణ బోధించుచున్నది. షెఫీల్డు విచారణవలన సంగతులు ఇంగ్లాండు పోలీసు వ్యవస్థయొక్క ప్రతిష్ఠకు భంగకరముగానున్న అసహ్య చర్యలని పోలీసు ఫెడరేషన్ కార్యదర్శికూడా అంగీకరించినాడు షెఫీల్డు సంఘటననుగూర్చి చర్చించుటలో ముఖ్యముగా గమనింపతగిన విషయము (పూర్వము (1951 లోను 1958 లోను బ్రిటన్ పట్టణములో వలెనే) చాలమంది అధి

---

★ Shefpield Enquiry report. H. M S O

కాసులకు నిజముగా జరిగిన సంగతులు తెలిసియున్నను పోలీసు దళములోని వారిలో ఒక్కడయినను ముందుకువచ్చి నిజము చెప్పకపోవుట. ప్రజలపట్లను న్యాయధర్మములపట్ల చూపవలసిన ధర్మనిరతిని వీరిని విడనాడి తమతోడి పోలీసు ఉద్యోగుల పట్ల సానుభూతి పోలీసు వ్యవస్థపైన అవమానమునుచూపుట. ఇటువంటి అన్యాయము అధర్మము ఇంగ్లాండు పోలీసువారిలో వ్యాపించుట దురదృష్టము. పోలీసువారు వ్యక్తిగతముగా ధర్మనిరతిగలవారైయున్నను తమ వృత్తికి వ్యవస్థకు సంబంధించిన విషయములందు ముఠా తత్వముతో అన్యాయమునకు ఒడిగట్టుట తటస్థించుచున్నది.

1963 నవంబరులో గ్లాస్గో నగరములో నొక ఖైదీ పోలీసు వశములో నుండగా దుర్మరణము పొందెను. అతనిని హత్యచేసిన నేరమునకు విచారింపబడిన పోలీసు ఉద్యోగి నిర్దోషియని వదలిరి. ఆ ఖైదీయొక్క మరణకారణములకు సంబంధించిన విషయములను దర్యాప్తుచేయు ఉద్యోగిని తెలియకుండా తప్పిపుచ్చిన సంగతిని ముద్దాయి సహచరుడగు పోలీసువాడు ఒప్పుకొనినాడు. "స్నేహితునికి అహితమగు సంగతిని చూడజాలను చెప్పజాలను" అనినాడు.

పోలీసుశాఖలోని ఉద్యోగుల ప్రవర్తనమునుగూర్చి నిందారోపణము జరిగినప్పుడు దానిని నిష్పక్షపాతముగా విచారించి న్యాయము జరిగించినగాని ప్రజలలో వారిపైన నమ్మకమును గౌరవమును నశించును. ఏదైన ఒక అన్యాయ

మును కప్పిపుచ్చుటవలన పోలీసువ్యవస్థపైన ప్రజలకునమ్మకము గౌరవము నంకుటకు వారిమధ్య స్నేహాభావము పెంపొందు టకు అట్టి విచారణ లావశ్యకములని ఆంగ్ల ధర్మశాస్త్రజ్ఞులును రాజనీతి విశారదులును చెప్పుచున్నారు.

పోలీసువారిలో కొందరు ఏదైన లోపము జరిగినప్పుడు దానిని కప్పిపుచ్చక ఒప్పుకొందురు. కొందరు తమ కర్తవ్య నిర్వహణమునందుగల సాధక బాధకములనుగూర్చి ప్రజా ప్రతినిధుల సమావేశములందు వివరించి వారి సహకారమును కోరుచుందురు. ఇంగ్లాండులోని పోలీసువారు మనదేశములో వలె ప్రజలపైన అధికారము చెలాయించు పద్ధతులతోగాక ప్రజలతో కలిసిమెలిసితిరిగి వారి సహకారమును పొందుటకు ప్రయత్నింతురు.

ఇంగ్లాండు దేశములోని ప్రజాసంఘములందనేక విభేదములున్నవి. జాతి మతభేదములు, సాంఘిక రాజకీయ వర్గ భేదములున్నవి. ఇట్టిసంఘములకు చెందినను ఇంగ్లీషు పోలీసువారు ఎవ్వరిపట్లను ఏవిధమైన పక్షపాతభావమును లేకుండా ప్రవర్తించుచున్నారన్నచో అది గొప్పవిషయము.

పోలీసువారి యుద్యోగ నిబంధనల ప్రకారము వారు రాజకీయములందు పాల్గొనరాదు. ఎన్నికలలో తమ కిష్టమైన

వారికి ఓటు నివ్వవచ్చునుగాని ఏ యభ్యర్థికిని ఓట్లు నిమ్మని ప్రచారము చేయరాదు.

ఇంగ్లాండులో నే రాజకీయ ఆర్థిక మతసంబంధమైన ఊరేగింపుగాని సమ్మెదారులైన కార్మికుల ప్రదర్శనములుగాని జరిగినప్పుడు శాంతిభద్రతలకు భంగములేకుండుటకు పోలీసు వారు బందోబస్తు డ్యూటీలో నా ఊరేగింపుతో పోవుదురు. తమకిష్టములేని భావములుగలవర్గములవారి యూరేగింపులలోకూడా చాలా సహన భావముతో పోయి కర్తవ్య నిర్వహణము చేయుదురు * అప్పుడప్పుడు కొన్ని సందర్భములలో కొంత అసహనముతో ప్రవర్తించిన యుదాహరణము లున్నను అట్టివి వారు తమంతట తాముచేసినవిగాక పై యధికారుల ఉత్తర్వులనుబట్టి చేసినవేయని తేలినది.

ఏదైనా నేరము జరిగినప్పుడా నేరముచేసినవారు గొప్పవారా సామాన్యులా అను బేధభావముతోగాక పోలీసువారు నిష్పక్షపాతబుద్ధితో ప్రవర్తింతురు.

నిందితుడు తనధనమువలన పలుకుబడివలన శిక్షపొందకుండా తప్పించుకున్నప్పుడు పోలీసువారెంతో బాధపడుచుందురు.

పూర్వము ఇంగ్లాండులో ప్రభువులని, రైతులని, మిల్లుయజమానులని, కూలివారని, ధనికులని, బీదలని చాలా

* చూడు : ఫోటో నల్లవారిని ద్వేషించు దక్షిణాఫ్రికా ప్రధాన మంత్రి వెర్వర్డుకు వ్యతిరేకముగా జరిగిన ప్రదర్శన.




సామూహిక ప్రదర్శనములు - లండన్ పోలీసు

తారతమ్యము లుండెను. ఆ భావము నిప్పుడు తగ్గినమాట నిజమేగాని ఇప్పుడుకూడా పోలీసువారొక మోటారుకారు లోని మనుష్యుని గౌరవమునుబట్టి అయ్యా - క్షమించండి - అని సంబోధించుటగాని "ఏయ్ - ఆగు" అని అదలించుట గాని జరుగుచునే యున్నది.

పూర్వము క్షుద్బాధప్రదర్శనముచేసిన జనసమూహము లను పోలీసువారు బేటన్లుపయోగించి గుఱ్ఱములతో నెట్టి చెదరగొట్టినప్పుడు జనసామాన్యములో పోలీసువారిపైన సద్భావనము నశించి వారిని దూషించి హేళనచేయుట ప్రారంభమయ్యెను. పనిపాటలుచేసికొను కార్మికులు కూలి వారు పోలీసువారిని ధనికవర్గమువారి బంటులని అనుమా నించుటయు జరిగెను. ఈ దురభిప్రాయము తొలగించుకొను టకు పోలీసువారు చాలా శ్రమపడవలసి వచ్చినది. ఇప్పటికిని కొందరు తల్లులు అల్లరిచేయు బిడ్డలను అదిగో పోలీసువాని కప్పగించెదనని బెదరించుట యున్నది.

ఇంగ్లాండుదేశములోని సామాన్యప్రజలందు అక్షర జ్ఞానము సామాన్య ప్రాథమిక విద్యాశిక్షణము హెచ్చుగా నున్నది. అక్కడి ప్రజాప్రభుత్వ విధానములందు పౌరులు పాల్గొనుటవలన వారికి సామాన్య పౌరధర్మములు తెలియుట కవకాశములున్నవి. అక్కడి పోలీసుశాఖలో చేరిన యువకులకు పౌరధర్మములు బోధింపబడును. అందువలన మనదేశములోని పోలీసువారివలె గాక అక్కడి పోలీసువారు హెచ్చు విద్యా

విషయసంపన్నులుగా నున్నారు. వారు తమ ఉద్యోగ ధర్మములను నిర్వహించుటలో పౌరధర్మములను న్యాయ శాస్త్ర విధులను ప్రజాప్రభుత్వ సంప్రదాయములను పాటిం చుటలో నాశ్చర్యములేదు. అక్కడి పోలీసువారి మాటల లోను ప్రవర్తనలోను ప్రజాసేవానురక్తి శాసనధర్మ పరిపాలనాసక్తియు కనబడును. మీ యుద్యోగధర్మ మేమని అడిగినచో ప్రజా సేవయని శాసనధర్మ పరిపాలనమని జనసామాన్యముతో స్నేహభావముకలిగి వారికి రక్షణము సహాయము చేయుటయని, స్త్రీలకు పిల్లలకు వృద్ధులకు తోడ్పడుట యని నేరములు జరుగకుండ నివారించుట నేరము చేసినవారిపైన ద్వేషము క్రోధము లేకుండా వారికి తగిన శిక్ష విధింప జేయుట యని సామాన్య పోలీసు కానిస్టేబిలుకూడా చెప్పును. తాము ప్రభుత్వమువలన నియమింపబడి వారివలన జీతములు పుచ్చుకొనుచున్నను తాము రాజభటులుగాక ప్రజాసేవకులమే యని చెప్పుదురు.

దేశప్రజలలో క్రమవ్యవస్థ సుస్థిరముగ నుండుటకే శాసనములు చేయబడుచున్నందున తా మా శాసనములు అమలుజరుపు వారమైనందున తాము క్రమవ్యవస్థయొక్క కార్యకర్తలమని కొందరు పోలీసువారు చెప్పుదురు.

ఇంగ్లాండులోని పోలీసు వ్యవస్థనుగూర్చి అక్కడి ప్రజలలోగలభావములనుగూర్చియు అక్కడి పోలీసువారికిగల

కష్టములనుగూర్చియు Mr. Colin Mac Innes అను సుప్రసిద్ధ ఆంగ్లపండితు డిట్లు వ్రాసెను.

ఇంగ్లాండులోని పోలీసువారు నేడు చాలాకష్టతరమైన కర్తవ్యనిర్వాహణము చేయుచున్నారు. ఈ వ్యవస్థయొక్క నీతి ధర్మములను ఉద్యోగ ధర్మములను సరిగా గ్రహింప జాలని ప్రజాసంఘమువారి యభిమతము ననుసరించి చిక్కులతోకూడిన కర్తవ్యములు నిర్వహించుచున్నారు.

నేరములవిషయమున ప్రజలకుగల భావములకు పోలీసు వారిని ఎరచేయుచుందుము. పోలీసువారివిషయమున మనము రెండువిధములైన పద్ధతుల నవలంబించుచుందుము. ఒకమారు పోలీసువారు దయాదాక్షిణ్యములతో ప్రవర్తింపవలెనందుము. ఇంకొకమారు వారు కఠినముగ నిర్దయగా ప్రవర్తింపవలె నందుము. వారు న్యాయశాస్త్రవిధులను అమలుచేయవలెనని ఒకమారు కోరుదుము. న్యాయశాస్త్రవిధులు సడలింపవలెనని మరియొకమా రందుము. మనవిషయమున నతఁ డన్యాయ శాస్త్రవిధి నములుపరచినప్పుడు మనకు కోపమువచ్చును. ఇంకొకని విషయమున దానిని గట్టిగా అమలు పరుపలేదని వానిని బర్తరఫుచేయవలెనని కోరుదుము. అతనికి మనము లంచములిచ్చి లోబరచుకొన జూతుముగాని అతడు లంచ గొండి యని అవినీతిపరుడని గర్హింతుము. ప్రజాసంఘములో నతడు భాగస్వామిగా నుండవలెనందుము. గాని దాని సౌఖ్యములను లాభములను అతడు పొందుట కిష్టపడము.

సంఘముపట్ల జరుగు బలప్రయోగములను హింసాకాండను చూచి మనము మెచ్చుకొందుముగాని పోలీసువారు మన కొరకు చేయు బలప్రయోగాలను గర్హింతుము. ప్రజలనుండి సమాచారములు తెలిసికొనుటకు పోలీసువారి కర్తవ్యతకలదని అంగీకరింతుముగాని ఏ నేరమునుగూర్చిగాని పోలీసువారికి ఆచోకీయిచ్చిన వానిని బహిష్కరింతుము. నేరములను రూపుమాపవలెనని కోరుదుముగాని అందుకొరకు తీసికొను చర్య సౌఖ్యవిధానముల ననుసరించి యుండవలెనందుము.

ఇట్లు ఇంగ్లాండు దేశములో న్యాయశాస్త్రమునకేగాక ప్రజాభిప్రాయమునకుకూడ లోబడి ప్రవర్తింపవలసిన పోలీసు వారి యుద్యోగ నిర్వహణము కత్తిపై సాముపంటిదిగ నున్నది. పోలీసువారెంత జాగ్రత్తగ ప్రవర్తించినను ఎంత సదుద్దేశ్య ముతో కర్తవ్యము నిర్వహించినను వారి ప్రవర్తనము చర్యలు న్యాయస్థానమునందు జూరీసభ్యులు విమర్శించి అందులో లోపమున్నదనిగాని ప్రజల హక్కులకు భంగము కలిగినదని గాని అభిప్రాయపడినచో పోలీసువారికి శాస్తిజరుగును. ప్రజాప్రభుత్వ సంప్రదాయములను మీరినట్లు ప్రజాప్రతినిధు లకు తోచినచో పార్లమెంటువారేర్పరచిన బహిరంగ విచారణజరిగి, లోపమున్నచో పోలీసువ్యవస్థకే ముప్పు కలుగును. అందువలన వారు భయభక్తులతో అడకువతో మెలగుదురు. మొత్తముమీద ఆంగ్లేయ పోలీసువ్యవస్థ ప్రపంచములోని నాగరిక రాజ్యములందెల్ల ఆదర్శప్రాయముగ నున్నదని చెప్పవచ్చును.

ఇంగ్లాండులో పోలీసు ఉద్యోగమున చేరువారు ఆరడుగుల పొడవుగల ఆజానుబాహులుగా నుండవలెను. 5 అడుగుల 8 అంగుళములకన్న తక్కువ పొడవుగలవారి కుద్యోగ మివ్వరు. వారు బలశాలురును మంచి ఆరోగ్యము గలవారుగ యుండవలెను. పూర్వము చదువుకున్నవారు సామాన్య పనులు చేయుట పరువు తక్కువగా నెంచుదురని వారికి ప్రపంచజ్ఞానము తక్కువగా నుండునని తలచుచుండిరి గాని ఇప్పుడు విద్యావంతులనుకూడా చేర్చుకొనుచున్నారు.

పోలీసుశాఖలో చేరినవారికి ప్రత్యేక శిక్షణమునిచ్చు ట్రైనింగు సంస్థ నింగ్లాండులో నున్నవి. వారికి మూడు నెలలు పోలీసులా, ప్రొసీజరు నిత్య జీవితానుభవములందు నావశ్యక మగు అనేక విషయములుకూడా బోధింపబడుచుండును. కాని స్టేబిలులు పరీక్షలో నుత్తీర్ణులగావలెను. అటుతరువాత అప్పు డప్పుడు వారికి రిఫ్రెషర్ కోర్సులుండును. మిలటరీ సైనిక పద్ధతిలో (passing out Parade) నొక విన్యాసము జరుగును. క్రిమినాలజీ క్రైనాలజీ, పీనాలజీ అను విద్యలును సాంఘిక మానసిక తత్వశాస్త్రమును (Social Psycholo) విజ్ఞానమును వారికి బోధించుట మంచిదనియు పోలీసు వారప్పుడప్పుడు చిన్న చిన్న సమావేశములందు తమ యనుభవములను పోలీసు వారికి ఇతర సంఘ సంక్షేమసేవల వారికినిగల పరస్పర సంబం ధములను చర్చించుచుండినచో లాభకరముగా నుండునదనియు పోలీసు "లా" కు సంబంధించిన ఒక చిన్న సంగ్రహగ్రంథమును

పోలీసు వారికిచ్చుట యుక్తమనియు ఇంగ్లాండులోని విజ్ఞుల యభిప్రాయము.

ఇంగ్లాండు, స్కాట్లాండు ఉత్తర ఐర్లాండు కలిసిన బ్రిటను దీవులలోని పోలీసు వ్యవస్థ ఆదేశమున లా అండ్ ఆర్డరు న్యాయధర్మములు క్రమ వ్యవస్థలకు బాధ్యతవహించు ఇంగ్లీషురాణి మంత్రులగు హోంసెక్రటరీ స్కాట్లాండు కార్యదర్శి హోం ఎఫైయిర్సు మంత్రికి బాధ్యత వహించు ఉత్తర ఐర్లాండులోని ఇన్స్పెక్టరు జనరల్ ఒక్క మార్గదర్శిత్వము క్రింద ప్రాంతీయ స్థానికపద్ధతిపైన నిర్మింపబడుచున్నది.

బ్రిటనులో 157 రిగ్యులరు పోలీసు బలములు(Forces) ఉన్నవి. ఈ బలములన్నియు పరస్పరము సహకరించుకొనుచు పనిచేయును. ఇంగ్లాండు వేల్సురాజ్యభాగములో మనజిల్లాల వంటి కౌంటీలకును, మునిసిపాలిటీలవంటి బరోలకును ప్రత్యేక పోలీసుబలము లున్నవి. దగ్గరదగ్గర కౌంటీలలో బరోలకు పనిచేయు సంయుక్త బలములున్నవి. లండనుమహానగరములో ఛేరింగుక్రాసునుండి 15మైళ్ళ వ్యాసార్ధముతో పర్వుడు మండలమునకు మెట్రపాలిటన్ పోలీసుబలమని యొక దళమును, లండన్‌నగర మధ్యభాగమునకు సిటీ ఆఫ్ లండన్ బలమను ఇంకొక పోలీసుదళము నున్నది. పోలీసుకార్యములను నిర్వహింపవలసిన విస్తీర్ణముల హెచ్చుతగ్గులనుబట్టి యీ బలములలోని పోలీసువారిసంఖ్యయు నుండును. బ్రిటనుకంతకు కలిపి 87000మంది పోలీసువారున్నారు. మెట్రపాలిటన్

పోలీసుబలములో 18000మంది యున్నారు. ఇందులో కొంత మంది స్త్రీపోలీసులు నున్నారు.

బ్రిటనులోని కాంటిబరో ప్రాంతమునందలి పోలీసు బలములోని ఉద్యోగులలో ఛీఫ్ కానిస్టేబిలు, సూపరింటెండెంటు, ఇన్స్పెక్టరు సార్జెంటు కానిస్టేబిలు అను పదవులున్నవి. కొన్ని చోటులలో మధ్యాంతరీయములైన పదవులున్నవి. మెట్రపాలిటను పోలీసు జిల్లాలోని ప్రధాన పోలీసుఉద్యోగికి కమీషనర్ అని పేరు. ఆయనకు ఒక డిప్యూటీ కమీషనరు నలుగురు అసిస్టెంటు కమీషనర్లు సహాయముగ నుందురు. వారిక్రింది కమాండరులు డిప్యూటీకమాండరులని యున్నారు. అటుతరువాత తక్కిన ప్రాంతములవలెనే సూపరింటెండెంట్లు ఇన్స్పెక్టరులు సార్జెంట్లు కానిస్టేబిలులున్నారు.

ఇంగ్లాండు వేల్సుకాంటీలలో పోలీసువ్యవస్థయొక్క అధికారసంస్థ అధారిటీకమిటీ అనునవి ఇందులో సగము మంది కాంటీ కౌన్సిలుసభ్యులు. తక్కిన సగముమంది జస్టిసెస్ ఆఫ్ ది పీస్ అనబడు మేజస్ట్రేటులు. ఇంగ్లాండులోని బరోల లోని పోలీసుఅధికారులు వాచ్ కమిటీలు బరోకౌన్సిలు సభ్యులే ఈ కమిటీనెన్నుకొందురు. మెట్రపాలిటన్ పోలీసు ఫోర్సు అధికారులు ఇంగ్లాండు హోంసెక్రటరి అను మంత్రి లండన్ సిటీలో కోర్టు ఆఫ్ కామన్ కౌన్సిల్ అను అధికార సంస్థ యున్నది.

ఈ పోలీసు అధారిటీలు లేక అధికారసంస్థలు తమ అధికార మండలములందు సమర్థమైన పోలీసు బలమును స్థాపించి వ్యవహరించవలసినట్లు శాసనములు విధించినవి. తమ అధికారమండలములో హోంసెక్రటరీగారి అనుమతికి, స్కాట్లాండు కార్యదర్శిగారికి లోబడి ప్రధాన పోలీసు ఆఫీసర్లను నియమించును. మెట్రపాలిటన్ పోలీసు జిల్లాలోని ముఖ్య పోలీసుఆఫీసరు హోంసెక్రటరి సిఫారసుపైన నియమింపబడును. క్రౌను అనగా ఆంగ్ల పీఠాధిపతి పేరుననే ఈ నియామకములు జరుగును. ఈ పోలీసు అధికారసంస్థలు హోం కార్యదర్శి అంగీకారమునకు లోబడి తమ మండలముల లోని పోలీసుబలముయొక్క సంఖ్యాబలమును నిర్ణయించును. పోలీసుఉద్యోగులయొక్క సిబ్బందియొక్క జీతముల నిచ్చుటయు వారి బాధ్యతయె. వీరికి ప్రతిఏట అగు వ్యయములో సగము ప్రభుత్వమువారు గ్రాంటుగా నిచ్చుచుందురు. పని బాగా లేనిచో తగ్గించుచుందురు. పోలీసు సర్వీసులోనివారెవ్వరును ట్రేడ్ యూనియన్ కార్మికసంఘములందు సభ్యులు కాగూడదు. వారికి రాజకీయ అభిమానము లుండరాదను సిద్ధాంతమువలననే ఈ నియమము చేయబడినది. అయితే తమ కష్టసుఖములు పైవారికి తెలుపుటకు ఆ యా హోదాల ప్రతినిధిసంఘము లుండవచ్చును. 25 సంవత్సరము లుద్యోగముచేసి ఉపకారవేతనముపొందిన పోలీసు ఉద్యోగులవసరమువచ్చినప్పుడు దేశసేవ చేయుటకు సిద్ధముగా నుందురు. 16 — 18 సంllల మధ్యవయస్సుగల పోలీసు

కేడెటులనుపేరుతో యువకులకుపోలీసుతర్ఫీదు నిచ్చెదరు.తరు వాతవారి కిష్టమైనచో వారుకానిస్టేబిలు దళమునచేరవచ్చును.

బ్రిటనులో పోలీసు ఉద్యోగుల జీతములు :

| | | | |
|---|---|---|---|
| కానిస్టేబులుకు సాలుకు 635 నుండి 1030 పౌనులు(నవరసులు) | | | |
| సార్జెంటుకు | 1090 | — | 1170 |
| స్టేషన్ సార్జెంటు (లండన్‌నగరము) | 1215 | — | 1255 |
| ఇన్‌స్పెక్టరు | 1280 | — | 1370 |
| చీఫ్ ఇన్‌స్పెక్టరు | 1435 | — | 1530 |
| సూపరెంటు | 1700 | — | 2005 |
| చీఫ్ సూపరెంటు | 2040 | — | 2160 |

జిల్లాలో అసిస్టెంటు చీఫ్ కానిస్టేబిలుకు సాలుకు 2160-3050 పౌనులు (నవరసులు)

| | | | |
|---|---|---|---|
| చీఫ్ కానిస్టేబిలుకు | 1735 | — | 5355 |
| నగరమున డిప్యూటీ కమాండరు | 2820 | — | 3050 |
| కమాండరు | 3390 | — | 3780 |
| అసిస్టెంటు కమీషనరు | 4840 | | |
| డిప్యూటీ కమీషనరు | 5355 | | |
| కమీషనరు | 7000 | | |

లండనులో కానిస్టేబిలులకు సార్జెంటులకు సాలుకు 20 పౌనులు నగర అలవెన్సు నిత్తురు. జీతముగాక పోలీసు ఉద్యోగులకు ఉచిత గృహవసతి ఇతర అలవెన్సులు నుండును. అందులో సైకిలు అలవెన్సు బూట్సు అలవెన్సు అనునవి చేరును. సి. ఐ. డి. యుద్యోగులకు సామాన్య పోలీసు వారి లోని పదవిపై దానికిచ్చు అలవెన్సు లిచ్చెదరు. అయితే

వారు సామాన్య పోలీసు వారికన్న హెచ్చు గంటలు పని చేయవలసి యుండును.

ఇంగ్లాండులోపోలు బ్రిటిష్ దీవులలోని పోలీసు ఉద్యోగి ఒక స్వతంత్రమైన పబ్లికు ఉద్యోగి. శాసన విధులను బట్టిగాని ఇంగ్లాండులోని సామాన్య న్యాయశాస్త్రమునుబట్టి న్యాయాధిపతుల తీర్పులనుబట్టి పోలీసు ఉద్యోగి కేర్పడి యున్న అధికారములు బాధ్యతలు నిర్వహించుటలో అతడు యుక్తాయుక్త వివేచన కలిగి న్యాయశాస్త్ర పరిజ్ఞానము కలిగి తన స్వంత బాధ్యతపైననే తన యుద్యోగ ధర్మమును నిర్వహింపవలెను. తానుచేసిన దానిలో న్యాయశాస్త్రమునకు విరుద్ధమైన పనిగాని ఇతరులకు నష్టము కలిగించునట్టి పనిగాని చేసినచో దాని ఫలితము నతడే అనుభవించవలసి యుండును.

తాను పై యధికారుల యుత్తర్వులనుబట్టి తన కర్తవ్యము నిర్వహించితినని చెప్పుటకు వీలులేదు. అతడు పోలీసు అధారిటీ యుద్యోగికాడు. మన దేశములోవలె పోలీసుశాఖకు బాధ్యతవహించి ప్రవర్తించు పోలీసు శాఖోద్యోగికాడు. ఇంగ్లాండు దేశపు ప్రజాప్రభుత్వ సంప్రదాయములకును న్యాయశాస్త్రసంప్రదాయములకును మనదేశములోని సంప్రదాయములకునుగల తారతమ్యమే యిది.

ఇది దేశపరిపాలనములోని అన్ని విషయములందును అన్ని స్థాయిలలోను కనబడును.

---

# మన పోలీసు వ్యవస్థ

మనదేశములో నిప్పుడున్న పోలీసువ్యవస్థ ఇంగ్లీషు వారు స్థాపించినదే. గాని వారు తమ దేశములో నిర్మించుకొనిన దానికిని దీనికిని హస్తిమశకాంతర భేదమున్నది. అక్కడది ఆ దేశ ప్రజాప్రభుత్వమువారు ప్రజల ప్రాణ మాన ధన రక్షణకును ప్రజాసేవ కొరకును నిర్మించుకొన్న ప్రజాహితైక వ్యవస్థ. ఇక్కడిది ఇంగ్లీషువారీదేశము నాక్రమించి స్థాపించిన నిరంకుశ విజాతీయ ప్రభుత్వముపట్ల దేశప్రజలకు భయ భక్తులు కలిగించి వాని నిర్వహణమునకు తోడ్పడుట కేర్పడిన ప్రభుత్వ సేవాదళము. అందువలన ఇంగ్లాండులోని సంప్రదాయము లిక్కడ లేవు. అక్కడి పోలీసువారి యుద్యోగ ధర్మములకు మనవారి యుద్యోగ ధర్మములకు సంబంధము లేదు.

ఇంగ్లీషువారు మన దేశమునాక్రమించి తమప్రభుత్వము స్థాపించునాటికి మొగలుసామ్రాజ్యము విచ్ఛిన్నమై వివిధ ప్రాంతములందలి రాజులు నవాబులు ఒండారులతో పోరాడుకొనుచున్నందున దేశములో శాంతిభద్రతలు లేకుండెను. అయితే దేశములో వివిధప్రాంతముల నెవరు పరిపాలించినను

గ్రామ పరిపాలనమును మాత్రము గ్రామ పంచాయితీలే జరిగించుచుండెను. రాజులు నవాబులు గ్రామములలోని పంటలో తమకు చెల్లవలసిన రాజభాగమును గ్రహించి గ్రామముయొక్క అంతరంగిక పరిపాలనమున జోక్యము కలిగించుకొనకుండిరి. గ్రామపంచాయతీ యధికారముక్రింద గ్రామసేవచేయు పన్నిద్దరాయగాండ్రలో గ్రామములోని ఆ రక్షక లేక పోలీసువ్యవస్థ కధిపతియైన తలారి యొకడు. పంటలో అతనికి భాగముండెను. ఆ రక్షక శబ్దమునుబట్టి గ్రామ కావలివారిని ఆరెకు లనిరి. గ్రామ కావలివారు గ్రామప్రజల రక్షణకొరకు కావలికాయుచుండిరి. వారి పై యధికారి తలారి. గ్రామ సరిహద్దులను పొలముల సరిహద్దులను పంటలను కాపాడుట. గ్రామస్థులకు పరదేశులకు మార్గదర్శిగ నుండుట. నేరము జరిగినప్పుడు నేరస్థులను కనుగొని పట్టియిచ్చుట తలారి విధి. పోయినసొత్తు దొరకనిచో దాని విలువను ముజరా యిచ్చుట సంప్రదాయము. సామాన్య నేరములను పంచాయితీలే విచారించును. ఇంగ్లీషు తూర్పు ఇండియా సంఘమువారు మనదేశము నాక్రమించి తమ రాజ్యము స్థాపించినతరువాత మద్రాసు, బొంబాయి, బెంగాల్ ప్రెసిడెన్సీలని వ్యవహరింపబడిన వివిధ రాజ్య భాగముల నన్నిటిని పాలించుటకు కలకత్తాలో గవర్నరుజనరలును ఆయనకొక కార్యాలోచనసభను నియమించిరి. వారన్ హేస్టింగ్సుతరువాత గవర్నరుజనరలుగావచ్చిన కారన్‌వాలీసు

1793లో పూర్వకాలమునాటి గ్రామపంచాయితీ విధానమును రద్దుచేసి దేశమును జిల్లాలుగా విభజించి ప్రతి జిల్లాలో రివిన్యూ వసూలుచేయు కలెక్టరులను ఇంగ్లీషు అధికారులను నియమించెను న్యాయపరిపాలనము చేయుటకు ప్రతి జిల్లాలో నొక ఇంగ్లీషు జిల్లాజడ్జీ నేర్పరచెను. దేశరక్షణకొరకు 24 మైళ్ళు విస్తీర్ణముగల ప్రాంతమున ఒక్కొక పోలీసు ఠాణా నేర్పరచి ప్రతి ఠాణాకు దారోగాలను దేశీయ పోలీసు అధికారులను నియమించెను. వీరికి నెల కిరువదియైదురూపాయల జీతమిచ్చుటయే గాక వారి యధికార హద్దులలో జరిగిన హత్యలు, దోపిడీలు మొదలగు నేరములకు శిక్షవిధింపబడినప్పుడొక్కొక కేసుకు పదిరూపాయల బహుమతియు దొంగతనముచేయబడిన సొత్తు దొరికినప్పుడు దానిపైన కమీషను నేర్పాటు చేసెను. జిల్లాలోని న్యాయాధిపతియు మేజస్ట్రీటునైన జడ్జీనే వీరిపై యధికారిగా చేసెను. దారోగాలు నేరముల జాడలుతీసి నేరగాండ్రను శిక్షింపచేయుటకు అనుమానమున్నవారిని చిత్రహింసలు పెట్టుచుండిరి.

మద్రాసు రాజధానిలోకూడ వంగరాష్ట్రములోని పరిపాలనా విధానమే 1802 లో నెలకొల్పబడినది. తరువాత అనుభవజ్ఞుడైన పరిపాలకుడని పేరు పొందిన సర్ తామస్ మన్రో గారి సలహాపైన మద్రాసులోని రివిన్యూ పోలీసు న్యాయ విచారణాధికారులు కట్టుదిట్టపరచుటకు 1816 లో రిగ్యులేషను లనబడు కొన్ని చట్టములు చేసిరి. దీనిని బట్టి జిల్లా రివిన్యూపాలకుడగు కలెక్టరునకును అతనిక్రింద తాలూకాల

లోని రివెన్యూ అధికారులకు తాశిల్దారులకును పోలీసు మేజి స్ట్రీటు అధికారములు అనగా నేరముల దర్యాప్తుచేసి దోషులను విచారించి శిక్షించు క్రిమినలు న్యాయవిచారణ అధికారముల నిచ్చిరి. గ్రామములలోని కావలి వారిపై యధికారిగా నుండిన గ్రామమునసబును గ్రామ మేజిస్ట్రీటుగా చేసిరి. రివిన్యూ శిస్తు వసూలుచేయు ఉద్యోగులకే పోలీసు మేజిస్ట్రీటు అధికారము లిచ్చుటవలన శిస్తులు వసూళ్ళలో న్యాయధికారముల నుపయోగించి శిస్తు లివ్వలేని రైతులను బాధించుట ప్రారంభమయ్యెను. ఆకాలములో కంపెనీ ఉద్యోగులు నిరంకుశులుగాను అవినీతి పరులుగానుండిరి. శిస్తులు చెల్లింపని రైతులపై నేదో యొక నేరమును కల్పించి కచ్చేరికి పిలిపించి త్రిప్పి చంపుట, వారిని నిర్బంధించుట నేదో నెపముపైనశిక్షించుట జరుగుచుండెను. తాలూకాలో దోపిళ్లు హత్యలు మొదలగు నేరములు దానిని కనిపెట్టి దుర్మార్గులను శిక్షింపలేని తాశిల్దారులు నేరములనే కప్పి పుచ్చుచుండిరి. కొందరు లంచములు పుచ్చుకొని నేరములు మాపు చేయుచుండిరి.

ఆకాలమున శిస్తులు చెల్లించలేని రైతులను నేరము చేసినట్లు అనుమానమున్న వారిని చిత్రహింసలుచేసితిట్టి కొట్టి బాధించుట పరిపాటిగా నుండెను. ఇది మితిమీరి పోవగా దేశములో సంక్షోభము కలిగెను. ఎట్టకేలకు ఈ అన్యాయములనుగూర్చి విచారించుట కొక విచారణ సంఘము

నేర్పాటు చేసిరి. ఈ హింసల కమీషనువారు 16-4-1855 తేదీన నివేదికను సమర్పించిరి.

దేశప్రజల బాధలకు పోలీసువారే కారకులని, అవినీతి లంచగొండితనము, వ్యాపించియున్నదని, నేరముల జాడలు తీయుటలో చాల క్రూరమైన పద్ధతులతో బలప్రయోగము హింసాకాండ చేయబడుచున్నవని నిరపరాధులపైన నేరములు మోపి డబ్బులాగుట జరుగుచున్నదని అనుమానమున్నవారిని సాక్షులులేని నిర్జన ప్రదేశములకు తీసికొనివెళ్ళి క్రూరమైన చిత్రహింసలు పెట్టి బాధించుచున్నారని పోలీసువారి ఆశకు తగిన లంచమిచ్చినప్పుడు నేరములను మాఫు చేయుదురని, డబ్బుగల వారిపైన లేనిపోని నేరములు కల్పించి సాక్ష్యము చెప్పించి వారిని బాధించి డబ్బు లాగుచున్నారని ఆస్తి పోయినవాడుకూడ దఫేదారుకు పోలీసు జవానులకు లంచ మివ్వనిచో కచ్చేరిచుట్టు త్రిప్పి బాధింతురని ఇంక నెన్నో విధములైన అక్రమములు జరుగుచున్నవని విచారణసంఘము వారు వివరించిరి. దీని ఫలితముగా రివిన్యూ పోలీసు మేజస్ట్రేటు అధికారము లొకే యుద్యోగుల చేతులలో నుండుట యుక్తముగా లేదని మద్రాసుప్రభుత్వవారు ఇంగ్లాండులోని కంపెనీ డైరక్టరులకు వ్రాసిరి. అంతట పోలీసువ్యవస్థను సంస్కరింపదలచి ఒక పోలీసు ఛీఫ్ కమిషనరును, ముఖ్యాధికారిని, ఇరువదిమంది జిల్లాసూపరెంటులను ఇరువదిమంది

అసిస్టెంటు పోలీసు సూపరెంటులను సహాయ పోలీసు అధికారులను వారిక్రింద చిన్నయుద్యోగులను కానిస్టేబిలులను ఏర్పాటుచేయుచు నొక క్రొత్త పోలీసుశాఖను ప్రత్యేకముగా నెలకొల్పుట కంగీకరించుచు డైరక్టరులు 1857 జూన్ 9వ తేదీన ఉత్తర్వులు జారీచేసిరి. దీనినిబట్టి 1858లో మద్రాసు సివిలు సర్వీసులోని విలియం గాబిన్సన్ అనుసతనిని పోలీసు చీఫ్‌కమీషనరుగా నియమించిరి. ఇతనిని తరువాత ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు అని వ్యవహరించిరి. అయితే క్రొత్త విధానము అమలులో పెట్టుటకొక అంతరాయము కలిగెను.

ఇంగ్లీషు వర్తకకంపెనీవారి పరిపాలనమును కూలద్రోయవలెనని ఉత్తర దేశములోని సిపాయిలును వివిధ సంస్థానాధీశులునునామమాత్రావశిష్టుడైన ఢిల్లీపాదుషాయును 1857లో గొప్ప స్వాతంత్ర్య సమరము నారంభించిరి. ఈ స్వాతంత్ర్యసమరమున హిందూ మహమ్మదీయ ప్రజలు పాల్గొనిరి. ఇంగ్లీషువారిప్రభుత్వ మంత ముందునంత తీవ్రమైన పరిస్థితులు కలిగెను. గాని దేశీయులలో నైకమత్యములేనందున నది విఫలమయ్యెను. ఇంగ్లీషువారింగ్లండునుండి సైనిక దళములను తెచ్చి విప్లవము నణచివేసిరి. అనుమానమున్న వారినెల్ల వధించి ఎన్నో అత్యాచారములు గావించిరి. ఇంగ్లీషువారికి దేశీయులపైన అనుమానము ఆగ్రహము కలిగెను. ఇటువంటి తిరుగుబాటుజరుగకుండా దేశీయ సిపాయిలను ప్రజలను సంస్థానాధీశులను అణచియుంచుటకు కావలసిన కఠినమైన శాసనవిధులను కట్టుబాటులను చేసి దేశమును

నిరంకుశముగ పరిపాలింపబూనిరి. కంపెనీప్రభుత్వమును రద్దు చేసి ఇంగ్లాండునేలు విక్టోరియాప్రభుత్వము స్థాపించి కట్టుదిట్టముగా పరిపాలనచేయుట ప్రారంభించిరి. ఈ పరిస్థితులలో మద్రాసురాజధానిలో పోలీసువ్యవస్థను పునర్వ్యవస్థీకరించుటకు 1857 — 1858లో చేయబడిన ఏర్పాటులను నూతన పరిస్థితులందు మరింత కఠినముగ నుండునట్లు చేయుటలో ఆశ్చర్యములేదు. 1859 సం॥లో మద్రాసు పోలీసు చట్టమును చేసి క్రొత్తవిధానముక్రింద పోలీసు చీఫ్ కమీషనరు లేక డైరక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు అను అధికారిక్రింద పోలీసు సూపరింటెండెంటును అసిస్టెంటు సూపరింటెండెంటును క్రొత్త విధానము ననుసరించిన నిబంధనల క్రింద కానిస్టేబిలు దళమును ముందుగా ఉత్తరార్కాడులో నియమించిరి. తరువాత మద్రాసురాజధానిలో ఉత్తర సర్కారులుతప్ప తక్కిన జిల్లాలలో నియమించిరి. అటుపిమ్మట 1861లో ఉత్తర సర్కారులలోకూడా క్రొత్తవిధానము ప్రవేశపెట్టిరి.

మద్రాసు రాజధానిలోని పోలీసు వ్యవస్థకంతకు అధికారి ఇన్స్పెక్టరు జనరలు. మద్రాసు నగములోని పోలీసు వ్యవహారముల నిర్వాహకుడు కమీషనరు. ఆయన క్రింద ఒక డిప్యూటీ కమీషనరు ఒక అసిస్టెంటు కమీషనరు నుండిరి. రాజధానిలోని జిల్లాలను మూడు రేంజిలుగా విభజించి ప్రతి రేంజికి ఒక డిప్యూటీ ఇన్స్పెక్టరు జనరలును నియమించిరి. ప్రతి జిల్లాను ఒక పోలీసు సూపరెంటు అధికారముక్రింద నుంచిరి. జనసంఖ్యనుబట్టి అతనిక్రింద ఒకరిద్దరు అసిస్టెంట్లు సూప

రెంట్లు నియమింపబడుచుండిరి. జిల్లాలో కొన్ని తాలూకాలను కలిపి ఒక డివిజనుగా చేసి దానికొక ఇనస్పెక్టరును నియమించిరి. వారిక్రింద ప్రతి తాలూకాకును ఒక సబుఇనస్పెక్టరును నియమించిరి. అతడు పోలీసుస్టేషనుకు అధికారి ప్రతి పోలీసు స్టేషనుక్రిందను కొంతమంది రక్షకభటులుండిరి. వీరిని కానిస్టేబిలులనిరి. వీరిలో కొందరికి హెడ్ కానిస్టేబిలు పదవి నిచ్చుచుండిరి.

పోలీసు వ్యవస్థలోని రక్షకభటులు అవసరమునుబట్టి ఒక విధమగు సహాయక సైనికదళముగా నుపయోగించవలెనను నుద్దేశ్యముతో ఇంగ్లీషు ప్రభుత్వము వారిక్రింది సిపాయిల కిచ్చు తర్ఫీదులో "మానూల్ ప్లాటూను" తర్ఫీదును కానిస్టేబిలుల కిచ్చి వారికి డ్రిల్లు కవాతు నేర్పి తుపాకులు గురిచూచి కాల్చుటలోను పొట్టి లాఠీకర్ర సాము ప్రయోగములందును తర్ఫీదు నిచ్చిరి. వీధులలో జనసమూహములను తొలగించుటకు లైనింగు విధానమును నేర్పిరి.

పోలీసు కానిస్టేబిలుల కాలమున తెల్ల చొక్కా పంట్లాము ఎర్రటోపీల నిచ్చుచుండిరి. ఆఫీసరులకును కాకీ యూనిఫారమును ఎర్రజరీ తలపాగాలను ఇచ్చుచుండిరి. పెద్ద యుద్యోగములుచేయు ఇంగ్లీషు దొరలకును ప్రత్యేక దుస్తులుండెను. కానిస్టేబిలు దళములో మూడవవంతు మందికి తుపాకులిచ్చిరి. మూడింట రెండువంతుల మందికి కైజాను

లను పెద్ద కత్తులిచ్చిరి. కానిస్టేబిలందరికిని "బేటన్" అను నునుపైన పొట్టి లాఠీ కర్రనిచ్చిరి. పోలీసు దళములోని ఉద్యోగులకు పిస్తోలు తుపాకీ కైజారు మొదలగు ఆయుధముల యుపయోగమును గుర్రపుస్వారీయు నేర్చుకొనుచుండిరి. సైనిక దళములోని సిపాయిల దళములవలెనే పోలీసు దళములును మైదానమునందు మిలిటరీ డ్రిల్లులోని కేకలతో కవాతువిన్యాసములు చేయుట తుపాకులు కాల్చుట మొదలగు తర్ఫీదు పొందునప్పుడు ప్రజలుచూచి బెదారగుచుండిరి.

ఇంగ్లీషు వర్తక కంపెనీవారు అనేక మాయోపాయములచేత దేశమునాక్రమించి తమ నిరంకుశ ప్రభుత్వము స్థాపించి దుష్పరిపాలనముచేయుట ప్రారంభించిరి. పూర్వకాలమునాటి గ్రామపంచాయితీలను నాశనముచేసి కలెక్టరుల క్రింద రివిన్యూ పరిపాలనము నారంభించిరి. రైతులు భరింపలేని పన్నులు విధించి వానిని వసూలు చేయుటలో పోలీసు వారి నుపయోగించిరి. పన్నులివ్వలేని వారిని నేరము చేసినట్లనుమానమున్న వారిని పోలీసు వారు చిత్రహింసలుపెట్టి బాధింపసాగిరి. దేశములో తమ ప్రభుత్వముపట్ల ప్రజలకు భయభక్తులు కలిగించుట కింగ్లీషు వారు కఠిన నిర్బంధ శాసనములు చేసిరి. తమ ప్రభుత్వము పట్ల ద్రోహము చేయుదురను అనుమానమున్నవారిని ఎట్టి విచారణలేకయే పట్టుకొని ప్రవాసమంపు శాసనములను 1818 లో వంగరాష్ట్రమునకు మద్రాసు రాజధానిలోను చేసిరి. ఆపై తరువాత బొంబాయిలోకూడ అట్టి శాసనము చేసిరి.

దేశములో అల్లకల్లోలముగా నుండెను. శాంతిభద్రతలు లేవు. పిండారీదండ్లు ప్రజల ప్రాణ మానధనములను నాశనము చేయుచుండెను. దారి దోపిడిగాండ్రులువిజృంభించిరి. రాకపోకలకు మార్గములు పల్లపుసాగు నీటివసతులు పాడైనవి. కలెక్టరులు నిరంకుశులుగ నుండిరి అధికారులు లంచగొండులైరి. దేశభాషలురాని న్యాయాధిపతులు న్యాయపరిపాలన చేయజాలకుండిరి. క్రైస్తవమిషనరీలు విజృంభించి విద్యాబోధనద్వారా బాలురను తమ మతములో కలుపుకొనసాగిరి. ప్రజలమొర లాలించువారు లేరు. దేశీయులలో కొందరుచేసిన ఆందోళన ఫలితముగ 1860లో మరికొన్ని కఠినశాసనములు ప్రయోగింపబడెను. మద్రాసులోని హింసల విచారణసంఘ నివేదిక వలన ఇక్కడ శిస్తువసూళ్ళలో రివిన్యూ ఉద్యోగులును నేరముల విచారణలో పోలీసువారును ప్రయోగించు చిత్రహింసలు కంపెనీ దుష్పరిపాలనము బయల్పడెను. ఇంగ్లాండు పార్లమెంటులోకూడా కొందరు ప్రశ్నించిరి. ఇంగ్లీషువారి పరిపాలన కూలద్రోయుటకు 1857లో జరిగిన స్వాతంత్ర్య సమరము విఫలమయ్యెను. మరల దేశీయసిపాయిలు ప్రజలు రాజులు నవాబులు ఇట్టి విప్లవముజరుపలేకుండా అనుమానమున్నవారిని క్రూరముగా వధించి తీవ్రమైన కఠిన నిగ్రహశాసనముచేసి ప్రజల నణచివేయుటకు నిశ్చయించిరి. ప్రభుత్వముపట్ల తిరుగుబాటు - ధిక్కారము - ప్రభుత్వోద్యోగులను ధిక్కరించుట ప్రభుత్వమువారి ఆస్తికి చెరుపు చేయుట, శాంతి భద్రతలకు భంగముకలిగించుట, దొమ్మీ

చేయుట అతి కఠినశిక్షల కర్హమైన నేరముగా చేసిరి. ప్రజలను నిరాయుధులుగ చేసిరి. ఆయుధములుంచుకొనుట నేరముగ చేసిరి.

ప్రపంచములో శిక్షాస్మృతులందెల్ల కట్టుదిట్టమైనదని ఊహకందని చిత్రవిచిత్రములైన నేరములనుకూడా కల్పించిన శాసనమని ప్రఖ్యాతిచెందిన ఇండియన్ పీనల్ కోడ్ 1860లో శాసించబడినది. క్రిమినలు వ్యవహారముల ప్రక్రియలను నేరముల విచారణకును పోలీసు వారి అధికారములను మేజస్ట్రీటుల అధికారములను వివరించు క్రిమినలు ప్రొసీజరు కోడ్డు 1851లో శాసించబడెను. పోలీసు వారి కర్తవ్యములను అధికారములను బాధ్యతలను వివరించు పోలీసు అక్టుకూడా 1861లో శాసించబడెను.

అటుతరువాత మనదేశ ప్రజలను నిరంకుశముగా పరిపాలించుట కావశ్యకములైన అనేక శాసనములను చేసిరి. వానిని అమలుపరచుట కావశ్యకములైన అధికారములను పోలీసువారికిచ్చిరి. ఇంగ్లీషుప్రభుత్వమువారుచేసిన శాసనములందు ప్రభుత్వముపట్ల ప్రజలుచేయు నేరములనెల్ల క్రూరములైన కఠినశిక్షలకు పెద్దజరిమానాలు విధించుటకర్హమైనవానిగా నిర్ణయించిరి. నేరములను నివారించుటకు దర్యాప్తు చేయుటకు పోలీసువారికి నిరంకుశాధికారము నిచ్చిరి. నేరముల జాడలు యుటలో ఏ గృహావరణమునగాని ప్రవేశించుటకు, సోదా యుటకు ఎవ్వరినైన ప్రశ్నించుటకు పట్టుకొని నిర్బంధమున

నుంచుట కావశ్యకములైన సర్వాధికారములు వారి కొసగ బడినవి. పోలీసువారు తమ కర్తవ్యమును ఉల్లంఘించినను, పిరికిదనమును చూపినను శిక్షకు పాత్రులగుదురు.

ఇంగ్లీషువారు పాశ్చాత్యులలో చాల గడుసరులైన రాజ్యతంత్రజ్ఞులు. తమ దేశములో ప్రజాప్రభుత్వ పద్ధతులలో మెలగుచు మన దేశ పరిపాలనముచేయుటలో నిరంకుశ విధానముల నవలంబించు పరస్పర విరుద్ధములగు పద్ధతుల నవలంబించి కృతకృత్యులైరి. ఇది ఆశ్చర్యము కలిగించు సంగతి. వారు మన దేశములోని నిరంకుశ పరిపాలనమును శాసనబద్ధము చేసిరి. అనగా వారెట్టి కఠినవిధానముల నవలంబింపదలచినను వానికావశ్యకములైన శాసనములనుచేసి వానిని సక్రమముగా అమలుపరచి ఆ శాసనముల ప్రకారము న్యాయస్థానములందు బహిరంగవిచారణ జరుపు విధానము నవలంబించి పెద్ద జీతబత్తెములుగల ఉన్నతోద్యోగములనన్నిటిని ఇంగ్లీషుదొరల కిచ్చి వారిక్రింద చిన్న జీతములుగల దేశీయోద్యోగులను నియమించి పరిపాలనము నొక యంత్రమువలె జరిగింప సాగిరి.

ఇంగ్లీషువారు మన దేశమునస్థాపించిన నిరంకుశప్రభుత్వ యంత్రములో వివిధశాఖలను నిర్మించిరి. అందులో పోలీసు శాఖ యొకటి. తక్కినశాఖలందువలెనే ఈ శాఖలోని క్రింది యుద్యోగులు పైఉద్యోగుల అధికారమునకు లోబడి ఇంగ్లీషు ప్రభుత్వముయొక్క క్షేమ లాభముల నాలోచించి పరిపాలనా

వ్యవహారముల నన్నిటిని జరుపుదురు. ఇంగ్లీషుదొరలు దేశీయోద్యోగుల నొకకంటితో కనిపెట్టియుందురు. దేశీయోద్యోగులు దొరల మెప్పుకొరకు చేయరానిపనులైన చేయుదురు.

దీనికితోడు పోలీసుశాఖ సైనికశాఖవలెనే చాలకట్టుదిట్టములతో నిర్మింపబడి శాంతి భద్రతల రక్షణకు అనగా ఇంగ్లీషువారి ప్రభుత్వముపట్ల భయభక్తులు కలిగించి ప్రజలను హద్దులో నుంచుట కేర్పడి నట్టిది. అందువలన వారు ఆంగ్లేయప్రభుత్వ సేవకులై యుండిరి.

ఇంగ్లీషు పరిపాలనమున మనదేశ ప్రజలకు స్వాతంత్ర్య స్వత్వములులేవు. ప్రజలు పాలితులు ఇంగ్లీషువారు పాలకులు. దొరలకు కొన్ని ప్రత్యేక హక్కులుకూడా శాసనములను బట్టి యేర్పరచుకొనిరి. ఇంగ్లీషు ప్రభుత్వకాలమునందు వివిధ శాఖలలో పనిచేయు దేశీయోద్యోగులు ముఖ్యముగా పోలీసు వారు పై యధికారుల యుత్తరువులను శిరసావహించి ప్రజల కష్టసుఖములతో నిమిత్తంలేకుండా వానిని కఠినముగా అమలు జరుపు పద్ధతుల కలవాటుపడిరి. ఇంగ్లీషు జాతివారు తాము పాలకులమని దేశీయులు పాలితులని వారు తమపట్ల భయభక్తులు కలిగి ప్రవర్తింపవలెనను భావముతో నిరంకుశముగా ప్రవర్తించుట సహజము. వారిని చూచి వారి తాబేదారులగు

దేశీయోద్యోగులును వారిక్రింది జీతగాండ్రగు కానిస్టేబిలును అదే పద్ధతిలో వ్యవహరించుటయు సహజమే

మన దేశమున ఇంగ్లీషువారుస్థాపించిన ప్రభుత్వమునందు మన ప్రజలకు పలుకుబడిలేదు. ఇంగ్లాండులోవలె మనప్రజలకు పౌరహక్కులు లేవు. ఇంగ్లీషువారు దేశీయులను కొందరిని తమ సలహాసంఘములందు నియమించినను ఇంగ్లీషువారి ప్రభుత్వ మింగ్లాండులోని పరిపాలకులకే బాధ్యతకలట్టిదిగాని మన దేశీయులపట్ల బాధ్యతకలట్టిదికాదు. అందువలన మన పోలీసువారు మన ప్రజలను నిర్లక్ష్యముగ చూచుట వారిపట్ల నిరంకుశముగ ప్రవర్తించుటయు తటస్థించినది. తా మింగ్లీషు ప్రభువుల తాబేదారులమని వారిని మెప్పించుటయె తమ విధి యని పోలీసువారు తలచిరి. ఇంగ్లాండులోని ప్రజాప్రభుత్వమునకు బాధ్యతకలిగి ప్రజాసేవచేయు ఇంగ్లీషుపోలీసు సంప్రదాయములు మన దేశములోనుండుట కవకాశము లేనే లేదు. ప్రజల కష్టసుఖములతో మనపోలీసులకు నిమిత్తమే లేదు. శాసనవిధుల నమలుపరచుటలో పై యధికారుల ఉత్తర్వులు నిర్వహించుటయె వారి పరమధర్మముగాని ప్రజా సేవ చేయుట వారి కర్తవ్యముకాదు. పోలీసువారు కర్తవ్య నిర్వహణమునందు పౌరులపట్ల మర్యాదగా నుండవలెనని, శాంతముగా నుండవలెనని స్త్రీలకు పిల్లలకు సహాయము చేయవలెనని ఇంగ్లీషుప్రభుత్వమువారు అధికార వుత్తర్వుల కాగితములపైన కొన్ని ధర్మసూత్రములు సూచించినను ఆచరణలో నవి జరగలేదు. ఇంగ్లీషువారి నాశ్రయించిన

వారిపట్లమాత్రము కొంత మర్యాద చూపుచుండిరి. బ్రిటిషు వారు ఇతర శాఖలందువలెనే పోలీసుశాఖలో కూడా పెద్ద జీతములుగల ఇనస్పెక్టర్ జనరల్, డిప్యూటి అసిస్టెంటు ఇనస్పెక్టర్ జనరల్, సూపరింటెండెంటు మొదలగు ఉద్యోగము లను ఇంగ్లీషుజాతివారికే యిచ్చుచుండిరి. అయితే తక్కిన శాఖలందున్న విద్యా నియమనములుకూడా వీరికి లేకుండెను. కొన్ని క్రిందియుద్యోగములు యూరోపియనులను కంపెనిజాతి వారికి ఇచ్చుచుండిరి. సామాన్యముగా దేశీయులకు సబు ఇనస్పెక్టరు డిప్యూటీ సూపరింటెండు ఉద్యోగములకన్న పైస్థాయి పదవులివ్వకుండిరి. వీరికిచ్చు జీతములును తక్కువ. క్రిందిపదవులలో కూడా యూరపియనే సార్జెంటు అను పేరుతో నొక పదవి సృష్టించిరి. అతనికి ప్రత్యేక హోదా కల్పించిరి. ఇట్టి తారతమ్యము లెన్నో కలవు.

ఇక పోలీసుశాఖలో నిత్యము గ్రామజనులతోను పౌరు లతోను వ్యవహరింపవలసిన పోలీసు కానిస్టేబిల్ అనబడు జవానులకు చాల హీనములగు జీతబత్తెము లొసంగుచుం డిరి. పైగా పోలీసువారు చేయవలసిన అకార్యము లనేకము లున్నందున మర్యాదగల ఉన్నతకులముల వారందరు చేరుట కిష్టపడరైరి. అందువలన పోలీసు కానిస్టేబిలులలో చాలమంది హీనకులముల వారే నియమింపబడుచుండిరి. ఇట్టి పరిస్థితు లలో వారిలో నీతి నియమములు మంచిగుణములు మర్యాద ఉండకపోవుట సహజము. పైగా పోలీసువారిని చూచిననే భయపడు బీదవారు రైతులు వారిని సంతోషపెట్టుటకు వారికి

సమస్తమైన వస్తువులు సప్లయిచేయుట ఏదైన నేరములో దర్యాప్తు జరుగునప్పుడు వారిని మంచిచేసికొనుటకు లంచము లిచ్చుట పరిపాటిగా నుండెను. కానిస్టేబిలులలో కొంచెము చదువుగలవారికి హెడ్ కానిస్టేబిలు పదవి నిచ్చుచుండిరి. 1883 డిశంబరు 31 నాటికి మద్రాసు రాజధాని పోలీసు వ్యవస్థలోని వివిధ ఉద్యోగులు కానిస్టేబిలు దళముయొక్క సంఖ్య యిట్లుండెను.

| | |
|---|---|
| ఇనస్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు | 1 |
| డిప్యూటీ ఇనస్పెక్టరు ,, | 3 |
| అసిస్టెంటు ఇనస్పెక్టరు జనరలు ఆఫ్ పోలీసు | 1 |
| మద్రాసు నగరములో కమీషనరు డిప్యూటీ | 3 |
| అసిస్టెంటు కమీషనర్లు | 21 |
| సూపరింట్లు | 20 |
| అసిస్టెంటు సూపరింటెండెంట్లు | 461 |
| ఇనస్పెక్టర్లు | 95 |
| అన్ని తరగతుల కానిస్టేబిలులు | 21861 |
| పోలీసుశాఖలో కచ్చేరిసిబ్బంది | 1897 |
| | 24363 |

పోలీసు సిబ్బంది 24254 లో ఈ క్రిందివారు కేవలము రాష్ట్రిసర్వీసులో నియమింపబడిరి.

| | |
|---|---|
| ఉప్పు సాల్టు | 113 |
| భూమి సుంకముల శాఖ | 226 |
| జెయిలు గార్డులు | 1060 |
| | 1399 |

వీరుగాక 273 మంది పోలీసువారిని కొంత సొమ్ము పుచ్చుకొని బ్యాంకులకు పబ్లికు కంపెనీలకు వ్యక్తులకునప్లయి చేయుచుండిరి.

మద్రాసు రాజధాని ప్రభుత్వ వ్యయమునందు పోలీసు శాఖకొరకు 3761381 రూపాయలు వ్యయము చేయుచుండిరి.

1883 నాటి మద్రాసు పోలీసు శాఖలోని ఉద్యోగుల జీతములు.

| హోదా | నెలకు రూపాయలు |
| --- | --- |
| ఇనస్పెక్టరు జనరల్‌కు | 2500 |
| మద్రాసు నగర పోలీసు కమీషనరు | 1500 |
| డిప్యూటీ ఇనస్పెక్టరు జనరల్ | 1200 |
| పోలీసు సూపరెంటు I గ్రేడు | 1000 |
| అసిస్టెంటు ఇనస్పెక్టరు జనరలు | 900 |
| పోలీసు సూపరెంటు II గ్రేడు | 800 |
| మద్రాసు నగర డిప్యూటీ కమీషనరు | 750 |
| పోలీసు సూపరెంటు III గ్రేడు | 700 |
| అసిస్టెంటు సూపరెంటు – హిల్ రేంజి | 600 |
| ,, ,, ,, | 500 |
| మద్రాసు అసిస్టెంటు కమీషనరు | 350 – 400 |
| పోలీసు ఇనస్పెక్టరు I క్లాసు | 400 |
| (అసిస్టెంటు సూపరెంటుగా ఆక్టింగు చేయునపుడు) | |
| ఛీఫ్ ఇనస్పెక్టరు | 300 |
| స్పెషల్ ఇనస్పెక్టరు | 300 |
| ఇనస్పెక్టరు I క్లాసు | 200 |

| | | |
|---|---|---|
| ఇనస్పెక్టరు | II క్లాసు | 150 |
| ,, | III ,, | 100 |
| మద్రాసునగర హెడ్‌సార్జెంటు | | రు 85 |
| ఇనస్పెక్టరు | IV క్లాసు | 75 |
| మద్రాసునగర సార్జెంటు | | 60 |
| యూరపియన్ హెడ్‌కానిస్టేబిలు | | 55 |
| ఇనస్పెక్టరు | V క్లాసు | 50 |
| ,, | VI ,, | 40 |
| హెడ్ కానిస్టేబిల్ | I | 25 |
| ,, | II | 20 |
| ,, | III | 15 |
| ,, | IV | 12 |
| కానిస్టేబిలు మద్రాసు | I | 9 |
| జిల్లాలో | I | 8 |
| ,, | II | 7 |
| ,, | III | 6-8-0 |
| గ్రామ వాచర్లు | | 3-4 |

బ్రిటిషు పరిపాలనకాలమున వివిధప్రభుత్వశాఖలలోని ఉద్యోగులు అవినీతిపరులై ప్రజలను పీడించుచున్నందున గ్రామ రైతులు పడుచున్న బాధలను చెన్నపట్టణములో సుప్రసిద్ధాంధ్ర పత్రికయగు ఆంధ్రప్రకాశిక సంపాదకులు శ్రీ ఏ. సి. పార్థసారధినాయుడుగారు 1902 సంIIరము డిశంబరు 24వ తేది సంచికలో చక్కగా వివరించిరి. దీనిని ఆనాటి ప్రభుత్వమువారు తమ రికార్డులలో నెక్కించిరి.

"ఇంగ్లీషు పరిపాలనము అనేకవిధములుగా బాగుగనే యున్నదిగాని కొన్నివిషయములలో లోపభూయిష్టముగా నున్నది. ఈ ప్రభుత్వమువారు తమ రివిన్యూడిపార్టుమెంటు లోను ఇతర శాఖలలోనుగల అవినీతిని అదుపులో నుంచలేకున్నారు. పూర్వ మీ దేశము నేలిన ప్రభువుల పరిపాలనకును ఇంగ్లీషుప్రభుత్వమునకును రెండు ముఖ్యమైన భేదములున్నవి. పూర్వము కొద్దిమంది యుద్యోగులకుమాత్రమే లంచము లిచ్చుకొనవలసి యుండెను. ఇప్పుడట్లుగాక చాలామందిని సంతోషపెట్టవలసి యున్నది. మనరైతులు రివిన్యూ, పోలీసు, సాల్టు, అబ్కారీ మొదలగు శాఖలలోని యుద్యోగులందరిని సంతోషపెట్టవలసివచ్చుచున్నది. ఇంతేగాక టీకాలయుద్యోగియగు వాక్సినేటరును, సివిలుకోర్టు అమీనానుకూడా సంతృప్తి పరుపవలెను. రైతులకు వీరందరితోను పనియుండునుగనుక వారిని సంతోషపెట్టనిచో అతనిపని చెడును. ఇక నిప్పటి ప్రభుత్వమునకును పూర్వపువానికినిగల రెండవభేద మేమనగా పూర్వము సర్కారునౌకరులు లంచములు పుచ్చుకొనుటకు

చాలా భయపడుచుండిరి. ఇప్పటి యుద్యోగుల కా భయము లేదు. శిక్షాస్మృతిప్రకారము లంచము పుచ్చుకున్నవాడు లంచమిచ్చినవాడు శిక్షకు పాత్రులగుదురు గనుక లంచములనుగూర్చిన సాక్ష్యము బయటకు రాదు. లంచపుచ్చుకొన్నవారు శిక్షింపబడుట చాల అరుదుగా నున్నది.

పూర్వ మెవ్వడైన లంచము పుచ్చుకొనుట కలవాటు పడినట్లు తెలిసినగాని అతనికి వచ్చు జీతబత్తెములకు మించి హెచ్చుగా వ్యయము చేయుచున్నట్లుగా తెలిసినచో అతనిని వెంటనే శిక్షించుట అందరెరుగుదురు. ఈ కాలములో దుర్మార్గులు శిక్షలను తప్పించుకొని గలుగుచుండుట అమాయకులు చిన్నచిన్న నేరములకు దండింపబడుట జరుగుచున్నది. గ్రామ మునసబు, రివిన్యూ ఇనస్పెక్టరు తాశిల్దారు ఒకరి తరువాత నొకరు రైతును పీడింతురు. తుదకు సబ్ కలెక్టరును కలెక్టరును గూడా తమ పర్యటనములలో సప్లయిల రూపమున రైతుల నుండి లంచములు గ్రహించుచున్నారు తాము పుచ్చుకున్న సరకుల విలువక్రింద తమవలన రైతు పుచ్చుకొను ఖరీదు కన్న ఆ సరుకులు చాలా హెచ్చువిలువ చేయు ననుసంగతి వారెరుగని విషయమా?

పోలీసువారుకూడా అనేక మార్గముల లంచము పుచ్చుకొనుచున్నారు. పోలీసుస్టేషన్ హౌస్ ఆఫీసరు ఒక

చూడు : Freedom Struggle in Andhra Pradesh (1965) Document No. 117.

ఆకస్మిక అపాయమును హత్యానేరముగా మార్చగలడు. ఒక దొంగతనమును అబద్ధపు సాక్ష్యములు బనాయించి నేరముగా మార్చగలడు. పోలీసుశాఖలోని చిన్న యుద్యోగములందు మర్యాదగల వర్గము వారిని చేర్చుటలేదు. ఏ మనుష్యునైనను చిక్కులుపెట్టి బాధించుటకు పోలీసువారికి అనేక అవకాశములున్నవి. అందువలన రైతులు పోలీసువారికి లంచములిచ్చి సంతోషపెట్టవలసిన వారగుచున్నారు. రైతులు చెరువు మరమ్మతు ఎస్టిమేటువగైరా పనులకు (డి. పి. డబ్లుయు.) ఓవర్సీరులను సంతృప్తిపరుపవలసియున్నది. తన పసువులు అడవిలో చొరబడినను ఛార్జిపెట్టకుండా నుండుటకు ఫారెస్టు వాచ్‌మన్ అను జవానును సంతోషపరుపవలెను.

అత్యధికమైన పన్నులభారమువలన రైతులు నానాటికి దరిద్రులగుచున్నారను మాటను అధికారులంగీకరింపక పోవచ్చునుగాని ప్రభుత్వములోని వివిధశాఖలందలి యుద్యోగులకు లంచములు చెల్లింపజాలకున్నారనుసంగతి నిర్వివాదాంశము. ప్రభుత్వాధికారులీ విషయమును జాగ్రత్తగా విచారించి దేశ పరిపాలనమునందు ప్రబలియున్న అవినీతిని లంచగొండితనమును మాన్పవలసినదని పత్రికాసంపాదకులు కోరిరి. ఇటువంటి పత్రికావిమర్శలు విజ్ఞాపనలు నిరంతరముగా వచ్చుచుండినను పరిస్థితులు చక్కబరచుటకు బ్రిటిషువారు తగిన చర్యను తీసికొనలేదు. ఆంగ్లేయప్రభుత్వ మొక మహా యంత్రము. ఆ ప్రభుత్వములోని వివిధశాఖలు అందులో

పనిచేయు అధికారులు ఉద్యోగులు నౌకరులు ఆ యంత్ర ములో చక్రములవలె పనిచేయుచుండిరి. పై యధికారుల ఉత్తర్వులు నిర్వహించుటయె వారి విధి. పోలీసుశాఖ ఇంగ్లీషు ప్రభుత్వమువారి క్షేమ లాభములకొరకు నిర్మింపబడినదేగాని ప్రజల క్షేమ లాభములకొరకు కాదు. పోలీసు ఉద్యోగులకు ప్రజల కష్టసుఖములతో సంబంధములేదు. తమ కర్తవ్య నిర్వహణమె లక్ష్యము. పోలీసువ్యవస్థలోని పెద్దయుద్యోగి మొదలు కానిస్టేబిలువరకును ప్రభుత్వ సేవకులమనే భావము తోనే పనిచేయుచుండిరి. ప్రజల కెంత బాధకలుగు ఉత్తర్వు లైనను దయాదాక్షిణ్యములు లేకుండా అమలుజరుపుచుండిరి. యుక్తాయుక్త వివేచనము చూపుట వారిపనికాదు. ప్రభుత్వము పట్ల భయభక్తులు కలిగించుటయె వారి కర్తవ్యము. శాంతి భద్రతలు స్థాపించుటకని, నేరముల జాడలు తీయుటకని ప్రజ లను లాఠీలతో కొట్టి తుపాకులు కాల్చి (Bayonet) సన్నీలతో పొడిచి తుపాకిమడమలతో కొట్టి ఇంక ననేకవిధములుగా హింసించుచుండిరి.

ఒకొక్కప్పుడు దొరలను మెప్పించుట కత్యాచారము లును చేయుచుండిరి. వారుచేసిన అన్యాయమును విచారించు వారులేరు. మనదేశ ప్రజలకు ఇంగ్లాండులోని ప్రజలవలె స్వేచ్ఛ స్వాతంత్ర్యములు లేవు. ప్రజల మొరలు వినువారు లేరు. పోలీసుశాఖలోని ఉన్నతాధికారి మొదట పోలీసు జవానువరకును మన ప్రజలపట్ల నిరంకుశముగ ప్రవర్తించుచుం డిరి. ప్రజలను నీచముగ చూచుట పరిపాటియైనది. నేరముల

దర్యాప్తులో క్రూరకృత్యములు చేయుట అలవాటైనది. దౌర్జన్యములుచేసి చిత్రహింసలు గావించి నిరపరాధులు నేరమును ఒప్పుకొనునట్లు పోలీసువారు నిర్బంధించిన యుదాహరణములును అబద్ధపు సాక్ష్యములును బనాయించి శిక్షింపచేసిన యుదాహరణములును వారిలో అవినీతి లంచగొండితనము దుర్మార్గములును ప్రబలుట వారు ప్రజలపట్ల అన్యాయములు అత్యాచారములు చేయుట అనేక కేసులలో బయల్పడినవి. ఇక భారతదేశములో లోకమాన్య తిలకు, గాంధిమహాత్ముడు మొదలగు దేశభక్తుల నాయకత్వమున ప్రజలలో రాజకీయ పరిజ్ఞానములు వృద్ధియై ప్రభుత్వమును ధిక్కరించు వందేమాతరం హోంరూలు, సత్యాగ్రహ సహాయ నిరాకరణ శాసనోల్లంఘనము మొదలగు జాతీయోద్యమములు ప్రబలగా వాని నణచుటకు ఇంగ్లీషు ప్రభుత్వమువారు కఠిన శాసనవిధులను నిషేధాజ్ఞలను, ఆర్డినెన్సులను నిర్బంధచర్యలను ప్రయోగించి వానిని అమలు జరుపుటకు పోలీసు వారికి నిరంకుశాధికారము లిచ్చిరి. వారు ఎటువంటి అన్యాయములు అత్యాచారములు చేసినను అంగీకరించిరి. పోలీసు వారు చెప్పినట్టి కఠిన శిక్షలు వేయుడని వారు కోరిన ఉత్తర్వులు జారీ చేయుడని మేజస్ట్రేటుల నాజ్ఞాపించిరి. ఇతర యుద్యోగులనుకూడా వారు చెప్పినట్లు చేయుడనిరి. అంతటను సామాన్య యుద్యోగులుకూడా పోలీసువారికి భయపడిరి. ఆ కాలమున దేశములో న్యాయశాస్త్ర బద్ధమైన పరిపాలనగాక నిరంకుశమైన పోలీసురాజ్యమే అమలు జరిగెను. శాంతి భద్రతలను కాపాడు నెపమున పోలీసువారు నిరాయుధులగు

వ్యక్తులను ప్రజల గుంపులను లాఠీ కర్రలతో చావగొట్టిరి. ఇంకననేక విధములగు దారుణచర్యలు జరిపిరి. చిత్రహింసలు చేసిరి. దేశభక్తులను బూట్లకాళ్ళతో తన్ని త్రొక్కి నోట వచింపరాని దుర్భాషలాడి వానిపైన ఉమ్మివేసి అవమానించిన యుదాహరణములుకూడా ఉన్నవి. వారు చీటికి మాటికి తుపాకులు కాల్చుచుండిరి. ఆకాలమున జాయింటు మేజిస్ట్రేటు సత్యాగ్రహులపైన నేరములను విచారించుటకు వేదికపై కూర్చుండగా ఆయన ప్రక్క పోలీసు సూపరింటుకూడా కూర్చుండు విపరీత దృశ్యము సర్వసామాన్యమయ్యెను. త్రాగిన స్పెషల్ పోలీసులు గ్రామములపై దాడిచేసి గ్రామస్థులను కొట్టుట ప్రారంభించిరి. అడుగువారు లేకపోయిరి. ఇట్టి పరిస్థితులలో పోలీసు వారికి లభించిన నిరంకుశాధికారములను దుర్వినియోగము చేసిరి. చాలా అత్యాచారములు చేసిరి. వారు చేసిన అన్యాయములను గూర్చి చెప్పుకొనిన వినువారు లేరు. సామాన్య నేరములనుగూర్చి ఎవ్వరైన పోలీసు వారితో చెప్పుకొనినచో మీ గాంధీతో చెప్పుకొనుమని యీసడింప సాగిరి.

పోలీసు వారిట్లు ప్రజలకు భయంకరులైరి. వారిని చూచిన భయమేగాని యెవ్వరికిని గౌరవములేదు. వారికి కోపము వచ్చిన నేమి చేయుదురో అని సామాన్యులు గడగడలాడుచుండిరి. ప్రజలు వారినుండి తొలగి కాలక్షేపము చేయుచుండిరి. సామాన్య ప్రజలు అధికారులను మంచిచేసికొనుటకు ముడుపులు చెల్లించి మామూళ్ళనిచ్చి పెద్ద

యుద్యోగులకు కట్నములు కానుకలు చెల్లించుట సర్వ సామాన్యము. ఈ పరిస్థితులలో పోలీసు వారికి విపరీతముగా లంచము లివ్వసాగిరి. ఈ పరిస్థితులలో పోలీసు వారి అవినీతి లంచగొండితనము త్రాగుడు మొదలగు దురాచారములు పెరిగిపోయెను. మన దేశములో శాంతి భద్రతలకు క్రమ పరి పాలనమునకు భంగము కలుగునప్పుడు వానిని నివారించు టలో పోలీసు వారికి ప్రజలు తోడ్పడు సంప్రదాయము మన దేశములో లేదు. ఏదైన హత్య జరిగినప్పుడుకూడా పోయిన వాడు పోగా మరియొక నిండు ప్రాణము నేరములకు తీయ వలెనను భావముతో ప్రజలు సాక్ష్యము చెప్పుటకు జంకుదురు. పోలీసువారికి చెప్పినచో వారు నేరస్థుని చిత్రహింసలు పెట్టి బాధింతురు. వాని యుసురు మనకు తగులునని ఆ పాపము మనకు చుట్టుకొనునని చెప్పురు. ఏదైన నేరమును గూర్చి సాక్ష్యము చెప్పినచో ముద్దాయి బంధుగులకు కోపమువచ్చు నని కొందరు జంకుదురు. పలుమారు కోర్టుకు త్రిప్పి చంపుదు రని కొందరు వెనుదీయుదురు. పౌరుల యందిటువంటి యభి ప్రాయములు ప్రబలియున్నందున పోలీసువారు రూపుపేరు లేనివానిని తమ చేలోకువ మనుష్యులను సాక్షులుగా వేయుచుందురు.

1947 లో నింగ్లీషువారు మన దేశమును వదలిపెట్టు వరకు ఆంగ్లేయ పోలీసు పరిపాలన మీా విధముగనే జరిగినది. భారతదేశమున రాజ్యాంగ సంస్కరణలను చేయు విషయమై విచారించి సిఫారసులు చేయుటకు నియమింపబడిన సైమన్

కమీషను వారు తమ నివేదికను 1930 మే 31వ తేదీన ఇంగ్లాండు పార్లమెంటుకు సమర్పించిరి. ఇండియాలోని పోలీసు శాఖను గూర్చి వ్రాయుచు ఇండియాలో 100 చదరపుమైళ్లకొక పోలీసుస్టేషనున్నదని రాష్ట్రము లన్నిటిలో కలిపి 187000 మంది పోలీసువారున్నారని ఇందులో 1000 మంది ఆఫీసరులని వ్రాసినారు. పోలీసుశాఖలోని క్రింది ఉద్యోగులలోను సిబ్బందిలోను అవినీతి లంచగొండితనము వ్యాపించియున్న మాట నిజమేనని అంగీకరించినారు. అయితే ఇండియాలోని హిందూ మహమ్మదీయ కొట్లాటలయందు శాంతి భద్రతలను స్థాపించుటలో దేశీయ పోలీసువారు చాలా సమర్థతతో వ్యవహరించుచున్నారని వారు ఆంగ్ల ప్రభుభక్తి కలిగియున్నారని తాషేమి చేసినను ఆంగ్లేయ ప్రభుత్వమువారు సమర్థింతురని ధైర్యము వారి కున్నందుననే వారు తమ కర్తవ్యములు బాగా నిర్వహించుచున్నారనియు పోలీసుశాఖను దేశీయమంత్రివశము చేసినచో జాతి మత కుల రాజకీయ వివక్షతలవలని చిక్కులు రాగలవని చాలామంది యభిప్రాయమని వ్రాసియున్నారు.

1948 సంవత్సరములో నింగ్లీషు ప్రభుత్వమంతమొంది భారతదేశమున స్వపరిపాలన మేర్పడెను. భారతీయులు నిర్మించిన నూతన రాజ్యాంగము 1950 జనవరి 26వ తేదీన అమలులోనికి వచ్చినది.

"భారత రాజ్యములోని పౌరులందరికిని సాంఘిక, ఆర్థిక రాజకీయన్యాయము, భావప్రకటన, మతాచరణ

స్వాతంత్ర్యము సమానమైన ప్రతిపత్తియు అవకాశములను కలిగించుటకును, వ్యక్తుల ఆత్మగౌరవమునకు భంగము లేకుండా జాతీయైక్యతకు దోహద మొనరించు భాతృభావము కలిగించుటకు స్వతంత్ర ప్రజాస్వామికము స్థాపించబడుచున్న దని రాజ్యాంగముయొక్క ప్రస్తావనలోనే స్పష్టీకరింపబడినది.

భారత రాజ్యాంగమునందు ప్రజల ప్రాతిపదిక పౌర హక్కులు స్పష్టీకరింపబడినవి.

21. న్యాయశాస్త్రవిధులేర్పరచిన ప్రక్రియ (ప్రొసీజరు) ప్రకారముతప్ప ఏ వ్యక్తిగాయొక్క స్వేచ్ఛకు భంగము కలిగింపరాదు. 22. (1) అరెస్టుచేయబడిన వ్యక్తికి సాధ్యమైనంత త్వరగా నిర్బంధకారణములు చెప్పవలెను. అతని కిష్టమైన న్యాయవాదితో ఆలోచించి వాదించుట కభ్యంతర ముండరాదు. (2) అరెస్టుచేయబడి నిర్బంధమున నుంచ బడిన వ్యక్తిని ఇరువదినాలుగుగంటలలోగా దగ్గరలోనున్న మేజస్ట్రీటు నెదుట హాజరుపరచవలెను. మేజస్ట్రీటుదగ్గరకు పోవుటకు కావలసిన కాలము పైనచెప్పిన 24గంటలలో చేరదు) ఆయన ఉత్తరువుపొందిగాని అటుతరువాత నిర్బంధమున నుంచవీలులేదు. అయితే నివారకనిరోధము (ప్రివెంటివ్ డిటెన్షన్) కొరకు చేయబడు శాసనముక్రింద అరెస్టుచేసిన వారి కీనిబంధన వర్తించదు. వానికి ప్రత్యేక నిబంధనలు చేయబడినవి.

కేంద్ర రాష్ట్రీయ ప్రభుత్వములుగాని వారి యుద్యోగులుగాని రాజ్యాంగములోని ప్రాతిపదిక స్వత్వములకు

భంగముకలిగింపరాదు. అట్లు చేసినచో బాధితులు న్యాయ
స్థానమునం దభియోగము చేసి పరిహారము పొందవచ్చును.
న్యాయపరిపాలనచేయుటకు స్వతంత్ర న్యాయస్థానము లేర్పరుప
బడినవి. చిరకాలము మనదేశము నేలిన విజాతీయ నిరంకుశ
ప్రభుత్వమువారి తాబేదారులుగానుండి ప్రజలపట్ల బాధ్యతా
రహితముగా నిరంకుశముగా ప్రవర్తించుట కలవాటుపడిన
పోలీసువారికి స్వతంత్ర రాజ్యాంగ నిర్మాణమువలన దేశ
ప్రజల ప్రతిపత్తిలో, హక్కులలో కలిగిన గొప్ప మార్పు
సులభముగా అర్థము కాకపోవుటలో ఆశ్చర్యములేదు.
పూర్వము ఇంగ్లీషు ప్రభుత్వము వారిక్రింద పనిచేసిన సివిలు
మిలిటరీ యుద్యోగవర్గము వారిని స్వతంత్ర భారత ప్రజా ప్రభు
త్వమువారు తొలగింపక నూతన పరిస్థితులలో వారు
ప్రజలపట్ల బాధ్యత కలిగి ప్రవర్తింతురను భావ
ముతో వారిచేతనే ప్రభుత్వ వ్యవహారములు జరిపించుకొను
టకు నిశ్చయించిరి. పూర్వము భారతీయులపైన నిరంకుశాధి
కారములు చెలాయించిన విజాతీయాంగ్లేయోద్యోగులలో కొం
దరీ నూతన పరిస్థితులలో ప్రజాప్రతినిధుల యధికారముక్రింద
పనిచేయుట కిష్టపడక ఉపకార వేతనము పుచ్చుకొని పని
మానిరి. కొందరు పాకిస్థానము వారి కొలువులో చేరిరి.

మన పోలీసుశాఖలోని దేశీయోద్యోగులలో పెద్ద అధి
కారులును చిన్న యుద్యోగులును తుదకు కానిస్టేబిలులును ఈ
నూతన పరిస్థితులలో తమ ప్రాతపద్ధతులను మార్చుకొని

ప్రజలపట్ల మర్యాదగ నుండుట, ప్రజలకు సహాయము చేయుట మొదలగు మంచిపద్ధతులు నేర్చుకొనవలసియుండియు వారు అట్లు చేయలేకపోయిరి. తమ ఉద్యోగ నిర్వహణము నందు పూర్వకాలమునాటి విజాతీయ పరిపాలనలోని నిరంకుశ విధానములను కఠినములైన పద్ధతులతోను మెలగుటయేగాక ప్రజల హక్కులను తృణీకరించసాగిరి. ప్రజలకు సహాయముచేయు పద్ధతి లేనేలేదు. ప్రజలపట్లనేగాక ప్రజాప్రతినిధులపట్లకూడా అమర్యాదగా ప్రవర్తించుచున్నారనివివిధ రాష్ట్రముల శాసనసభ్యులు విమర్శించసాగిరి. మన దురదృష్టవశమున స్వతంత్ర భారత ప్రజాప్రభుత్వము స్థాపింపబడిన తరువాత శాంతిభద్రతలకు భంగముకలిగించుపరిస్థితులు చాలా మారులు తటస్థించెను. శాంతిభద్రతలు కాపాడుటకని పోలీసు వారు సమ్మెచేసిన కార్మికులపైన విద్యార్థులపైన ఇతరులపైన తీవ్రమైన లాఠీ ప్రయోగములు తుపాకి కాల్పులు జరుపవలసిన వారైరి. దేశములో దొమ్మీలు అల్లరులు కొట్లాటలు బందిపోట్లు మొదలగు నేరముల నణచుటలో వారు కఠినచర్యలు తీసికొనసాగిరి. దీనికితోడు కమ్యూనిస్టులు ఆయుధములు పూని దౌర్జన్యములు చేయుచుండుటవలనను రజాకారులు మూకలు ప్రజలను బాధించుచున్నందునను పోలీసువారు క్రూరమైన పద్ధతులతో వారిని అణచవలసి వచ్చెను. మన ప్రభుత్వ మంత్రులు పోలీసువారి చర్యలు సమర్థించవలసి వచ్చెను. ఇట్లు మన క్రొత్త ప్రజా ప్రభుత్వమునకు దాపురించిన సమస్యలవలన మన పోలీసు వ్యవస్థను ప్రజాప్రభుత్వ సంప్రదాయముల కనుగుణముగా మార్చుటకు

వీలులేక పోయెను. ఇదిగాక మనదేశము స్వతంత్రమైనతాం గ్రెసువారు అధికారము వహించి పరిపాలించుటలో తటస్థించిన పరిస్థితులే పోలీసు వ్యవస్థలో మార్పు కలుగకపోవుటకు కారణము లయ్యెను.

రాజరికమునందు నియంతల పాలనమువలె ఒకవ్యక్తి స్వభావమునుబట్టి గాక ప్రజాప్రభుత్వమునందు ప్రభుత్వము వహించు రాజకీయ పక్షముయొక్క ఆశయములనుబట్టి స్వభావమునుబట్టియు మంత్రుల స్వభావమునుబట్టియు వారి ధృక్పథమునుబట్టియు ప్రభుత్వము స్వభావము మారుచుండును. ఆరితేరిన ప్రజాప్రభుత్వముగల ఇంగ్లాండులో జాతీయ విషయము లందన్ని రాజకీయ పక్షములు నొకే విధానము నవలంబించి కొన్ని విషయములందు తమతమ రాజకీయపక్షము వారి ప్రత్యేక విధానము నవలంబించు సంప్రదాయముండుట వలన అక్కడనే రాజకీయ పక్షమువారు అధిక సంఖ్యాకబలముతో ఎన్నికోబడి ప్రభుత్వము వహించుట తటస్థించినను దేశప్రజల కందరకు క్షేమలాభములు కలిగించు విధానము లందు పూర్వప్రభుత్వ నిర్ణయములను మార్చరు. పరిపాలనమును జర్గించు ప్రజలకందరకు ప్రభుత్వశాఖలందలి యుద్యోగుల నిత్యవ్యవహార నిర్వహణమునందు జోక్యము కలిగించుకొనరు. ప్రభుత్వోద్యోగులును ఏరాజకీయ పక్షమునకును చెందక ఏ రాజకీయ పక్షముపట్లను పక్షపాతము వహింపక తత్కాల ప్రభుత్వ మంత్రులు నిర్ణయించు విధానములను తు. చ, తప్పక నిర్వహింతురు. అందువలన ఇంగ్లాండులోని

ప్రభుత్వ విధానములు పరిపాలనా విధానములు రాజకీయ వాతావరణమునుబట్టి హెచ్చుతగ్గులు చెందక ఒడుదుడుకులు లేకుండా జరుగును.

ఇంగ్లాండులోని సంప్రదాయములనుబట్టి అక్కడి పోలీసువారి కర్తవ్య నిర్వహణమునందు ప్రభుత్వము వహించు రాజకీయ పక్షమువారి ఒత్తిడిగాని మొగమోటమిగాని లేనందున అక్కడి పోలీసువారు తమ యుద్యోగ ధర్మములను చక్కగా జరిగించుటకు వీలగుచున్నది.

మనదేశము క్రొత్తగా స్వతంత్రమై ప్రజాప్రభుత్వము నేర్పరుచుకొన్నందున ఆ సంప్రదాయము లింకను ఇక్కడ స్థాపింపబడలేదు. దీనికి తోడు మన ప్రజాప్రభుత్వ మేర్పడినది మొదలు ఒక రాజకీయపక్షమువారు ప్రభుత్వము వహించుట తటస్థించినది. ఇంతేగాక మనదేశములో ప్రభుత్వము వహించిన కాంగ్రెసు పక్షము గాంధిమహాత్ముని దేశస్వాతంత్ర్యముకొరకు పాటుపడినదైనందువలన వారికి గొప్పగౌరవమును కలిగినది. కాంగ్రెసు నాయకులును దేశభక్తులుగా గౌరవింపబడిరి. ఈ పరిస్థితులలో బలమైన ప్రతిపక్షము ఎన్నుకొనబడలేదు. దీనిఫలితముగా ప్రభుత్వము వహించుమంత్రుల లోటుపాటులను ప్రతిపక్షమువారు విమర్శించి హద్దులో నుంచు ప్రజాప్రభుత్వ సంప్రదాయములును ఏర్పడలేదు. కాంగ్రెసు పక్షమునకు శాసనసభలందు చాల బలమేర్పడినది. అందువలన వారి ప్రభుత్వము సుస్థిరమైనది. ప్రభుత్వము వహించిన కాంగ్రెసు వారందరు మంచివారనిగాని కాంగ్రెసు

ప్రభుత్వములో లోపములేదనిగాని చెప్పుటకు వీలులేదు. కాంగ్రెసు ప్రభుత్వము అన్నివేళల ప్రజాప్రభుత్వసంప్రదాయములను పాటించినదని చెప్పుటకును వీలులేదు. కాంగ్రెసు రాజకీయ నాయకులకు ప్రభుత్వమునందు పలుకుబడియుండుట వలన వారు తమ నాశ్రయించిన వారి కుపకారములు చేయుటకు మంత్రులకు ప్రభుత్వోద్యోగులకు శిఫారసులు చేయుట ప్రారంభించిరి. మంత్రులును కొన్నిపట్ల ప్రభుత్వోద్యోగుల నిట్లు చేయుము అట్లు చేయుము అని ఆదేశింపసాగిరి.* పోలీసువారి కర్తవ్య నిర్వహణమునందును వారు జోక్యము కలిగించుకొనిరి. తమ కిష్టులైన వారిపైన పోలీసువారు చర్య తీసికొనకుండ చేయుట, ఇష్టములేని వారిపట్ల కఠినచర్య తీసికొనునట్లు చేయుట మొదలగు కార్యములు జరిగెను. కాంగ్రెసు నాయకుల మెప్పుకొరకు పోలీసు వారు కొన్ని అక్రమచర్యలు జరిగించుటకూడ తలపించెను. పోలీసువారి పైన ఫిర్యాదులు వచ్చినప్పుడు కాంగ్రెసు మంత్రులు సమర్థించిరి. శాసనసభలందు ప్రతిపక్షమువారు చేసిన విమర్శలు అరణ్యరోదనములయ్యెను. ఈ పరిస్థితులలో పోలీసువారికి తామేమి చేసినను భయములేదను ధైర్యముకలిగి నిరంకుశులై ప్రవర్తించుటలో ఆశ్చర్యములేదు. శాంతిభద్రతలు, న్యాయపరిపాలనము నే యొక రాజకీయ పక్షమువారికి సంబంధించిన కార్యములు కావు. పోలీసువారు నిర్వహింపవలసిన కర్తవ్యములు

* దీనినిగూర్చి శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారుకూడ విమర్శించిరి.

రాజకీయ పక్షములతో నిమిత్తములేకుండా దేశప్రజలందరి క్షేమమునకును సంబంధించినట్టివి. అందువలన ప్రభుత్వము వహించిన రాజకీయ పక్షమువారికి హెచ్చు గౌరవము, పలుకుబడియుండుట తటస్థించినచో పోలీసువారు నిష్పక్ష పాతముగ నిర్భయముగ ప్రవర్తింపజాలరు.

చీటికి మాటికి స్థానిక కాంగ్రెసు ప్రభుత్వమంత్రులను సామాన్య వ్యవహారములందు జోక్యము కలిగించుకొనమని కోరుట, వారట్లు చేయుట చూచు పోలీసువారు తమ కర్తవ్యములను నిష్పక్షపాతముగా నెట్లు నిర్వహించగలరు? అందువలన పూర్వము విజాతీయ ఇంగ్లీషు ప్రభుత్వము వారి తాబేదారులుగ వ్యవహరించుట కలవాటుపడిన పోలీసు వారిప్పుడు ప్రభుత్వము వహించిన రాజకీయ పక్షమువారి తాబేదారులుగ వర్తింపవలెనని తలచుటలో నాశ్చర్యములేదు.

స్వతంత్ర భారతరాజ్యాంగమువలన ప్రజాప్రభుత్వము ప్రజాభిప్రాయమునకు లోబడి పరిపాలింపవలసి యున్నదని ప్రజలు ప్రాతిపదిక హక్కులును పౌరహక్కులును కలిగియున్నారని పూర్వమువలె తాము సామాన్య ప్రజలను తృణీకరింప వీలులేదని పోలీసు వారింకను గ్రహింపలేదు.

పోలీసు వారి చేతులలో గొప్ప అధికారములున్నవి. వారు వానిని న్యాయశాస్త్రానుసారముగా నుపయోగింపవలసి యున్నను అధికార మున్నవారు తమ కెవ్వరిపైననైన నాగ్రహము కలిగినప్పుడు దానిని ప్రయోగించుట మానవ స్వభా

వము. అధికారములున్నవారికి సులభముగా నాగ్రహము వచ్చుటయు సహజము.

పోలీసువారిలో చాలామంది సామాన్య జనులపట్ల మర్యాదగా ప్రవర్తింపరు. వారు చీటికిమాటికి కోపింతురు. నోట వచింపరాని దుర్భాషలాడుట తిట్టుట కొట్టుట వారి కలవాటు. "పోలీసుభాష"ను గూర్చియు పోలీసు ప్రవర్తనను గూర్చియు శాసనసభ్యు లప్పుడప్పుడు విమర్శించుచుందురు.

ఇప్పటికిని పోలీసువారు అరెస్టుచేయుటలో సోదాలు చేయుటలో అమర్యాదగ ప్రవర్తించిన యుదాహరణములు కనబడుచున్నవి. ఇప్పటికిని నేరముల దర్యాప్తులో అనుమాన మున్నవారిని చిత్రహింసలు పెట్టుచున్న యుదాహరణము లున్నవి. పోలీసువారి నిర్బంధమున దుర్మరణము పొందిన కేసులు విచారణజరిగి పోలీసువారి పద్ధతులు గర్హింపబడినవి. ఇక శాంతి భద్రతలుకాపాడు నెపమున వారు చేయు దౌర్జన్యములకు అత్యాచారములకు మితిలేదు. పూర్వమువలెనే ఇప్పుడును వారు యుక్తాయుక్త విచక్షణములేకుండా లాఠీలతో చావబాది దౌర్జన్యములు చేయుచున్నారు. కలకత్తాలోను బొంబాయిలోను కార్మికులు మొదలగువారిపట్లను హిందీ వ్యతిరేకోద్యమము నణచుటలోను కేరళలోని ఆందోళనము నణచుటలోను వారు చాలా అత్యాచారములు చేసిరి. కాశీ విద్యాలయ విద్యార్థుల యాందోళనము నణచుటకై విశ్వవిద్యాలయమున జొరబడి నిరపరాధులను కొట్టి హింసించిన సంగతులు ప్రకటించబడినవి. పోలీసువారు

చేసిన అక్రమములనుగురించి విశ్వవిద్యాలయోపాధ్యాయులు తీవ్రముగా విమర్శించిరి. శాసనసభ్యులును ఈ అన్యాయములనుగూర్చి శాసనసభలో విమర్శించిరి. కాని లాభము లేకపోయినది.

1966 అక్టోబరు 4వ తేదీనుండి కాన్పూరులో S. D. కాలేజి విద్యార్థుల అల్లరులనుగూర్చిన వార్తలు ప్రకటితములైనవి. వారు ఇటుకబెడ్డలు పుచ్చుకొని విసురుచుండిరని ఒక పోలీసుగార్డు చేతిలోని తుపాకి (మస్కెట్) లాగికొనిపోయిరని అందువలన లాఠీఛార్జి చేసినామని పోలీసువారనిరి. గాని వారెన్నో అత్యాచారములు చేసినట్లు వార్తలు ప్రకటింపబడినవి. పోలీసువారు విద్యార్థులను తరుముకొనుచుపోయి కాలేజీ హాస్టలు ఆవరణలో ప్రవేశించి ప్రిన్సిపాలు వలదని వారించుచున్నను తుపాకులు గురిపెట్టి కాల్చి కొందరిని గాయపరచుటయేగాక అట్లు కాల్చిన తరువాత నిరాయుధులును అసహాయులు నగు విద్యార్థులను తమ లాఠీలతో క్రూరముగా కొట్టిరి. ఆ సందర్భములో పోలీసు వారు ప్రిన్సిపాలుగారిని హాస్టల్ వార్డెన్‌గారిని తదితరులను కూడా కొట్టిరి. ఈ దౌర్జన్యములో ఏడుగురు విద్యార్థులకు తుపాకిదెబ్బలు తగిలినవి. 18మందికి తీవ్రమైన లాఠీదెబ్బలు తగిలినవి. కాలేజి ప్రిన్సిపాల్‌గారైన S. S శర్మగారికి వార్డెన్ శ్రీ R. R. దీక్షిత్‌గారికి శ్రీ S. S. ఉప్పల్ గారికిని లాఠీదెబ్బలు తగిలినవి. అంతట విద్యార్థులకు గంగవెర్రెత్తి వారు రైలుస్టేషన్‌పైన పోలీసుస్టేషనుపైన పోట్లా

ఫీసుపైన దాడిచేసి కొన్ని అల్లరులు చేసిరి. ఆగ్రాలోకూడా పోలీసువారిట్లే అత్యాచారములుచేసి అక్కడికాలేజీలో ఫిజిక్సు శాఖాధ్యక్షులగు D. P. ఖండేల్వాలాగారిని లాఠీలతో కొట్టిరి. పోలీసువారు శాంతిభద్రతల నెపమున దేశములో చాలా చోట్ల కాలేజీలలో హాస్టలులలో ఆస్పత్రులలోకూడా ప్రవేశించి లాఠీలతో కొట్టి దౌర్జన్యముచేసిన సంగతి ఇదివరకు ప్రకటితములైనవి. పోలీసుదుశ్చర్యలను అరికట్టుటకు వారిని అదుపులో నుంచుటకు మన మంత్రులు అసమర్థులుగా నున్నారు. పైగా పోలీసువారి మాటలు నమ్మి వారి అత్యాచారములను సమర్థించుచున్నారు. విద్యార్థులు సమ్మెలుచేయుట ప్రదర్శనములు చేయుట గుంపులుగాపోయి అల్లరులు దౌర్జన్యములు చేయుట చాలా తప్పు. అయితే, నిరాయుధులును చిలిపిచేష్టలుచేయు విద్యార్థులపైనను సామాన్య అతతాయి జనముపైన దురాగ్రము లొనరించు అతతాయి మూకలపైన దౌర్జన్యపరులపైన చేసినట్లే పోలీసువారు లాఠీచార్జి అను పేరుతో కర్రలతో చావబాదుట వారు పారిపోవుచున్నప్పుడుగూడ పగపట్టి వారిని తరుముకొని వెళ్ళి కళాశాల ఆవరణలోనికి వసతిగృహావరణలోనికి చొరబడి కాలేజి ప్రొఫెసర్లు హాస్టలు వార్డెన్లు వారించినను వినక లాఠీలతో కొట్టుట వారించిన పెద్దమనుష్యులను కూడా కొట్టుట ఎంత అనాగరికము! ఎంత అన్యాయము! ఇంతేగాక చీటికిమాటికి విద్యార్థులపైన పోలీసులు తుపాకులు కాల్చి గాయపరచు చున్నారు. కళాశాల ప్రిన్సిపాల్‌గారికి ప్రొఫెసర్లకు లాఠీదెబ్బలేగాక తుపాకి

గుండ్ల దెబ్బలును తగిలిన యుదాహరణములు పత్రికలలో ప్రకటింపబడినవి. శాసనసభలందు చర్చింపబడినవి. ఇటువంటి అత్యాచారములు జరుగకుండ వారింపలేని అసమర్థులగు మంత్రులు రాజీనామానిచ్చుటమంచిది. దీనికంతికును కారణము పూర్వము నిరంకుశ పరిపాలనముచేయుచుండిన బ్రిటిషువారు ప్రజలనణచుటకు పోలీసువారికిచ్చిన బలప్రయోగాధికారమును వారి చేతికిచ్చిన లాఠీలును తుపాకులును స్వతంత్ర ప్రజాప్రభుత్వమేర్పడిన తర్వాతకూడా ఎట్టి మార్పులు చేయక అట్లే యుండనిచ్చుటయే. యుక్తాయుక్త వివేచనలేని పోలీసు వారి చేతిలో నిట్టి అధికారములు ఇట్టి ఆయుధములు నుండనిచ్చుట ప్రజాప్రభుత్వ సంప్రదాయములకు విరుద్ధము.

స్వతంత్ర భారతపౌరులలో నేవర్గమువారైన అల్లరులు దౌర్జన్యములు చేయుటకు పూనుకొన్నచో నేమిచేయవలెను? అట్టి దౌర్జన్యములను నివారించుటెట్లు? నివారించుటకెట్టి చర్యలు జరుపవలెను అను విషయమునుగూర్చి మన పార్లమెంటు శాసనసభ్యులు జాగ్రత్తగా ఆలోచించవలసి యున్నది. పాశ్చాత్యదేశములలో నాగరికతగల ప్రజాప్రభుత్వ సంప్రదాయములుగల ఇంగ్లాండులో నిట్టి సందర్భములం దేమి జరుగుచున్నదో మన శాసనసభ్యులు మంత్రులు ముందుగా తెలిసికొనవలెను. ఆ పద్ధతులను మన పోలీసు ఉద్యోగులకు పైనుండి క్రిందివారివరకును బోధించునట్టి యేర్పాటు చేయవలెను.

ఇక విద్యార్థులలో వ్యాపించుచున్న అసంతృప్తి వారు చేయుచున్న అల్లరులు దౌర్జన్యములు ఎందుకుతటస్థించుచున్నవో విచారించి ఇక ముందు అట్టివి జరుగకుండా తగు బందోబస్తులు చేయుట చాలా జాగ్రత్తగా ఆలోచించి పరిష్కరింపవలసిన విషయము.

మనదేశములోని రాజకీయార్థిక సాంఘిక పరిస్థితులే విద్యార్థులలో అశాంతి దౌర్జన్యవిధానములకు కారణము లని అందరెరిగినదే. స్వాతంత్ర్యమువచ్చి పదునెనిమిదేండ్లైనను మన విద్యావిధానమునకు నిలుకడ యేర్పడలేదు. రాజకీయ నాయకులు తమకు తోచిన ప్రయోగములనెల్ల చేయుచున్నారు. విద్యా బోధనమునందు శిక్షణమునందు గల లోపములను విజ్ఞులు విమర్శించియున్నారు. దేశములోని రాజకీయపక్షములవారందరు విద్యార్థులకు తమ రాజకీయములను బోధించుచు వారి నుపయోగించుట ప్రారంభించిరి. విద్యార్థి సంఘములందుకూడా రాజకీయములు ప్రవేశించి తీవ్రరూపము దాల్చినవి. విద్యార్థులు కళాశాలలందలి కట్టుబాటులను తృణీకరింపసాగిరి. విశ్వవిద్యాలయములపైన ప్రభుత్వమువారు తమ అధికారములను చెలాయింప జూచుచున్నారు. ఈ పరిస్థితులవలన దేశములో చాలా అనర్థములు బయలుదేరినవి. విద్యార్థులలో అశాంతిప్రబలి దౌర్జన్యములకు దిగిరి. పరిస్థితులు విషమించినతరువాత మన భారత ప్రభుత్వమువారు కన్నులుతెరచి ఒక విచారణసంఘము నేర్పరచినారు. అయితే ఆ సంఘము నేర్పరుచుటలో వారు

పూర్వపు బ్రిటిషుప్రభుత్వ సంప్రదాయములనే అవలంబించి వార్షు విద్యార్థిసమస్యలను పరిష్కరించుట కేర్పడిన సంఘములో విద్యార్థులసమస్యల నెరిగిన వా రుండవలెను. వారితో సన్నిహితముగానుండి వారి చిత్తవృత్తుల నెరిగినవారై యుండవలెను. విద్యార్థుల నిత్యజీవితముతో సంబంధముగల ఉపాధ్యాయులు ప్రొఫెసర్లు వారి సంరక్షకులు అనుభవజ్ఞులగు విద్యావేత్తలు నుండవలెను. అంతేగాని ప్లానింగుకమిషన్ సభ్యులు, నేషనల్ కేడెట్‌కోరు డైరక్టరు, విశ్వవిద్యాలయోపాధ్యక్షులు నున్న లాభములేదు. ఈ సమస్యనుగూర్చి నేడు పత్రికలలో ప్రకటింపబడుచున్న లేఖలు, వ్యాసములు పరిశీలించినయెడల విద్యార్థి సంక్షోభమునకు కారణములు చాలా లోతుగా వ్రేళ్ళుపాఱియున్నవని తెలియగలదు. అందువలన దానినిగూర్చి విచారించి పరిష్కరించుటకు చాలా నిదానము అనుభవము కావలెను. విద్యార్థి సంక్షోభమునుగూర్చి ఆలోచించుటకు వివిధరాష్ట్రములలోని ఇనస్పెక్టరుజనరలులను ఢిల్లీలో సమావేశపరచినారు. వారు 11-10-66 తేదీన సమావేశముకాగానే విద్యార్థులపైన ఏపాటి బలప్రయోగము చేయవలెనో చెప్పవలసినదని ప్రభుత్వము వడిగిరి. దీనివలననే వారి భావములు గ్రహింపవచ్చును. వారు సమాలోచనలు జరిపి విద్యార్థి సంచలనము పోలీసులకు సంబంధించిన సమస్య కాదని అది ఆర్థిక సాంఘిక విద్యావిషయములకు సంబంధించినదని దానిని ఉపాధ్యాయులు విద్యాధికారులు విద్యార్థుల సంరక్షకులు ఆలోచించి పరిష్కరింపవలెననియు చెప్పి న్యాయశాస్త్రవిధులనుబట్టి వ్యక్తులశరీరములను ఆస్తిని రక్షించుటయు

ప్రజలలో శాంతి భద్రతలు కాపాడుటయు పోలీసువారి బాధ్యత యని అందువలననే వారీవ్యవహారములో ప్రవేశింప వలసి వచ్చినదనియు చెప్పిరి. పోలీసువారిమధ్యను విద్యా సంస్థల యుద్యోగులమధ్యను విద్యార్థులమధ్యను గల సంబంధ ములు చెడకుండ జేయుట కప్పుడప్పుడు సమావేశములు జరుగుట మంచిదనిరి. ఇట్లే ఉన్నతోద్యోగులు విద్యార్థుల సంక్షోభము కేవలము శాంతిభద్రతల సమస్యగానే పరిగణించి వారనుట స్పష్టము.

భారతదేశము పారతంత్ర్యమున నున్నప్పుడు విజాతీయ ప్రభుత్వమువారి తాబేదారులుగా ప్రజలపైన నిరంకుశాధి కారములు చెలాయించుచు వారిపైన లాఠీలతోను తుపాకుల తోను బలప్రయోగము చేయునట్లు స్వతంత్ర భారత ప్రజా ప్రభుత్వము క్రిందిప్రజలపైన చేయుటకు వీలులేదని వీరికి ప్రాతిపదిక స్వత్వములు పౌరహక్కులు నున్నవను సంగతి పోలీసువ్యవస్థలోని ఉన్న తాధికారులకే తెలియనప్పుడు ఇక క్రింది యుద్యోగులకు విద్యావిహీనులగు కానిస్టేబిలులకు ఎట్లు తెలియును ?

శాంతి భద్రతలు కాపాడుటకు లాఠీలు తుపాకులు బలప్రయోగము తప్ప ఇతర నాగరికపద్ధతులు మన ఉన్న తాధికారుల కీనాటికికూడా స్ఫురింపకపోవుట మనదేశము యొక్క దురదృష్టము. ఇప్పటికైన వీరు ఇంగ్లాండు ప్రజా ప్రభుత్వముక్రింది పోలీసువారెట్లు ప్రవర్తింతురో నేర్చు కొని తమక్రింది యుద్యోగులకు నేర్పి కానిస్టేబిలులకు తగు

శిక్షణనునిప్పించుట యుక్తము. ఇట్లు చేయనలసిన బాధ్యత మన మంత్రులపైనకూడ వున్నది.

విద్యార్థిసంక్షోభమునుగూర్చి చర్చించుటకు 16-10-66 తేదీన ఢిల్లీలో విశ్వవిద్యాలయోపాధ్యక్షుల సమావేశము జరిగినది. యూనివర్సిటీ గ్రాంట్సు కమీషను అధ్యక్షుడు శ్రీ డాక్టర్ డి. ఎస్. కొఠారిగారు ప్రతి విద్యాలయమును వైస్ ఛాన్సలర్ అధికారముక్రింద నొక ప్రత్యేక రక్షణదళ ముండవలెనని దానికగు వ్యయము వివిధరాష్ట్రప్రభుత్వములు భరింపవలెనని సూచించిరి. విద్యావిధానములోని లోపము లనుగూర్చి విశ్వవిద్యాలయోపాధ్యక్షులు చర్చించి వానిని సవరించుటకు నిశ్చయించిరి.

భారతయూనియన్ విద్యామంత్రి శ్రీ ఎం. సి. చాగ్లా గారు విశ్వవిద్యాలయములందు విద్యార్థుల క్రమశిక్షణ విశ్వవిద్యాలయోపాధ్యక్షులు జాగ్రత్తగా చూచుకొనవలసిన విషయమని దీని విషయములో తోడ్పడవలసినదని ఇతర వర్గముల సహాయమును సకృత్తుగా కోరవలెనుగాని సాధారణ ముగా కోరరాదని హెచ్చరించిరి. విశ్వవిద్యాలయోపాధ్యక్షు లను ప్రొఫెసర్లను నియమించుటలో రాజకీయ కారణములు చొరబడినందువలన విద్యార్థులకు విషాదము కలిగినదనిరి. విశ్వవిద్యాలయోపాధ్యక్షులు విద్యార్థులతో కలిసిమెలిసి యుండక ఏకాంతవాసము చేయు పద్ధతి మానవలె ననిరి.

న్యాయశాస్త్ర విధుల నుల్లంఘించిన వారు దాని ఫలితము ననుభవింపవలసిన మాట నిజమేగాని పోలీసువారు గూండాలు దుండగీండ్రు ఆతతాయులతో వ్యవహరించినట్లుగా దేశ ప్రజాసంఘములోని ముఖ్యవర్గమువారైన విద్యార్థుల పట్ల వ్యవహరించుట అనుచితమనిరి. వారు వీలైనంత హెచ్చు సామదాన భేదోపాయములను (tact)ను తక్కువ బలమును ప్రయోగించుట అవసరమనిరి.

విశ్వవిద్యాలయోపాధ్యక్షుల అనుమతి లేనిది పోలీసు వారు విశ్వవిద్యాలయ కాలేజీహాస్టలు ఆవరణలలో ప్రవేశింపరాదని తీర్మానించినారు. ఢిల్లీలో జరిగిన విశ్వవిద్యాలయోపాధ్యక్షుల సమావేశ నిర్ణయానంతరముకూడా పోలీసులు తమ పాత పద్ధతులు మార్చుకొనలేదు.

5-11-66 తేదీన మీరతు నగరములో మీరతు కాలేజీ ముందు ఊరేగింపు చేయుటకు ప్రయత్నించిన విద్యార్థుల గుంపుపైన పోలీసువారు భాష్పవాయువు ప్రయోగించి లాఠీచార్జి చేసినారని విద్యార్థులు ఇటుకబెడ్డలు విసిరినారని అల్లరి చేయుచున్నవారిని "తొలగించుటకు" పోలీసువారు కాలేజీ ఆవరణలోనికి వెళ్ళినారని జిల్లా మేజిస్ట్రేటు చెప్పినాడు. 33 మంది విద్యార్థులకు 7 మంది పోలీసులకు గాయములు తగిలినవని ప్రకటింపబడినది. కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ ఆర్.సి. శాక్సెనాగారు విద్యార్థు లూరేగింపు చేయుటకు ప్రయత్నింపలేదని, ఊరిలోనుండివచ్చి కాలేజీలో చదువు పిల్లలను బయ

టకు పోనివ్వకుండా పోలీసువారు అటకాయించుటతో తగవు ప్రారంభమైనదని ఆ విద్యార్థులు, ఇండ్లనుండి తిరిగి వచ్చినప్పుడు పోలీసువారు వారివెంట కాలేజీ ఆవరణలోనికి చొరబడి విద్యార్థులను కాలేజీ యుద్యోగులను లాఠీలతో కొట్టినారని కాలేజీ చీఫ్ ప్రాక్టరుకుకూడా దెబ్బలు తగిలినవని, పోలీసువారు లేబరేటరీని ఇతర సామానులను ధ్వంసముచేసినారని దీనిని గురించి హోం మంత్రికి తంతి నిచ్చినామని చెప్పిరి.

కాలేజీకి ఎదురుగానున్న కోర్టు ఆవరణలోనికి కూడా పోలీసువారు చొరబడి న్యాయవాదులను గుమాస్తాలను కక్షిదారులను లాఠీలతో కొట్టినారు. సిటీ మేజస్ట్రీటును పోలీసు డిప్యూటీ సూపరింటును సస్పెండు చేయవలసినదని ఈఅన్యాయమునుగూర్చి విచారించవలసినదని న్యాయవాది సంఘము వారు తీర్మానించిరి. ఒక న్యాయవాదిచేసిన ఫిర్యాదుపైన అడిషినలు జిల్లా మేజస్ట్రీటు విచారణ జరుపుచున్నాడనిఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలో ప్రకటింపబడినది.

ఇట్లే ౯వ తేదీన అలహాబాదులోకూడా విద్యార్థులు హోం మంత్రి బొమ్మ తగులబెట్టుటకు ప్రయత్నించినసందర్భములో పోలీసువారితో సంఘర్షణ జరిగినదని విద్యార్థులు ఇటుక బెడ్డలు రువ్వినారని దౌర్జన్యము చేసినారని చెప్పి పోలీసువారు విశ్వవిద్యాలయముయొక్క హాలెండుహాలు డయిమండు జూబిలీహాస్టలు ఆవరణలలో చొరబడి లాఠీఛార్జి చేసినారు. తరువాత ఆసాయంకాలము సెనేటు హౌసులోను, హాస్ట

లులో కొందరు విద్యార్థులను అరెస్టు చేసినారని విశ్వవిద్యాలయోపాధ్యక్షులు శ్రీ ఆర్. కె. నెహ్రూగారితమ అనుమతి లేకుండా పోలీసు వారిట్లు అక్రమ ప్రవేశము చేయుటనుగూర్చి తమ అసమ్మతిని ప్రకటించిరి.

బొంబాయిలో న్యాయాధిపతిగాను, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయాధిపతిగాను పనిచేసి ఇప్పుడు బొంబాయి విశ్వవిద్యాలయోపాధ్యక్షుడుగనున్న శ్రీ గజేంద్ర గడ్కర్ గారు 15-10-66 తేదీన ఔరంగాబాదులో మరాట్వాడా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవమున చేసిన ప్రసంగమునంతయు విద్యార్థి సంక్షోభ సమస్యకే వినియోగించిరి. "విద్యార్థులు ఉపాధ్యాయులు స్నేహభావముతో తమ కష్టసుఖములు చర్చించుట కొక వేదిక యుండవలెను. విద్యార్థులు వైజ్ఞానిక మానసికోద్యోగ శక్తులను సన్మార్గములలో వినియోగించు అవకాశము లుండవలెను.

విద్యార్థుల దౌర్జన్య విజృంభణము కేవలము శాంతి భద్రతల సమస్యగా పరిగణించి పరిష్కరింపరాదు. ప్రజాసంఘమునందు వయస్సు మీరిన తరములవారిమధ్యను లేత వయస్సువారి మధ్యను సామరస్య ముండునట్లు సమస్య పరిష్కారము గావలెనుగాని వారిమధ్య వైషమ్యములు కలిగించునట్లు పరిష్కరింపరాదు.

శాంతి భద్రతలకు ప్రత్యక్షముగా భంగము కలుగు నప్పుడు వానిని కాపాడుట ఆవశ్యకమేగాని అట్లు చేయుటలో దేశములోని ప్రజాసంఘమునందలి వివిధ వర్గములకు మధ్య సామరస్యము కలుగుటకు తోడ్పడవలెనుగాని రెండుతరముల వారి మధ్య శాశ్వత వైషమ్యము వర్ధిల్లునట్లు ప్రవర్తింపరాదు

అకార్యములైన ప్రదర్శనములు జరిగినప్పుడు ప్రభుత్వమువారు విద్యావేత్తలు సాంఘికశాస్త్రవేత్తలుగల విచారణ సంఘముల నేర్పరుపవలెను. వారు సంకుచితభావముతో గాక విశాలభావముతో హృదయత్వముతో విచారింపవలెను. అంతేగాని సామాన్యనేరముల విచారణల కొరకేర్పడిన సి. బి. ఐ వంటి సంస్థలకే విచారణమును వప్పగించరాదు.

విశ్వవిద్యాలయాధికారులు సహాయము కావలెనని కోరనిది పోలీసువారే సందర్భములోను విశ్వవిద్యాలయ ఆవరణమున ప్రవేశింపరాదు. దేశములోని రాజకీయపక్షముల వారు తమ పరస్పర వివాదములలోనికి నిత్యకార్య కలాపములలోనికి విద్యార్థులను లాగరాదు.

విద్యార్థులికముందు దౌర్జన్య ప్రదర్శనములు చేయ కుండుటకు ప్రమాణింపవలెను" అనిరి.

మన స్వతంత్ర భారత ప్రజాప్రభుత్వమును నిర్వ హించు కేంద్రరాష్ట్రీయ మంత్రులు దేశశ్రేయమునకు పాటు

పడవలెనను వాంఛగల వారేగాని వారు పూర్వకాలమునాటి బ్రిటిష్ పరిపాలనములో నిర్మింపబడిన ప్రభుత్వయంత్రమును ప్రజాప్రభుత్వ సంప్రదాయముల ప్రకారము నడుపలేకున్నారు. ఆ యంత్రములోని వివిధ చక్ర రక్షకులందరు పూర్వకాలము నాటి నిరంకుశ సంప్రదాయములకు అలవాటుపడిన పెద్ద ఉద్యోగులు, వారిశిష్యులగు ఉద్యోగివర్గమువారు. మన మంత్రులీ యుద్యోగులపైన నాధారపడుచు ప్రతి విషయమునకు వారి సలహాలను స్వీకరించుచుందురు. ప్రభుత్వము గొప్ప కార్యాచరణ విధానము (Policy) నిర్ణయించుటలో కూడా వారి సలహా పొందుదురు. వారే సమస్యను గూర్చియైన ఆలోచించుటకొరకు కమిటీనిగాని కమీషన్‌గాని యేర్పరచినప్పుడు అందులో స్వతంత్రులు అనుభవజ్ఞులు ప్రతిభాశాలురు స్వార్థరహితులు నియమింపబడుట అరుదు. రాజకీయములు, ఆశ్రిత పక్షపాతము, సిఫారసులువలన మంత్రులకుగాని పెద్దయుద్యోగులకుగాని ఇష్టమైనవారే నియమింపబడుదురు. స్వతంత్రులెవ్వరైననున్నను వారి యభిప్రాయములకు చెల్లుబడియుండదు. అవినీతినిగూర్చిన సంతానం కమిటీవారి సూచన లింతవరకు అమలు జరుగకపోవుటయే దీనికి తార్కాణము.

మన ప్రభుత్వము తలపెట్టిన రాజకీయ ఆర్థిక సాంఘిక సంక్షేమ కార్యకలాపములను నిర్వహించుట కేర్పడిన వివిధ ప్రజాసంస్థలు, కార్పొరేషన్లు సహకార సంఘములును వానికి తోడ్పడుటకు నియమింపబడిన యుద్యోగుల సంగతిచూతము:

ఉద్యోగులు, పూర్వ సంప్రదాయములకు చెందిన శాసనవిధుల రికమకలలో కాగితపు ఫైళ్ళలో మునిగి తేలుదురు. కొందరు అవినీతి పరులుగా నుందురు.

ప్రభుత్వోద్యోగులందరును సహజముగా మంత్రుల నాశ్రయించి లాభమును పొందజూతురు. అందువలన వారు మంత్రుల పక్షములోని రాజకీయ నాయకులను అనుకూలముగా ప్రవర్తించుటసహజము. గ్రామపంచాయితీలు, సమితులు, జిల్లాపరిషత్తులు సహాకార సంఘములు ఇతర ప్రజాసంస్థలందు రాజకీయ ముఠాతత్వములు కక్షలు, స్వార్థలాభము, ఆశ్రిత పక్షపాతము ప్రబలియుండును. కంట్రాక్టులందు, కంట్రోలు సరుకుల వినియోగములందు అక్రమములు అన్యాయములు జరుగుచుండును. ధనాపహరణము దుర్వినియోగముకూడా జరుగుచుండును. కార్యనిర్వాహక ఉద్యోగులు రాజకీయమైన ఒత్తిడికిలోనై సరిగా వ్యవహరింపరు. పై తనిఖీచేయు ఉద్యోగులు చర్యతీసికొనరు. తుదకు పెద్దపెద్ద నేరములుజరిగి నప్పుడు రాజకీయ ప్రభావమువలన పోలీసు ఉద్యోగులుకూడా సరిగా దర్యాప్తుచేసి చర్యతీసికొనరు. శాసనసభలందు ఇట్టి సంగతులు బయల్పడుచుండును. వివిధ శాఖలలోను పెద్ద పెద్ద యుద్యోగులుకూడా మంత్రుల నాశ్రయించుచు తమ కర్తవ్యము సరిగా నిర్వహింపని యుదాహరణములున్నవి. సామాన్య ఉద్యోగులు మాట చెప్పనక్కరలేదు. కొందరు అవినీతి పరులుగనుందురు. రాజకీయమైన ఒత్తిడి కలిగినప్పుడు

మంత్రులు ఉద్యోగుల నిర్ణయమును తారుమారు చేయుచుందురు. ఈ పరిస్థితులు చాలా లోపములకు అన్యాయములకు కారణ మగుచున్నవి. ఉద్యోగివర్గము, ప్రజాసంస్థలు సహకార సంఘములు రాజకీయములకు లోబడి పనిచేయుచున్నందువలన ఆశ్రిత పక్షపాతము చూపుచున్నందున అన్యాయములు చేయుచున్నందున వారి నిర్ణయములకు గౌరవములేకుండ పోయినది. బహిరంగ విమర్శలు కోర్టు వ్యవహారములుకూడా జరుగుచున్నవి. నీతిపరులకు స్వాతంత్ర్యులకు దేశ సేవా పరాయణులకు తావులేకుండా పోవుచున్నది.

సమర్థులు అనుభవజ్ఞులునగు విశ్వేశ్వరయ్యగారివంటి వారిని ప్లానింగు కమీషనులో నియమింపక నెహ్రూగారు తమ కిష్టమైన వారిని నియమించటవల్లనే ప్లానింగు సరిగా జరుగలేదు. దాని దుష్ఫలితము ఇప్పుడనుభవించుచున్నాము. గాంధి మహాత్ముని సిద్ధాంతములను అనుసరింపుడని యుద్బోధించిన నాయకులే వానిని అనుసరింపరైరి. ఆ సిద్ధాంతము లిప్పుడములు జరుగుట లేదు.

ప్రజల ధనము దుర్వినియోగమగుచున్నది. పనులు సరిగా జరుగుటలేదు. ప్రజాప్రభుత్వమువలన లాభములు ప్రజలు పొందజాలకున్నారు.

ఈపరిస్థితులలో పూర్వము బ్రిటిషు ప్రభుత్వము వారిచేనిర్మింపబడి బలవంతమైన మన పోలీసు వ్యవస్థయొక్క కార్యాచరణ

విధానములు లోపభూయిష్టములగుటలో నాశ్చర్యములేదు. పోలీసు వారత్యాచారములు జరిగించినారని అన్యాయము చేసినారని నిష్పక్షపాతమైన విచారణ సంఘము నేర్పరుచు డని శాసనసభలలో మన ప్రజా ప్రతినిధు లెంత మొత్తు కొన్నను మనమంత్రులు సరియైన విచారణ సంఘముల ను నియమింపరు. పోలీసు అధికారుల నివేదికలపైన ఆధారపడి వారి మాటలు విశ్వసించి వారియొక్క చర్యలను సమర్థిం తురు. ఇక గత్యంతరము లేనప్పు డొక విచారణ సంఘమును నియమింతురు అందులో తగిన వారిని నియమింపరు. ఆవిచా రణ సంఘమునకు తగిన అధికారమివ్వరు. ఇన్ని లోపములు గల విచారణలలోకూడా అన్యాయములు బయల్పడి విచారణ సంఘమువారు వానిలో కొన్నిటిని గూర్చి తగినదైన చర్య తీసికొనవలసినదనిశిఫారసుచేసినప్పుడుకూడా అట్లు చేయరు. ఇది పోలీసు వారి అత్యాచారముల విషయముల విషయముననేకాదు. ఉద్యోగులు మంత్రులు మొదలగువారు చేసిన అన్యాయములును దుర్మార్గములు కొన్ని బయల్పడి నప్పుడు వానిని గూర్చి విచారణ జరుపుమని కోరినప్పుడు నిట్లే జరిగినది. ఇది నెహ్రూగారినాటినుండి వచ్చుచున్న సదా చారము. మంద్రా, కెయిరాన్, పట్నాయక్ మొదలగు ఉదాహరణము లెన్నో యున్నవి. విచారణ జరిగినప్పుడు అనుమానించిన దానికన్న హెచ్చు అన్యాయములు దుర్మా ర్గములు బయల్పడినవి. విచారణ సంఘములు నియమింపబడి

అంతలో చిత్రవిచిత్రములు బయల్పడినప్పుడుగాని మన మంత్రులు కన్నులు తెరువరు.

ఇటీవల 24-3-1966 తేదీన జగదల్పూరులో బస్తరు నేలిన ప్రవీరచంద్రభంజదేవుగారును అచ్చటి ఆదివాసులు కొందరును పోలీసువారి తుపాకిగుండ్లవలన మరణించిరి. దానిని గూర్చి విచారణ సంఘ మేర్పడి ఒక విచారణ జరుగుచున్నది. ఇంతలో నెన్నో ఘోరములు బయల్పడుచున్నవి.

పోలీసువారి చర్యలను శాసనసభలందు తీవ్రవిమర్శలు చెలరేగినప్పుడు మన ప్రభుత్వము గూర్చి విచారణ జరిగించుట దానిని బుట్టదాఖలుచేయుట ఆచారమైనదిగాని పోలీసుచర్యలనుగూర్చి నిష్పక్షపాతముగా స్వతంత్ర న్యాయమూర్తులచేత విచారణ జరిపించి పోలీసు వ్యవస్థలోని లోపములను పరిశీలించి దానిని సంస్కరించు సత్సాంప్రదాయము లింతవరకు ఏర్పడలేదు. బ్రిటిషువారు మన దేశములో స్థాపించిన బాధ్యతారహిత సంప్రదాయము లిప్పటికిని పూర్తిగా మారలేదు ఇప్పటికిని పోలీసువారిలో అవినీతి, లంచగొండితనము నిరంకుశత్వము, క్రూరహింసావిధానములు, అబద్ధపు సాక్ష్యముల బనాయింపు మొదలగు దుర్మార్గములు ప్రబలియున్నవని పోలీసు పరిపాలననుగూర్చి మన శాసనసభ సమావేశములందు ప్రశ్నోత్తరములలోను అప్పుడప్పుడు జరుగుచర్చ

లలోను న్యాయస్థానములందలి విచారణలలోను బయల్పడు సంగతులవలన స్పష్టముగా కనబడుచున్నదిగాని దీనినిగూర్చి ప్రభుత్వములు శ్రద్ధ వహించుటలేదు.

ప్రతియేటను రైల్వే తంతి తపాలా శాఖలందును ఇతర శాఖలందువలెనే పోలీసువారును మర్యాదవారమును నొక నాటకమును ప్రదర్శించుటవలన మంత్రులందు పాల్గొనుట శ్రీరంగనీతులు చెప్పుట పరిపాటియైనదిగాని పోలీసువారి నిత్య వ్యవహారములందు ప్రజలపట్ల మర్యాదగా ప్రవర్తించుటలేదు. స్వతంత్రభారత పౌరుల వ్యక్తి గౌరవము, ప్రాథమిక పౌర హక్కులుకలవని తాము ప్రజాసేవకులమని పోలీసువారు గ్రహించి జాగ్రత్తగా ప్రవర్తించుటలేదు. వారిలో మార్పు వచ్చినగాని ప్రజలకు వారియందు గౌరవము విశ్వాసము కలుగదు.

నేను రచించిన భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము లోను ఈ పుస్తకములోను మనపోలీసువారిని గూర్చి నేను చాలా కఠినముగా విమర్శించినాను. అంతమాత్రముచేతనే పోలీసు వారిలో మంచివారే లేరని నాయభిప్రాయము గాదు. ఉన్నారుగాని మనదేశ రాజకీయ ఆర్థిక సాంఘిక పరిస్థితులను బట్టి చాలా తక్కువగా నున్నారు.

పోలీసుశాఖలో పనిచేయుట కత్తిపై సాముచేయుట వంటిది. ప్రభుత్వము వారి శాసన విధులు, వారు జారీచేయు

ఉత్తర్వులు, పోలీసువారు తూ.చ. తప్పకుండా అమలు పరుప వలసియుండును. అట్లు చేయుటలో వ్యక్తులకు ప్రజలకుకొంత అసౌకర్యము బాధ కలిగింపక తప్పదు. ప్రజల ప్రాణమానధనముల రక్షించుటలోకూడా కొందరికిబాధ కలిగింపక తప్పదు. పోలీసువారు తమ విధ్యుక్తధర్మము నిర్వహించుటలో కొంత బాధ కలిగింపక తప్పదనుమాట నిజమేగాని అవసరమైన దానికన్న హెచ్చు బాధ కలిగింపకూడదను సంగతి వారు గ్రహించి ఈధర్మమును త్రికరణశుద్ధిగా పాటించినచో కొంత బాధ కలిగినను ప్రజలు సహింతురు.

తన యుద్యోగధర్మమును న్యాయముగా నిర్వహించిన పోలీసువారి నెవ్వరును నిందింపరు. తన విధిని కఠినముగా నిర్వహించినను ఎవ్వరేమనరు. అన్యాయమునకు అధర్మమునకు ఒడిగట్టినపుడే గర్హింతురు.

పోలీసువారి కర్తవ్య నిర్వహణమునందు వారి సహజ స్వభావముయొక్క ప్రభావము ప్రతిబింబించుచుండును. కొందరు సహజముగా కోప స్వభావులు, కొందరు సాత్వికులు, శాంత స్వభావులుగ నుందురు. కొందరు దూరదృష్టి గల వారును కొందరు తొందరపడువారుగా నుందురు. ఓపిక పట్టినచో చక్కబడగల పరిస్థితులు తొందరపాటువలన పాడగును. ఇట్టి యుదాహరణములు పూర్వము బ్రిటిష్‌వారి కాలము ననేగాక ఇప్పుడు నున్నవి.

ఇటీవల చెలరేగిన విద్యార్థుల అల్లరులలో కొంచెము నిదానించినచో సరుకులాటు కాగల పరిస్థితి తొందరపడి కట్టె లాఠీలతో కొట్టినచో తుపాకి కాల్పులలోనికి దిగును

పోలీసువారిలో కొందరు సహజముగనే నిరంకుశులుగ నుందురు. కొందరు పైవారి మెప్పుకొరకు అన్యాయము చేయుదురు. కొందరు అవినీతిపరులై అన్యాయము జరిగింతురు. కొందరు మాత్రము నీతినియమములు, మర్యాద, పాటించి ప్రవర్తింతురు. యథారాజా తథాప్రజా అను ఆర్యోక్తి ప్రకారము పోలీసుశాఖలోని పైయధికారులనుబట్టి క్రిందివారును ప్రవర్తించుచుందురు. పూర్వము ఇంగ్లీషువారి పరిపాలన కాలమున జారీచేయబడిన పోలీసుల ఉద్యోగవిధులనుగూర్చి "కానిస్టేబిలులకు హెడ్ కానిస్టేబిలులకు డ్యూటీ హింట్సు" అను సూచనల పుస్తకమొకటిప్పటికిని యున్నది. ఇందులోని సూచనలు చాలా బాగున్నవిగాని అవి ఆచరణలో సరిగా జరుగుటలేదు.

## పోలీసు వ్యవస్థఖర్చు - పోలీసుయుద్యోగుల వివరములు

ఆంధ్ర దేశములోని పోలీసువ్యవస్థకొరకు 1956–57లో బడ్జెటులో రు 5154800వ్యయము చేయబడినది. అనగా రాష్ట్రములోని జనాభాలో తల 1కి ఒకరూపాయి 65 పైసలు చొప్పున వ్యయము చేసినారన్నమాట. వైద్యము కొరకు ఖర్చు పెట్టినదానికన్న ఇది రెట్టింపుగా నున్నది.

1957 లో పోలీసు వ్యవస్థలోని ఉద్యోగుల సిబ్బంది సంఖ్య.

| | |
|---|---|
| పోలీసు ఇనస్పెక్టరు జనరల్ | 1 |
| ,, అడిషనల్ ,, | 1 |
| ,, డిప్యూటీ ,, | 5 |
| పోలీసు జిల్లా సూపరెంటెంట్లు :- | |
| ,, పర్మనెంటువారు | 80 |
| ,, టెంపొరరీవారు | 22 |
| పోలీసు ఇనస్పెక్టర్లు పర్మనెంటు | 250 |
| ,, ,, టెంపొరరీ | 62 |
| సబ్ ఇనస్పెక్టర్లు & సార్జెంట్లు పర్మనెంటు | 118 |
| సబ్ ఇనస్పెక్టర్లు & సార్జెంట్లు టెంపొరరి | 6 |
| సబ్ ఇనస్పెక్టర్లు పర్మనెంటు | 1002 |
| టెంపొరరి | 326 |
| ,, జమేదార్లు హెడ్ కానిస్టేబిల్సుపర్మనెంటు | 3836 |
| టెంపొరరీ | 1056 |
| కానిస్టేబిల్సు పర్మనెంటు | 25244 |
| టెంపొరరి | 4478 |

## పోలీసు ఉద్యోగుల జీతములు

| ఉద్యోగము | నెలకు జీతము రూపాయలు |
| --- | --- |
| పోలీసు ఇనస్పెక్టరు జనరల్ | 2250 |
| ,, అడిషనల్ ,, | 2250 |
| ,, డిప్యూటీ ,, | 1800 |
| జిల్లా సూపరెంటు | 640 _ 1200 |
| డిప్యూటీ సూపరెంటు | 350 - 20_600 |
| ఇనస్పెక్టరు | 250 _ 10-400 |
| సబ్ ఇనస్పెక్టరు | 150-7½-190-10_250 |
| హెడ్ కానిస్టేబిల్ | 80-3_120 |
| కానిస్టేబిల్ | 60_2-90 |



# శాసన విధులు

స్వతంత్ర భారతరాజ్యాంగము అమలులోనికి వచ్చు నాటికి అనగా 1950 జనవరి 26వ తేదీనాటికి అమలులో నుండిన శాసన విధులన్నియు రాజ్యాంగము అమలులోని మన రాజ్యాంగముయొక్క 372 (1) అర్టికలు శాసించినది.

భారతదేశ పరిపాలనలో ప్రజాప్రాతినిధ్య విధానము లేని సమయమున అనగా 1861 లో బ్రిటిషువారి పాలన శాసింపబడిన పోలీసు చట్టముకూడా మన రాజ్యాంగమును బట్టి అధికారబలమును కలిగియున్నదనియు స్వతంత్రరాజ్యాంగమునుబట్టి అది చెల్లదని వాదించుటకు వీలులేదనియు మన హైకోర్టులును సుప్రీముకోర్టువారును తీర్మానించియున్నారు. ఇట్లే బ్రిటిషువారు మన దేశము నేలుచుండగా శాసింపబడిన శిక్షాస్మృతి, క్రిమినలు ప్రొసీజరు కోడు మొదలగు శాసనములన్నియు యథాప్రకారము అమలు జరుగుచున్నవి. అయితే పూర్వమువలెగాక ఈశాసనముల క్రింద జరుపబడు చర్యలు రాజ్యాంగమునుబట్టి ప్రజలకేర్పడిన ప్రాతిపదిక హక్కులకు భంగము కలిగించినప్పుడు భారతీయ పౌరులు న్యాయస్థానములం దభియోగముచేసి తగు పరిహారములను పొందుటకు రాజ్యాంగ మధికార మిచ్చినది. 1861 సంవత్సరమునాటి పోలీసు చట్టము 23 వ పరిచ్ఛేదములో పోలీసు వారిముఖ్య కర్తవ్యములు వివరింపబడినవి.

"అధికారులు "లా" ప్రకారము పంపు ఉత్తరువులను వారంటులను శిరసావహించి అమలు జరుపుట, ప్రతిపోలీసు

ఉద్యోగియు చేయవలసిన కర్తవ్యము ప్రజాశాంతికి సంబంధించిన సమాచారములను సేకరించి, అధికారులకు తెలియపరచుట, నేరములు, పబ్లికు న్యూసెన్సు ♦ జరగకుండా నివారించుట నేరములు చేసినవారి జాడలు తీసినవారిని న్యాయస్థానములందు శిక్షింపజేయుట పట్టుకొనుటకు తగిన కారణముండి, తాను పట్టుకొనుట కధికారముగల వారిని పట్టుకొనుట అతనివిధి. పైన చెప్పిన కర్తవ్యముల నిర్వహణమునకై వారంటు లేకుండా కూడా ఏ సారాయి దుకాణములోనికిగాని జూద గృహములోనికిగాని, అక్రమ చర్యలు జరిగించు వారుండు ఏ ప్రదేశములోనికిగాని ప్రవేశించుట న్యాయశాస్త్ర సమ్మతమై యుండును.

(2) నేరముల దర్యాప్తు: ఇండియన్ పీనల్ కోడ్డుఅను శిక్షాస్మృతిని బట్టిగాని వివిధములైన ప్రత్యేక చట్టములను బట్టిగాని నేరముల క్రిందికి వచ్చు పనులు చేయువారిని పట్టుకొని న్యాయశాస్త్రానుసారముగా శిక్షింపజేయుట పోలీసువారి కర్తవ్యము. వారంటు లేకుండా పట్టుకొనతగిన "కాగ్నిజిబుల్" నేరముల విషయములోనే గాక వారంటు లేకుండా

---

♦ పబ్లికు న్యూసెన్సు అనగా కంటికి, ముక్కునకు చెవికి అపాయము, చిరాకు చెరుపుగాని లేదా విశ్రాంతికి, నిద్రకు భంగముగాని కలిగించునట్టి, లేదా ప్రాణాపాయము కలిగించునట్టి ఆరోగ్యమునకుగాని ఆస్తికిగాని చెరుపు కలిగించునట్టి కార్యముచేయుట, కార్యలోపముచేయుట అట్టి వస్తువు స్థలము అని నిర్వచింపబడినది.

పట్టుకొనుటకు వీలులేని "నాన్ కాగ్నిజబుల్" నేరములను దర్యాప్తు చేయుటకుకూడా క్రిమినల్ ప్రొసీజరు కోడు 156వ పరిచ్ఛేదము పోలీసువారి కధికార మిచ్చుచున్నది.

(3) పోలీసు చట్టము (1861) యొక్క 23, 43 పరిచ్ఛేదములనుబట్టి అధికారులు జారీచేయు వారంటులనుసమనులను ఉత్తరువులను పోలీసువారు నేరస్థులకును సాక్షులు మొదలగు వారికిని అందజేయవలసియున్నారు.

(4) శాంతిని కాపాడుట, పోలీసువారి కర్తవ్యములలో ముఖ్యమైనది. (1861) పోలీసు చట్టము 2:వ పరిచ్ఛేదమును క్రిమినలు ప్రొసీజరుకోడు 143, 145 పరిచ్ఛేదములును పోలీసువారు శాంతికి భంగము కలుగకుండా నివారింపవలెనని బోధించుచున్నవి.

(5) పబ్లికు న్యూసెన్సులను నివారించుట పోలీసువారి విధి. కుళ్ళి దుర్వాసన గొట్టు పదార్థములు, అట్టి పనులు, చెవులు బ్రద్దలగుచప్పుడు, కంటికి చెరుపుచేయు మెరుపులు, మంటలు, ఆరోగ్యమునకు భంగకరములగు పనులు, ప్రాణభయము కలిగించు పనులు వారు నివారింపవలెను.

(6) యజమాని యెవ్వరో తెలియని వస్తువును,ఆస్తిని కాపాడుట, పోలీసువారి కర్తవ్యము. పోలీసుచట్టము 25వ పరిచ్ఛేదమునుబట్టి ఎక్కడనైనను ఎవరిదో తెలియకుండా పడియున్న ఆస్తిని స్వాధీనము చేసికొని దాని చవారాను వ్రాసి, జిల్లామేజిస్ట్రేటుకు పంపవలెను. ఆ యధికారి దాని

నట్లు వినియోగింపవలెనని ఉత్తర్వుచేసిన అట్లు చేయవలెను. ఆ ఆస్తి ఎవ్వరికో పోలీసువారు దర్యాప్తుచేసి యజమానుడు దొరికినచో వారికి స్వాధీనము చేయవలెను.

7. దొంగ తూనికలు, దొంగ కొలతలు, శిక్షా స్మృతిలో 264 నుండి 267వ పరిచ్ఛేదమువరకుగల నేరముల విషయమున పోలీసువారు తూనికరాళ్ళను కొలపాత్రలను తనిఖీచేయుచు పిచ్చి తూనికరాళ్ళను కొలపాత్రలను ఉపయోగించువారిని శిక్షింపజేయవలెను. దీనికొరకు వారు సోదా చేయుటకు క్రిమినలు ప్రొసీజరుకోడ్డు 153వ పరిచ్ఛేదమధికారమిచ్చుచున్నది.

8. ఖైదీలను ఖజానాను జాగ్రత్తగా తీసికొని వెళ్లుట, చెరసాలలయందు 'గార్డుడ్యూటీ', సరిహద్దులలో సుంకములు చెల్లింపకుండా దొంగసరుకు రవాణాలనుఅరికట్టుట. పూర్వము ఇంగ్లీషు సిపాయిలు సరిహద్దులలో చేయుచుండిన పనులిప్పుడు పోలీసువారు చేయుదురు.

9. క్రిమినలు ప్రొసీజరు కోడ్డు 152వ పరిచ్ఛేదమును బట్టి పోలీసువారు వ్యక్తులకు ఆస్తికి రక్షణము నివ్వవలసియున్నారు.

10. హద్దులేక తిరుగాడు పశువులు : పశువుల అక్రమ ప్రవేశ చట్టముయొక్క 10, 11 పరిచ్ఛేదములనుబట్టి రోడ్లపైనను, వినోద స్థలములందును తిరుగాడుచు తోటలకు, కాలు

వలకు, గుఱుగు కాల్వలకు పోతగట్లను చెరుపు చేయు పనువులను పోలీసువారు పట్టుకొనవలెను.

11. రోడ్లపైన క్రమ విధానము నమలుపరచుట :—

రోడ్లపైన నదుల యొక్కయు కాల్వల యొక్కయు స్నాన ఘట్టములు పడవల రేవులపైన ప్రజలు చేరు బహిరంగ ప్రదేశములలోను ఉత్సవములందు పోలీసువారు తగు కట్టుదిట్టము చేయవలెను. బాజాలు, మేళములు, తాళములు ధ్వని ప్రస్ఫుట యంత్రములు మొదలగువాని నుపయోగించుటలో జాగ్రత్త వహించవలెను.

ఇటీవల మోటారుబండ్ల చట్టమువలనను ఇతర చట్టముల వలనను పోలీసువారికి చాలా క్రొత్త కర్తవ్యములేర్పడినవి. విపరీత వేగముతో మోటారు నడుపుట, బ్రేకులు లేకుండాను ఇతర జాగ్రత్తలు తీసికొనకుండాను నడుపుట లైసెన్సులు లేకుండా నడుపుట మొదలగునవి నేరములు. అజాగ్రత్తవలన ప్రాణాపాయములు గాయములు కలిగించుటయు నేరములుగా నున్నవి. పోలీసు చట్టము 34 వ పరిచ్ఛేదమును బట్టి రోడ్లపైన

1. పశువులను వధించుట, పశు కళేబరములను కడుగుట మొదలగు పనులు.

2. విపరీత వేగముతో పశువులను తోలుట, గుఱ్ఱములను తర్ఫీదుచేయుట.

3. పశువులను క్రూరముగా కొట్టి హింసించుట.

4. బాటసారుల రాకపోకలకు బందు, పశువులు ఆటంకము కలిగించుట.

5. (రోడ్లపైన) వస్తువులు పరచి అమ్మజూపుట.

6. (రోడ్లపైన) చెత్త అశుద్ధ పదార్థములు వేయుట.

7. త్రాగి గోలచేయుట.

8. సిగ్గు విడచి రహస్యావయవములు ప్రదర్శించుట.

9. అపాయము కలిగించు స్థలములను జాగ్రత్తపరచకుండుట నేరములైనందువలన పోలీసువారు చర్య తీసికొనవలెను.

12. పోలీసు బీటు, పెట్రోల్ డ్యూటీ: పోలీసువారు నేరములు జరుగకుండా రాత్రిళ్ళు గస్తీ తిరుగుచుండవలెను.

13. బూతు పుస్తకములు, ప్రచురణములు, బొమ్మలు వగైరాలను రాజద్రోహాకరములగు గ్రంథములను ప్రచురణలను పోలీసువారు వశము చేసుకొని కోర్టువారి యుత్తరువును బట్టి నశింపుచేయవలెను.

14. ఇతర కర్తవ్యములు : (1) దొంగివస్తువుల క్రయ విక్రయ నివారణము (2) జూదముల నరికట్టుట (3) లైసెన్సు లేకుండా సారాను చేయువారిని అమ్మువారిని నిషా వస్తువులను విక్రయించు వారిని పట్టుకొని శిక్షింపజేయుట.

క్రి॥ ప్రా॥ కోడ్డు 54వ పరిచ్ఛేదము (1) క్రిమినలు ప్రొసీజరు కోడు రెండవ షెడ్యూలులో వారంటు లేకుండా అరెస్టు చేయదగిన- "కాగ్నిజబుల్" నేరములతో సంబంధము గలిగినట్టి, లేదా ఒకరిపైన అనుమానింప కారణముగల ఫిర్యాదు చేయబడినగాని. వీనినిగూర్చి నమ్మతగిన సంజ్ఞాయిషీ వచ్చియున్నగాని, అట్లు సంబంధము కలిగినట్లు అనుమానించుటకు కారణమున్నగాని

(2) కన్నము వేయుటకు, తాళములు బ్రద్దలు గొట్టుట మొదలగు గృహభేదనపు దొంగతనము చేయుట కుపయోగించు పరికరము లెవరిదగ్గరనైన కనబడినగాని

(3) క్రిమినలు ప్రొసీజరు కోడ్డు క్రిందగాని రాష్ట్రీయ ప్రభుత్వమువారి వలన నేరస్థుడుగా ప్రకటింపబడిన వ్యక్తినిగాని

(4) దొంగసొత్తు అని నమ్ముటకు హేతువుగల ఆస్తిని స్వాధీనములో కలిగియుండి ఆ నేరము చేసినట్లనుమానింప వీలైన వ్యక్తినిగాని

(5) పోలీసువారి కర్తవ్య నిర్వహణములో ఆటంకము కలిగించిన వారిని గాని న్యాయమైన స్వాధీనమునుండి పరారి యైన వానిని గాని పారిపోవుటకు ప్రయత్నించిన వానినిగాని

(6) సైనిక నావిక వాయుదళములనుండి పారిపోయిన వారినిగాని

(7) ఇండియాలో శిక్షార్హమైన నేరముగా పరిగణింప బడు చర్యను ఇండియా వెలుపలచేసినట్లు ఫిర్యాదు వచ్చిన గాని, నేరము చేసినట్లు నమ్ముటకు అనుమాన మున్న వారినిగాని

(8) విడుదల చేయబడిన శిక్షితులు విడుదల షరతుల నుల్లంఘించినపుడు గాని

(9) ఒక వ్యక్తి చేసిన నేరము నుదహరించి అతనిని అరెస్టు చేయవలసినదని ఇంకొక పోలీసు అధికారి కోరినప్పుడు గాని, వారంటు లేకుండానే పోలీసు అధికారి అరెస్టు చేయ వచ్చును.

ఇట్లే నిరంతరముగా దౌర్జన్యములో కూడిన దొంగ తనములు చేయువారిని, ఆతతాయి గాడీలను శిక్ష తప్పించు కొనుటకు దాగినవారిని పోలీసు ఉద్యోగి వారంటు లేకుండా అరెస్టు చేయవచ్చును. 57 వ పరిచ్ఛేదమునుబట్టి వారంటు లేకుండా అరెస్టు చేయకూడని నేరము చేసినవాడు తన

పేరును చిరునామాను ఇవ్వకపోయినను, ఇచ్చిన పేరు చిరునామాయు నిజమైనవి కావని తోచినను, పోలీసు అధికారి ఆ వ్యక్తిని అరెస్టు చేయవచ్చును.

58. వారంటు లేకుండా అరెస్టు చేయతగినట్టియు, జామీనుమీద విడుదల చేయుటకు వీలులేనట్టియు నేరమును చేసినవారిని, ఇస్తిహారులో ప్రకటింపబడిన నేరస్థులను ప్రయివేటు వ్యక్తులుకూడా అరెస్టు చేయవచ్చును. అయితే అనవసరమైన ఆలస్యము చేయకుండా ఆ వ్యక్తిని పోలీసు అధికారికి వప్పగించవలెను.

155 : వారంటు లేకుండా అరెస్టుచేయ వీలులేని "నాన్ కాగ్నిజబుల్" నేరము జరిగినట్లు ఎవ్వరైనను పోలీసు స్టేషను ఉద్యోగికి రిపోర్టు చేసినప్పుడు దానిని సంగ్రహముగా డయిరీ పుస్తకములో వ్రాయవలెను. దానిని గూర్చి పోలీసు వారు దర్యాప్తు చేయనక్కరలేదుగాని డైరీలో వ్రాయుట వారి విధి.

శాంతి భద్రతలను కాపాడుటకు నేరములు జరగకుండా నివారించుటకు జరిగిన నేరములనుగూర్చి జాడలు తీసి నేరము చేసినవారిని పట్టుకొని కేసులు పెట్టుటకు పోలీసు వారికి అవసరమైన అధికారములన్నియు శాసన విధులవలన కలిగింపబడినవి. నేరముల దర్యాప్తు చేయుటలో ఏ గృహావరణమునందైన ప్రవేసించుటకు సోదా చేయుటకు, ఎవ్వరి

నైన ప్రశ్నించి వాఙ్మూలములు పుచ్చుకొనుటకు, ఆస్తిని, జంతువులను మనుష్యులను పట్టుకొనుటకు, సాక్షులను విచారించుటకు కోర్టులో కేసులు దాఖలు చేయుటకు వారికి ఇంగ్లాండులో లేని చాలా అధికారము లొసగబడియున్నవి. ఈ అధికారములను వారు సక్రమముగా వినియోగించుచున్నారా లేదా అని విచారించి చర్య జరుపుటకు మాత్రము తగు రక్షణలు లేవు.

పోలీసువారు నేరములు దర్యాప్తు చేయుటలోను, నేరములు జరుగకుండా నివారించుటలోను, వారికి సహాయము చేయుట పౌరుల ధర్మము. అట్లు చేయవలసిన బాధ్యతకూడా క్రిమినలు ప్రొసీజరు కోడ్డు 42వ పరిచ్ఛేదము వలన విధింపబడియున్నవి.

ఒక మేజస్ట్రేటుగాని పోలీసు ఉద్యోగిగాని అరెస్టు చేయతగిన వ్యక్తి పారిపోవకుండా నిరోధించుటకుగాని, శాంతికి భంగము కలుగకుండా నివారించుటకుగాని, రైల్వే, టెలిగ్రాఫు, కాలువలు మొదలగు ప్రభుత్వ ఆస్తికి నష్టము కలుగకుండా నివారించుటకుగాని ఏ వ్యక్తియొక్క సహాయము నైనను కోరినచో ఆ వ్యక్తి సహాయము చేయవలెనని ఆ పరిచ్ఛేదము విధించుచున్నది.

పోలీసు ఉద్యోగి కానట్టి ఏ ఇతర వ్యక్తికైనను ఒక వారంటు జారీచేయుటకు పంపినప్పుడు ఇతరు లెవ్వరైనను

దానిని అనులుపరచుటలో సహాయము చేయవలెనని 43 వ పరిచ్ఛేదము చెప్పుచున్నది.

శిక్షాస్మృతిలో 121 మొదలు 130 వరకుగల పరిచ్ఛేదముల క్రింద ప్రభుత్వమునకు ద్రోహులు చేయు నేరములు రాజద్రోహనేరములు, ప్రభుత్వోద్యోగి ఖైదీని పారిపోవనిచ్చు నేరముగాని జరుగునని 143 మొదలు 148 వరకుగల పరిచ్ఛేదములలో చెప్పబడిన దొమ్మీ నేరములు జరుగునని 302 - 304 పరిచ్ఛేదములందు చెప్పబడిన హత్యానేరములు మనిషిని చంపుటకు సన్నాహముచేసి దొంగితనము చేసిన నేరము 393 309 పరిచ్ఛేదములందు చెప్పబడిన దోపిడి, బందిపోటు నేరములు అట్టి నేరములు చేయుటకు సమావేశమగు నేరము నిప్పు అంటించి, పేలుడు పదార్థములతో చేయు దుశ్చేష్ట (Mischief) నేరము. యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్ష విధింప తగిన నేరమునకై, అక్రమ గృహప్రవేశము మొదలగు 456 - 460 పరిచ్ఛేదములందు చెప్పబడినట్టి నేరములు జరుగునని తెలిసిన వ్యక్తులు మేజస్ట్రేటుకు గాని పోలీసు అధికారికిగాని తెలియపరుపవలెనని క్రి॥ ప్రొ॥ 44వ పరిచ్ఛేదము విధించుచున్నది. ఇట్లే గ్రామమునసబు మొదలగు వారును తమ యిలాకాలో జరుగు నేరములను తెలియపరుపవలెనని నిబంధనలున్నవి.

పోలీసువారు చేయు అరెస్టుల సందర్భములో అరెస్టు చేసిన మనిషిని అవసరమైన దానికన్న ఎక్కువగా నిరోధమునందుంచరాదని క్రి॥ ప్రొ, కోడ్లు 50వ పరిచ్ఛేదమునందున్నవి.

ఆడమనిషిని సోదా చేయుట కింకొక స్త్రీచేత చేయించవలెనని 52 వ పరిచ్ఛేదము విధించుచున్నది.

ఇట్లు రక్షణము విధ నివేషధములు కొన్ని శాసనములలో వివరింపబడియున్నను ఆచరణమునందు కొన్ని లోపములు జరుగుచునే యుండును. వీనిని గూర్చి చెప్పవలెనని నప్పుడు కొన్ని సందర్భములలో విని న్యాయము జరిగించక పోయిన ఉదాహరణము లున్నవి. దీనికి కారణము మన దేశ ప్రజలలో విద్య, విజ్ఞానము లేకపోవుట. ఆంగ్లేయ ప్రజా ప్రభుత్వ సంప్రదాయము లిక్కడ లేకపోవుట.

పూర్వము బ్రిటిష్ వారుచేసిన శాసనవిధులు స్వతంత్ర భారత ప్రజారాజ్యమునందు అమలు జరుగుచున్నట్లే పూర్వము మద్రాసు ప్రభుత్వమువారు చేసిన శాసన విధులు ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తరువాత ఆంధ్రరాష్ట్రములోను నేటి ఆంధ్ర ప్రదేశ్ లోను అమలుజరుగుచున్నవి. వీనిని నూతన పరిస్థితుల కనుగుణముగా సవరించి సంస్కరించుట ఆవశ్యకము.



# పోలీసు వారి ఉద్యోగ విధులు

పోలీసు కానిస్టేబిలు హెడ్ కానిస్టేబిలుల ఉద్యోగ విధులనుగూర్చి పూర్వము మద్రాసు గవర్నమెంటు వారొక పుస్తకమును ప్రకటించినారు. ఇప్పటికిని అది అమలులో నున్నది.

(Duty Hints for Police Head Constables and Constables)

## పోలీసు ఉద్యోగస్థునియొక్క నడవడిక

పురజనుల విషయములో -

1. మర్యాదగా నడచుకొనుము.

2. వారికి కావలసిన సహాయమును చేయుచు, అడిగిన సమాచారములను చెప్పవలెను.

3. స్త్రీల యెడలను, బిడ్డల యెడలను శాంతముగాను దయతోను నడచుకొనవలెను.

4 స్వేచ్ఛగా నడచుకొను జనుల విషయములలో ప్రవేశించవద్దు.

5. కక్షలలో చేరక మర్యాదగా మంచి నడతకలిగి శాంతభావముతో నడచుకొనుము.

నీ పైయుద్యోగస్థుల విషయములో విధేయుడవై చెప్పిన పనులను తక్షణము నెరవేర్చుము.

పోలీసువారు చేయవలసిన డ్యూటీ :-

1. నేరములను, న్యూసెన్సులను జరుగకుండా ఆటంకము చేయుము.

2. నేరములను పత్తాచేసి నేరస్థులను న్యాయస్థానమునకు పంపుము.

3. జనుల నెమ్మదికి భంగముకలిగే సమాచారములను తక్షణము తేవలెను.

4. న్యాయమైన ఉత్తర్వులను వారంట్లను అమలు జరుపుము.

గ్రామముల బీటు :-

ఈ క్రింద నమోదుపరచిన వాటిని గురించి విచారించవలెను.

(1) నేరములు (2) తిరుగాడు గ్యాంగులు (3) చోరీ (మాలు) సరుకులను పుచ్చుకొనువారు (4) అనుమానాస్పదమైన క్రొత్తజనులు (5) కేడీలు గుమానీలు (6) క్రిమినలు ట్రైబు మెంబర్లు (7) సారాయి అంగళ్ళు, కల్లు అంగళ్ళు (8) లైసెన్సులేని ఆయుధములు (9) జనసమూ

హాములు, పంచాయితీలు (పంచాయతీ పేరున నేరము మాఫీచేయుట) (10) సొమ్ము జమచేయుట (మోసవిధముగా చందాలు వసూలుచేసి హరించుట) (11) కక్షలు (పార్టీలు) (12) నెమ్మదికి భంగముచేసే విషయములు.

టవును బీటు :-

1. ఉత్తరువులు పుచ్చుకొనుటకు ఏర్పాటుకాబడిన వేళకు పావుగంట అయినా ముందుగా వచ్చి హాజరుగ నుండవలెను.

2. కానిస్టేబిలు బీటుకు పోవునప్పుడు బీటునుండి వాపసు వచ్చినప్పుడు గుంపుగా నడిపించుకుని రావలెను. ఇంటికి పోకముందు స్టేషనుకు హాజరై పోవలెను.

3. తనిఖీచేయు ఏ ఉద్యోగస్థునికైన బీటుబుక్కును హాజరుచేసి సంతకము చేయించుకొనవలెను.

4. నిన్ను బీటునుండి బదలాయించు వరకు బీటును విడిచిపోకూడదు.

పగటి వేళ డ్యూటీ చేయువారు :-

1. అప్రమత్తులుగానుండి తమ కండ్లను, చెవులను పూర్తిగా తెరచియుంచుకొని అన్ని సంగతులు గమనించుచుండవలెను.

2. అనుమానాస్పదముగా కనబడే అందరి మను ష్యులనున్ను మాటలు వగైరాలు మోసికొనిపోయే అను మానముగా కనపడే అందరిని కనిపెట్టవలెను.

3. సారాయి దుకాణము మీదను, దొంగసొత్తును పుచ్చుకొనేటట్టు అనుమానింపతగిన వారి యిండ్లమీదను దృష్టియుంచి వాటిలోనికి పోవువారిని గమనింపవలెను.

4. జనోపద్రవములును, ఆటంకములును మునిసిపల్ చట్టములకు భంగములున్నూ ఆపవలెను. న్యూసెన్సు చేసిన వారిని గురించి రిపోర్టు చేయవలెను.

5. ఆటంకము కలుగునని లేక నెమ్మదికి భంగము జరుగునని జడుపు కలుగునప్పుడుగాని గుంపులను చెదర గొట్టవలెను.

6. నీ బీటులో నివసించియుండే అందరి జనులయొక్క గుణములు అలవాటులు తెలిసికొనవలెను.

7. ప్రతి వీధి సందు ముఖ్యముగా కాపురము లేన ట్టియు విరిగి పడిపోయినట్టి ఇండ్ల విషయమును తెలిసికొని యుండవలెను.

8. విపరీతకరమగు సంగతులేమైనా యుండిన స్టేషన్ హావుస్ ఆఫీసరుగారికి తెలుపవలెను.

రాత్రులలో డ్యూటీ చేయువారు :-

1. నీయొక్క బీటులో ఎడతెగకుండా అటు నిటు తిరుగుతూ దొంగలు దాగుకొనుటకు వీలుండు జాగాలను ముఖ్యముగా గమనించవలెను.

2. ఇండ్లయొక్క తలుపులు కిటికీలు వేసియున్నవో లేవో చూచి తీసియున్నయెడల వాటికి కారణము విచారించవలెను.

3. బైట జనులవల్ల చూడబడకుండా నెమ్మదిగాను జాగ్రత్తగాను ఇండ్ల నీడలలో తిరుగులాడుతూ సాధ్యమైనంత మటుకు అన్నిటిని చూస్తూ వుండవలెను.

4. ఒకేవరుసను తిరుగక మార్గము తప్పించి, బీటు కానిస్టేబిలు ఒకమారు వచ్చిపోయిన తరువాత తమకు లాభము లేదని అనుకొను దొంగలను మోసపుచ్చుటకై అప్పుడే వచ్చిపోయిన స్థలమునకు తిరిగి వెంటనే వస్తూ వుండవలెను.

5. దొంగలు చోరీ సొత్తులను తీసికొనిపోవు సమయము తెల్లవారుజాము గనుక అట్టి సమయములలో అతి జాగ్రత్తగా నుండవలెను.

6. వాడుక లేనివేళలలో తిరుగులాడు జనులను గమనించి తిరుగా వానిని గుర్తించుచుతూ యుండవలెను.

7. కేడీలు గుసూసీలు హాజరు, గైరాజరు అయ్యే విషయములో వారిని తనిఖీ చేయవలెను.

నేరముల విచారణ: –

1. నీవు దర్యాప్తు చేయబోవు నేరముయొక్క ముఖ్యాంశములను వివరముగా తెలిసికొనవలెను.

2. నీవు దర్యాప్తుకు పోవునప్పుడు ఎఫ్. ఐ. ఆర్.ను తీసికొనిపోవలెను. (ప్రథమ సంజాయిషీ రిపోర్టు. F. I. R.)

3. కేసుకు సంబంధించిన ముఖ్యమైన రికార్డులను వెంటబెట్టుకొని వెళ్ళవలెను. అనగా సాక్షులు పోయిన కేసు లైనచో ఇండ్ల సోదాపట్టీ, జామీనుఖత్తు, నీయొక్క నోటు బుక్కు, కేసు డైరీ మొదలైనవి.

4. నేరము జరిగిన స్థలమునకు తక్షణమే పోయి అక్కడ పాదముల గుర్తులు, చేతివ్రేళ్ళ గుర్తులు, నేరమునకు గాను ఉపయోగించునట్లు కనపడు ఆయుధములు లేక ఇతర వస్తువులను జాగ్రత్తగా సంగ్రహించి యుంచవలెను.

5. నేరము జరుగు స్థలమునంతను పూర్తిగా జాగ్రత్తగా చూడవలెను.

6. ముద్దాయిలను గాని అనుమానింపబడిన మనుష్యులను గాని పట్టుకొనుటకు ప్రయత్నము చేయువలెను.

7. నేరమునకు సంబంధించిన సొత్తులను పట్టుకొన వలెను. వాటిని ఎక్కడనైనా దొడ్లలో దాచిపెట్టినట్లు సహేతుకమైన అనుమాన మున్నయెడల సదరు ఇండ్లను సోదా చేయవలెను. (చూడు మహాజరునామా ఇండ్ల సోదా)

8. ఆలస్యము చేయక చోరీ పోయిన సొత్తుల యొక్కయు అనుమానింపబడే మనుష్యుల యొక్కయు గుర్తింపు చిహ్నములను వ్రాసి పంపుము.

9. నేరమునుగురించి సమాచారమునకు గాను అందరు జనులను ముఖ్యముగా పిల్లలను చాలా తెలివిగా విచారించుము.

10. తెలివిగల మనుష్యులను కల్లంగళ్ళవద్దకు, లంజల యిండ్లకు, చోరీ సొత్తులను పుచ్చుకొను వారివద్దకు, చెడు నడత గలవారు పోయే జాగాలకు నియమించి పంపవలెను.

ఉత్సవ బందోబస్తు డ్యూటీ :-

సాధారణ ఉపదేశములు.

1. ఉత్సవము జరుగు స్థలమునకు రాగానే ప్రదేశపు (స్టేషన్ హౌస్ ఆఫీసర్) S. H. O. గారి దగ్గర హాజరై నీవు చేయు పనులకు ఉత్తరువు పొందవలెను.

2. నీకు ఇవ్వబడిన అద్ప్ మెమోలో నీవు వుండవలసిన జాగా, స్టేషను, సెక్షను, చేయువలసిన డ్యూటీలు గ్రహించి ఆ ప్రకారము చేయవలెను.

3. నీకు ఏర్పాటు చేయబడిన స్థలములోనేయుండి ఆ కాలముననే భోజనశాల యున్నయెడల పోవలెను.

4. డ్యూటీలేని సమయమునందు నీ క్యాంపులోనే యుండి అవసరమైనప్పుడు డ్యూటీకి హాజరు కావలెను.

5. డ్యూటీ లేనప్పుడు యూనిఫారము వేసికొని తిరుగుచూ యుండకూడదు. ముఖ్యముగా రైలుస్టేషను జాగాల వద్దకు పోకూడదు.

6. ఈ డ్యూటీమీద నియమింపబడినప్పుడు కుటుంబమును తీసుకొని పోకూడదు. సమన్లు అమలుజరుపవలెననే మొదలైన మిమమీద బందోబస్తు డ్యూటీ లేనప్పుడు ఉత్సవాదులకు పోకూడదు.

డ్యూటీలో:-

7. శానిటరీ (ఆరోగ్య ఉద్యోగస్థుల అధికారము క్రిందను నడచుకొనవలెను.

8. అంటురోగములుండే స్థలములనుండి వచ్చే జనులను ఆటంకపరచవలెను.

9. న్యూసెన్సులు చేయకుండా నిలుపుదలచేసిజనులకు జనసముదాయమునకు గాను నియమింపబడిన పాయిఖానాలకు పంపవలెను.

10. కలరా, స్ఫోటకము, ప్లేగు మొదలగు వ్యాధులు కలిగినప్పుడు తక్షణము మెడికలాఫీసరు వారికి రిపోర్టు చేయవలెను.

11. అట్టి అంటు జాడ్యములు తగిలినవారికి సహాయము చేసి హాంగాని ఆసుపత్రులు మకాములు వగైరాలు వున్నట్లు వారికి చెప్పవలెను.

12. నిషేధించబడిన స్థలములలో నీళ్ళను తీసికొనకూడదని, త్రాగకూడదని జనులకు తెలియపరచవలెను.

13. బండ్లు నిలుచు స్థలములు, సత్రములు, శుభ్రముగా నుండునటు చూడవలెను.

14. పెట్రోలు తిరుగుతూ నేరములు వగైరాలు అపుదల చేయుచు ప్రజలకు నెమ్మది కలుగచేయవలెను.

15. చెడ్డనడత గలవారిని, కేడీలను, జేబుదొంగలను తప్పుకూలీలను వీరి విషయములో నిగాయుంచి తగిన చర్య తీసికొనవలెను.

16. తప్పు కూలీకిగాను, నిర్బంధించు జనులను వారంటు లేకనే అరెస్టు చేయవచ్చును.

(చూ. పట్టతగిన నేరములు)

17. తప్పిపోయిన పిల్లలను పోగొట్టుకొన్న సొత్తును అట్టి ఆఫీసు లున్నయెడల వాటివద్దకు సదరు జనులను పంప వలెను. అట్టివి • లేనియెడల అతిసమీపమందుండు పోలీసు స్టేషనుకు పంపవలసినది. ఇట్లు పోగొట్టుకొని వెదకుచుండు జనులను పై స్థలములకు పంపవలెను.

18. అకస్మాత్తుగా కొలడములు, ప్రమాదములు వగైరాలు జరిగినయెడల సహాయము చేసి గాయము తగిలిన వారిని ఆసుపత్రికి పంపవలెను.

19. బండ్ల రహదారీని గురించి యుత్తర్వులను గమ నించవలెను.

20. దేవాలయములలో గాని, జనుల గుంపులవద్ద గాని ఉత్సవములు పోవుచున్నప్పుడు గాని ఆకస్మిక ప్రమా దములు సంభవించకుండా గుంపుల దొమ్మిని తొలగించుము.

21. దేవస్థానము వారికి కూలీలను జమచేయుటకు సహాయము చేయనక్కరలేదు.

22. అట్టి పనులు నెరవేర్చినందుకు వారివద్దనుండి ఇనాములను తీసుకొనకూడదు, వీటికై వారిని బలవంత పెట్ట కూడదు.

నే ర ము లు :-

పట్టతగినవి, పట్టతగనివి అని రెండు రకములు. పట్టతగిన నేరములు జరుగునని తోచినచో స్టేషను

హౌవుస్ ఆఫీసరుగారికి తెలుపవలెను. నేరమును ఇంకేవిధము గాను అప్పటకు సాధ్యము కానియెడల అవసరమైన విషయములలో నేరస్థుని అరెస్టు చేయుము.

పట్టతగని నేరములలో (1) పబ్లికు సామానులకు చెఱుపు విషయముగాని నెమ్మదికి భంగముగాని చేయుదురని తోచినప్పుడు వారిని హెచ్చరింపుము.

2. నీ హెచ్చరికను వారు అలక్ష్యము చేసినయెడల నీవు తలంచిన నేరము జరుగబోవు సమయమున వారిని అరెస్టు చేయుము. పట్టతగిన నేరములనుగూర్చి నీవు స్టేషను ఛార్జిలో నుండునప్పుడు కేసును దాఖలుచేయుము. ఇతర డ్యూటీలో నున్నప్పుడు ఫిర్యాది పేరు అడ్రెసుయొక్క వివరము వ్రాసికొని అతనిని స్టేషనుకు పంపవలెను.

పట్టతగని నేరములు :-

పోలీసువారి యెదుట ఏ మనుష్యుడైనా నేరము చేసినగాని లేక నేరము చేసినట్లు ఏ మనుష్యుడైనా పోలీసు వారి యెదుట హాజరు చేసినగాని

1. సదరు నేరము విషయములో ఫిర్యాదియొక్కయు, ముద్దాయి యొక్కయు పేరు అడ్రసు క్లుప్తముగా నేరము యొక్క విషయములున్ను వ్రాసికొనవలెను.

2. ఫిర్యాదిని తన కేసు విచారణకుగాని కోర్టుకు పంపవలెను.

3. ఈ సంగతి స్టేషన్ హావుస్ ఆఫీసరుగారికి రిపోర్టు చేయవలెను.

4. పేరు అడ్రసు చెప్పనియెడలను లేక తప్పుగా చెప్పినయెడలను ఈ విషయమును తెలుసుకొనుటకుగాను ముద్దాయిని అరెస్టు చేయవలెను.

5. అరెస్టుచేసిన పిదప పేరు అడ్రసు తెలిసినతర్వాత సదరు ముద్దాయిని జామీనుపైనగాని లేక స్వంత పూచీ పైనగాని విడువవలెను.

6. పట్టతగని నేరమును ఏ మనుష్యుడైనా ఫిర్యాదు చేసినప్పుడు సదరు విషయమును క్లుప్తముగా నీ నోటు బుక్కులో వ్రాసికొని సదరు ఫిర్యాదియొక్కయు ముద్దాయి యొక్కయు పేరు అడ్రెసు తెలిసికొని సదరు ఫిర్యాదీని ఆ ప్రదేశపు మేజస్ట్రీటుగారి వద్దకు పంపవలెను.

7. నీవు స్టేషనుకు వచ్చినతరువాత ఈ విషయమును నీ స్టేషను హావుస్ ఆఫీసరుగారికి రిపోర్టు చేయవలెను.

అరెస్టు - మనుష్యులను పట్టుకొనుట :-

ఈ దిగువ నమోదుచేసిన మనుష్యులను వారంటు లేకనే పట్టుకొనవచ్చును.

1. పట్టతగిన నేరములలో పరిశీలన లేక పరిశీలనట్లు క్రమమైన ఫిర్యాదు కాబడిన నమ్మతగిన వర్తమానము రాబడ్డ లేక న్యాయముగా సంశయింపబడిన ఏ మనిషినైనను.

2. కన్నపు నేరము చేయుట కుపయోగించు ఏ ఉపకరణమునైనను సరియైన సబబు లేక తన స్వాధీనమందుంచుకొనిన ఏ మనిషినైనను.

3. ప్రకటించబడిన ఏ నేరస్థుడినైనను

4. చోరీ సొత్తు అయినట్లు న్యాయముగా సంశయించతగ్గ ఏ వస్తువునైనా స్వాధీనములో కనుకొనబడ్డ ఏమనిషినైనా లేక అట్టి వస్తువు విషయమై ఒక నేరము జరిగించినట్టు సహాయకారిగా అనుమానించబడ్డ ఏ మనిషినైనను.

5. పోలీసు ఉద్యోగస్తుడు తన డ్యూటీ నెరవేర్చేకాలమందు అతనిని ఆటంకపెట్టిన వానిని, న్యాయమైన ఖైదు నుండి తప్పించుకుని పోయిన లేక తప్పించుకొని పోవుటకు ప్రయత్నించే ఎవ్వరినైనా

6. (శ్రీ రాజాగారి) ఇండియా ప్రభుత్వమువారి సైన్యదండులోనుంచి గాని నావికా లేక విమానదళమునుండి

గారి మెరైన్ సర్వీసునుండిగాని గైరుహాజరైన ఏ మనిషి నైనను.

(7) ఇండియాలో ఏ మనిషియైనా, ఇండియా వెలుపల పట్టతగినటువంటిన్ని జామీను పుచ్చుకోకూడ నటువంటిన్ని ఒక నేరముచేసి లేక అట్టి నేరములో శరీకైన లేక శరీకైనట్లు సహేతుకరమైన అనుమానింపబడు ఏ మనిషి నైనను.

8. క్రి॥ ప్రొ॥ కోడ్డు 565 సెక్షనుయొక్క 3వ సబు సెక్షనునుబట్టి చేయబడు ఏ నిబంధనమునకైనను విరోధముగా నడచుకొనే ఏ విడుదల ఖైదీ నైనను (చూ. విడుదలఖైదీ)

9. మరియొక పోలీసు ఆఫీసరుచేతను అరెస్టు చేయ వలసినగా కోరబడిన ఏ మనిషినైనను ఏ నేరమునకు లేక ఏ కారణముచేత ఎవరిని అరెస్టు చేయవలెనో వ్రాత మూలకముగా కోరినయెడల.

10. పోలీసు ఆఫీసరు యెదుటను పట్టతగని నేరము చేసిన లేక చేసినాడని నేరము పెట్టబడిన మనిషిని, పోలీసు ఆఫీసరు తన పేరు, కాపుర స్థలమును అడిగినప్పుడు చెప్పక పోయినా, లేక తప్పుపేరు కాపుర స్థలము చెప్పినాడని స తుకమైన కారణ మున్నప్పుడును.

11. మరియొక విధముగా నేరమును ఆపలేనప్పుడు పట్టుకోతగిన నేరమును చేయుటకు ప్రయత్నించు ఏ మనిషి నైనను.

12. పోలీసు ఆఫీసరు దృష్టియందు నెమ్మదికి భంగము కలుగజేసే మనుష్యులను మానుమని హెచ్చరిక చేసినప్పటికి మాననియెడల అట్టి మనుష్యులను అరెస్టు చేయవచ్చును. అనగా పట్టుకొనవచ్చును.

అరెస్టు - తుపాకీ మందుగుండు సామాను.

1. బందూకా (తుపాకి) లైసన్సు కలిగియున్నప్పటికిని ఏ మనుష్యుడయినా న్యాయ విరుద్ధమైన కార్యమునకు బందూకా తీసికొని పోవునప్పుడు.

2. లైసన్సు లేకగాని లైసన్సుకు విరుద్ధముగా గాని ఆయుధములు మందుగుండు సామానులు తయారు చేయడము, అమ్మకము లేక అమ్ముటకు తీసియుంచడము, దిగుమతి చేయుడము.

3. ఈ పట్టుబడిన మనుష్యులను ఆయుధములను మందుగుండు సామానును మహజరునామాతోపాటు స్టేషన్‌హౌస్ ఆఫీసరువద్ద హాజరు పరుపుము.

అరెస్టు లేక నిరాయుధుని చేయుట :-

1. ఏ మనుష్యుడైనా లైసన్సు లేకుండాగాని లేక లైసన్సులోనుండు షరతులకు వ్యతిరిక్తముగా గాని ఆయుధములను తీసికొనిపోవునపుడు.

2. నిరాయుధునిగా చేయబడిన ఈ మనిషియొక్క సరియైన పేరును, అడ్రసును పట్టుబడిన ఆయుధముయొక్క గురుతులు చహారాయును, ఏ సందర్భములో సదరు ఆయుధము పట్టుబడినది. ఈ విషయములనుగూర్చి ఒక మహాజరు నామా తయారుచేయుము.

3 పట్టుబడిన ఆయుధమును పనికిరాని లైసన్సువుండిన యెడల దానిని తయారుచేసిన మహాజరు నామాతో స్టేషన్ హావుస్ ఆఫీసరుగారి ఎదుట హాజరు పరుపుము.

4. ఆ మనిషియొక్క సరియైన పేరును, అడ్రెసున్న తెలుసుకొనుటకు వీలులేనప్పుడు తప్ప ఆ మనిషిని అరెస్టు చేయవద్దు.

అరెస్టు : పట్టుకొనుటలో ఈక్రింది అంశములనుగమనింపుము.

1. మఫ్టీలో నున్నప్పుడు అనగా బేడ్రెస్సులో నున్నప్పుడు నీవు పోలీసు ఉద్యోగస్థుడనని ఒక మనిషిని పట్టుకొనుటకు అధికారమున్నదని చెప్పవలెను.

2. వారంటుతోగాని లేక స్టేషను హావుస్ఆఫీసరుగారి వుత్తర్వుమేరకు అరెస్టు చేయుచున్నచో

3. అతనికి వారంటును చూపవలెను. లేదాదానిలోని సంగతులను చదివి వినిపించవలెను. అంతేగాని వారంటును అతని చేతికివ్వకూడదు.

3. (ఏ)- వారంటు లేని సమయమునన ఫలానా నేరము అనిగాని అరెస్టు చెయ్యడమునకు కారణముగాని చెప్పవలెను.

4. అరెస్టు చేసినట్టు తెలుపుటకై అతనిని తాకవలెను.

5. అతడు సదరు అరెస్టును ఎదిరించినను లేక తప్పించుకొనిపోవుటకు ప్రయత్నము చేసినను అతనిని పోనివ్వకుండుటకై అవసరమైనన్ని విధముల ప్రయత్నములు చేయవలెను.

6. కావలసినయెడల పురజనుల సహాయ్యమును కోరవలెను.

7. పట్టుకొనుటకు అవసరమైనంతకంటె యెక్కువ బాధను కలుగచెయ్యకూడదు.

8. పట్టుకొనే ఉద్యోగస్థునిపైన పట్టుకొనవలసిన మనుష్యుడు మరణము, లేక బలమైన ఘాతచేయునని నమ్ముటకు సహేతుకమైన భయము కలిగినప్పుడు ఆత్మసంరక్షణ హక్కును చలాయించుట కొరకు మాత్రమున్నూ, లేక మరణమువల్లగాని యావజ్జీవ ద్వీపాంతరవాసము వలనగాని శిక్షింపతగిన నేరము మోపబడిన మనిషిని పట్టుకొనుటకు ఇతర సాధనము లేనప్పుడును, తప్పపైన చెప్పినటుల అవసరమైనంతకన్న ఎక్కువ బాధ కలుగచేయకూడదు.

9. అతడు ఒక యింటిలో దాగికొని యున్నప్పుడు ఆ ఇంటి యజమానుని లేక కాపురము చేసేవారిని తగిన కారణమును చెప్పి నిరాటంకముగా పోలీసు ఉద్యోగస్థుడు ప్రవేశించులాగున కోరవలెను.

10. అట్లు ఇంటిలోనికి రానివ్వనియెడల లేక లోపలి నుండి బయటికి రానివ్వనియెడల బయట తలుపుగాని, కిటికీ గాని పగులగొట్టవచ్చును.

11. అది జనానా లేక అంతఃపుర స్త్రీలుండే స్థలమైన యెడల ఇందులో ప్రవేశించుటకు ముందు పట్టుకొనవలసిన మనుష్యులనుగాక యుండిన ఇతర స్త్రీలను అక్కడ నుండి వెళ్ళమని తెలియజేయుటయే గాకుండా బయటికి పోవుటకు వారికి న్యాయమైన సదుపాయము లన్నిటిని చేయవలెను.

12. జామీనుపైన విడువకుండనియెడల పట్టుకోబడ్డ మనిషిని సోదాచేసి అతనివద్దనుండే అపాయకరమైన ఆయుధములను భద్రపరచి యుంచవలెను. స్త్రీలను సోదాచేయవలసి యున్నప్పుడు మరియొక స్త్రీవల్లనే మానమునుగూర్చి ఖచితమైన జాగ్రత్త వహించి సోదా చేయవలెను.

13. అరెస్టు కాబడిన మనిషిని మర్యాదగా వెంటనే పోలీసుస్టేషను వద్దకు తీసికొని వెళ్ళవలెను.

14. సదరు మనిషిని వానివద్ద పట్టుబడిన ఆయుధము లను తయారుచేయబడిన మహాజరునామాతో పాటు హాజరు చేయవలెను.

15. అరెస్టు కాబడిన మనుష్యుడు రైల్వే టెలిగ్రాఫ్ పోస్టు డిపార్టుమెంటులలో నౌకరైయున్న పక్షమున అతడు డ్యూటీలో నున్నపుడు అరెస్టు చేయకూడదు.

16. అరెస్టు కాబడినవాడు ఖాయిలాగా నుండినను లేక గాయములు కలిగియుండినను కావలసినయెడల బండిని యేర్పాటుచేసి చికిత్సకుగాను ఆసుపత్రికి తీసికొని వెళ్ళ వలెను.

17. అతనిని డ్యూటీనుండి తొలగించుటకు అతని పైయధికారులకు తెలుపుచు వానిపై నిగా యుంచి తప్పించు కొని పారిపోకుండా చూడవలెను.

18. అతనిని డ్యూటీనుండి తొలగించిన తరువాత అరెస్టుచేసి సదరు విషయమును అతని పై యధికారులకు తెలియచేయవలెను.

ముద్దాయి లేక నిందితుడు:

1. ఒక నేరము మోపబడిన ఏ మనిషిపైనను ముం దుగా చెడ్డఅభిప్రాయమును కలుగజేసి కొనకుము. వానిని నేరము విషయము తెలిసిన యితరులనువలెనే భావింపుము.

2. వీనిపైన దౌర్జన్యముగాని అవమానము గాని చేయకుము.

3. నేరమును ఒప్పుకొనుటకుగాను వీనిని ఏలాటి విధమైన ప్రేరణము బలాత్కారము చేయకుము.

4. అతడు తనంతట తాను చెప్పే విషయములను నిలుపుదల చేయకుము.

5. అట్లు అతడు చెప్పినయెడల అట్టి సంగతులను నీయొక్క నోటు బుక్కులో తీసికొని స్టేషన్ హౌస్ ఆఫీసరు గారికి తెలియచేయుము.

6. అట్టివానిని పోలీసు స్టేషనుకు విళంబము (కాలహారణము) చేయక తీసికొనిపొమ్ము.

కేడీలు (K. D.) సస్పెక్టు గుమానీలు.

వీరి విషయమై విచారించవలెను.

1. కేడి యొక్క గైర్‌హాజరు విచారించవలెను.

2. నీవు చూచినప్పుడు అక్కడ ఏమిచేయుచున్నాడో చూడవలెను.

3. గైర్‌హాజరైనచో ఎక్కడికి పోయినాడో ఎప్పుడు తిరిగి వచ్చునో విచారించవలెను.

4 తరచుగా వీడు గైరుహాజరైనదో ఏ కారణమున ఎందుకు పోవునో విచారించవలెను.

5. వీడు ఏమైనా పని చేయుచున్నాడా అను సంగతియు దానివల్ల వచ్చు ఆదాయమును, వీని యజమానియొక్క నడతనుగూర్చి విచారించవలెను.

6. వీని సంరక్షణమందుండు జనులు వీరి ఆదాయమును తెలిసికొనుము. ఇదిగాక ఈ కుటుంబములోనుండే అందరి ఆదాయము మొత్తము వీరి జీవనమునకు చాలునో చాలదో విచారించవలెను.

7. వీరి ఆదాయమునకు తగినట్లు వీని సంసారము ఉన్నదా వీడు విశేషము ఖర్చు చేయువాడా లేక వీని ఇంటి స్త్రీలు విలువగల చీరెలు జాస్తి సొమ్ములు ధరించినారా యను సంగతి చూడవలెను.

8. వీనియొక్క మిత్రులు శత్రులుగాని చెప్పిన సంగతులు ఆలోచనలేక నమ్మవద్దు. వీని ప్రస్తుతపు నడత విషయమును వీని సహవాసుల విషయము గ్రామోద్యోగస్థుల నడిగి తెలిసికొనుము.

అనుమానాస్పదమైన క్రొత్త జనులను నిగహాలో నుంచి వారి విషయము అంతా విచారించవలెను.

మహాజరు నామాలు :-

ఎప్పుడు వ్రాయవలెను ?

1. ఇండ్లను సోదా చేయకుండా ఇతర ఏ విషయము లలో కాని సొత్తులను పట్టుకొన్నప్పుడు.

2. సొత్తులకు, యజమానులు (మాలికులు) లేనప్పుడును వసియజాగాలో కేసుకు సంబంధించిన (వస్తువు సరుకు) మాలు కనిపెట్టబడినప్పుడును, లేక ఒక మనుష్యుడు పోలీసువారికి మాలును వప్పగించినప్పుడును మహాజరునామా వ్రాయవలెను.

3. ముద్దాయిని గాని మాలునుగాని గుర్తింపు చేయునప్పుడు (సొత్తులనగా రక్తపు మరకలుగల బట్టలు, బురద, ఆయుధములు, వమనము, మలము, అడుగు గుర్తులు, చేతి వ్రేళ్ళ గుర్తులు తదితరములైనవి) ఎవరు చేయవలెను ?

4. మాలు పట్టబడినప్పుడు హాజరువుండే పోలీసు వుద్యోగస్థునివల్లగాని లేదా దానికి సంబంధించిన వక సాక్షి వల్లగాని ఎట్లు తయారు చేయవలెను ?

5. నిజముగా ఏమి ఏ విధముగా జరిగిన దిన్ని ఆకాలమందు చేయబడినగాని లేక చూడబడినగాని ఏ విషయముల యదార్థస్థితిని వ్రాయవలెను.

6. సదరు మహాజరునామాలో దొరకబడినటువంటి గాని పట్టుబడినటువంటి గాని లేక యివ్వబడినటువంటిగాని

అంశముల వివరమున్ను వీటియొక్క సరియైన చహారా, గుర్తులున్నూ వీటియొక్క విలువకట్టిన ఖరీదున్ను, ఈసొత్తులు దొరికిన సరియైన స్థలమున్నూ నమోదు పరచవలెను.

7. సొత్తు (యజమాని) మాలీకుడు గుర్తింపు చేసినాడా లేదా అను సంగతిని వ్రాయవలెను.

8. మహజరు నామాను సాక్షులచేత సంతకము చేయించి నీవును సంతకము చేయవలెను.

9. ఆలస్యము లేకుండా సదరు మహజరునామాను సొత్తులను స్టేషన్ హౌసు ఆఫీసరుగాని యెదుట హాజరు చేయవలెను.

ఇండ్లను సోదా చేయుట :-

అధికారము.

ఇంటిని సోదాచేయుటకు కానిస్టేబిలుకు ఏలాటి అధికారము లేదు? ఎప్పుడు చేయవచ్చును?

1. అతనిపేరిట క్రమప్రకారము సోదా వారంటును ఎండార్సుచేసినప్పుడును.

2. స్టేషన్‌హౌస్ ఆఫీసరుగారి నుండి వ్రాత మూలక మైన యుత్తర్వులు పొందినప్పుడును.

3. పట్టుతగిన కేసులలో ఇంటిని సోదా చేయుటకు ఆలస్యము చేసినయెడల సదరు కేసులో సంబంధించిన మాలును పరారీ లేక నాశనము కాబోవునని గాని లేక పట్టు తగిన నేరము రుజువుచేయు సాక్ష్యత్వమును దాచడముగాని నాశనముగానిజరుగునని నమ్మదగిన కారణము లుండినయెడల గ్రామమేజస్ట్రేటుతోపాటు ఇంటిని సోదా చేయవచ్చును.

సాధారణ నిబంధలు :-

4. నీయంతట నీవే సోదాచేయు పక్షమున సోదా చేయుటకుముందు ఏ సొత్తులకు గాను సోదా చేయవలెనో, సోదా చేయుటకు కారణము లేవిగలవో వీటిని వివరముగా వ్రాయవలెను.

5. ఎప్పటికిని పగటిపూటనే ఇంటిని సోదా చేయ వలెను. ఒకప్పుడు మాలు ఇంటిలో దాచిపెట్టినట్లు రాత్రి వేళలో అనుమానము వచ్చినప్పుడు ఇంటిలోనుండు జను లను వారి దేహమును జప్తి చేసి బయటికి పంపి ఇంటిని భద్రముగా సీలువేసి తెల్లవారు వరకు కాపుదల చేయవలెను.

6. సోదా చేయుటకుముందు ఇంటి బయటి భాగము నుండి సొత్తులను ఇంటిలోనికి చేర్చుటకు దోవలు గలవా యని చూడవలెను.

సోదాచేయుట :-

7. ఇంటిని సోదా చేయుటకు పోయినప్పుడు గ్రామ మేజస్ట్రేటును యింకా కొందరు సదరు ఇంటికి సమీపములో

నివసించియుండే కొందరు పెద్దమనుష్యులను తీసికొనివెళ్ళి సోదా చేయునప్పుడు చూచే సాక్షులుగా నుంచవలెను.

8. సోదాచేయుబడు ఇంటివానికిగాని సొత్తు పోగొట్టు కొన్నవానికిగాని సదరు సాక్షులు స్నేహితులుశత్రువులుగాక ఏలాటి సంబంధములేని వారై యుండవలెను.

9. ఇంటిని సోదా చేయుటకు ముందు సోదా చేయు టకు పోయే పోలీసు ఉద్యోగస్థుడు తన దేహమును సాక్షుల కును ఇంటి యజమానికిని జడ్తి చూపవలెను.

10. సోదా జరుగునపుడు ఇంటి యజమాని గాని, వాని తరఫున మరి యెవరైనను గాని హాజరు వుండుటకు అనుమతి నివ్వవలెను.

11. సోదా జరుగునపుడు సాక్షులను వెంబడినే యుంచు కొని సోదా చేయువలెను.

12 కేసులో ఫిర్యాదీని సోదా చేయుటలో సంబం ధింప చేయకూడదు.

13. ఇంటివారిని జడ్తిచేసి వేరువేరుగా నుంచవలెను.

14. ఆడువారిని జడితి చేయునపుడు వారి మర్యాదకు ఏ లోపము కలుగకుండా వేరే స్త్రీతో చేయించవలెను.

15. ఇంటియొక్క ప్రతి మూలను జాగ్రత్తగా సోదా చేయవలెను. సొత్తు దాచుటకు తగిన స్థలము కాదని యేలాటి స్థలమునైనను సోదాచేయుట మానకూడదు.

16. గోడ లోపలిభాగములో గూళ్ళు, పలుకలు యున్న విషయమై చెయ్యి తట్టి చూడవలెను. గోడలకు క్రొత్తగా మన్ను మెత్తిన విషయముగాని, ఇంటి నేలగాని, మిద్దెగాని క్రొత్తగా ఏ భాగమైనా కదిలించినారా లేక రిపేరి చేసినారా యను విషయమును కనిపెట్టవలెను.

17. ఏదైనా జాగాలో కన్నములున్నయెడల కొంచెము నీటిని పోసి త్రవ్వి చూడవలెను.

18. ఇంటిలోను ఇంటికి సంబంధించియుండే అన్ని స్థలములు అనగా తలుపులవద్ద కిటికీలవద్ద కట్టెలు యితర సామానులుంచినచోట, గడ్డివాములు, ధాన్యపాతరలు, చెత్త వేసే గుంటలు, వండుకునే పొయ్యి బావులు వగైరాలు జాగ్రత్తగా చూడవలెను.

19. వేరే స్టేషను యిలాకాలో ఇండ్లను సోదాచేయ వలసిన యెడల ఆ ప్రదేశపు పోలీసువారికి సోదా చేయుటకు తెలుపవలెను. లేక మిక్కిలి అవసరమైన సందర్భములో ఆ ఇండ్లను నీవే సోదాచేసి ఆ ప్రదేశపు పోలీసువారికి ఈ విషయము తెలుపుచూ సోదాపట్టీ నకలు నొకదాని నివ్వవలెను.

ఇంటి సోదా పట్టీ :-

1. సోదాలో దొరికిన ప్రతి యొక్క వస్తువును దాని సరియైన గుర్తింపు చహారా అండాజ ఖరీదు వ్రాసి సదరు వస్తువు దొరికినస్థలము విషయము వివరముగా నమోదు పరచవలెను. సొత్తులేవియు దొరకని యెడల "దొరకలేదు" అని వ్రాయవలెను.

2. సోదా పట్టీకి నిర్ణయించబడు అచ్చు పుస్తకములో రెండు ఫారములు తయారగునట్లు నీవుగాని లేక సాక్షుల చేతగాని వ్రాయించవలెను. అచ్చు పుస్తకము లేనియెడల తెల్లకాగితముపైన వ్రాయవలెను.

3. సదరు సోదా పట్టీలో నీవున్నూ సాక్షులున్నూ సంతకము చేయవలెను. ఇంటిలో కాపుర ముండువారి యొక్క లేక వారితరపున వచ్చినవారి యొక్కయు సంతములు తీసికో కూడదు.

ఇంటివారు కోరినయెడల :-

4. ఇంటి ఆసామికిగాని లేక వాని తరపున వచ్చిన వానికిగాని లేక మాలు చిక్కబడే మనిషికిగాని సోదాపట్టీ యొక్క నకలును కోరినయెడల ఇవ్వవలెను.

5. నీవు తయారుచేసిన సోదాపట్టీని దొరికిన మాలును స్టేషన్‌హౌస్ ఆఫీసరుగారికి స్వాధీనము చేయవలెను.

శవములు :-

గుర్తింపు :-

1. శవమును గుర్తించుటకు ఎవ్వరులేని పక్షమున శవము యొక్క చేతి వ్రేళ్ళ గుర్తులను తీసి శవముయొక్క ఫోటో గ్రాపు తీయించుటకు ఏర్పాటు చేయవలెను.

2. శవముపైనుండు సొత్తుల నన్నిటిని నీ స్వాధీన ములో నుంచుకొనవలెను.

3. ఈ శవము విషయమై నీ స్టేషన్ హావుస్ ఆఫీసరు గారికిని గ్రామ మేజస్ట్రేటు గారికిని సమాచారము పంపుము.

4. శవము చెడిపోకుండా బొగ్గు పొడిని పరచి దానిపై మరియొక బట్టను పరచి వీటిలో శవమును చుట్టవలెను. గ్రామ మేజస్ట్రేటువద్ద పై వస్తువులడిగి పుచ్చుకొనవలెను.

5. శవ పంచాయతీ లేక పోస్టు మార్టెము అయిన పిదప శవమును బంధువులకు గాని, స్నేహితులకు గాని కోరినయెడల ఇచ్చివేయవలెను. వారెవ్వరును లేనియెడల గ్రామ మేజస్ట్రేటు సహాయముతో పూడ్చవలెను.

శవ పంచాయతీ :-

చేయుటకు అధికారములు.

పోలీసు కానిస్టేబిలుకు శవ పంచాయితీ చేయుటకు అధికారములేదు. కాని తనపై అధికారులు లేక స్టేషన్ హావుస్ ఆఫీసరుగారు లేని సమయమున గ్రామ మేజస్ట్రేటు శవ పంచాయతీ చేయునపుడు అతనికి పోలీసు జవాను సహాయము చేయవచ్చును.

2. స్టేషను హావుస్ ఆఫీసరుగాని, గ్రామ మేజస్ట్రేటు గాని, హాజరు లేనప్పుడు అవుట్ పోస్టు చార్జిలోనుండు హెడ్ కానిస్టేబిలు శవపంచాయతీ చేయవచ్చును.

ఎట్లు చేయవలెను ?

3. సమీపమున కాపురముండు ఇద్దరు, ముగ్గురు మనుషులను పంచాయతీదార్లుగా నుండుటకు సమను చేసి వారిని పెట్టుకొనవలెను.

4. ఈ చావు విషయము సమాచారమును చెప్ప గలిగే జనులను సమను చేసి తెప్పించుకొనవలెను.

5 ఈ చావు విషయమై తెలియపరచు ఏ విషయము గాని లేక అందుకు సంబంధించు ప్రసంగతులు గాని తెలిసి కొనుటకు నేరస్థలమును పంచాయతీదార్లతో పాటు బహు జాగ్రత్తగా పరీక్ష చేయువలెను.

6. శవముయొక్క స్థితిని ఏయే స్థలములలో ఎన్నెన్ని గాయములు, వాటియొక్క స్థితి ఆకారము పరీక్ష చేయు వలెను.

ఇంక్వెస్టు రిపోర్టు వ్రాసే విధము :-

7. అచ్చు ఫారములోనుండే ప్రశ్నలకు ఉత్తరములను సరిగా వ్రాయవలెను.

8. శవముపైన యుండే గాయముల యొక్కయు విరిగిన యెముకల యొక్కయు, దెబ్బల యొక్కయు ఇతర గాయపు గుర్తులను వర్ణించుచు ఇవి ఏ ఆయుధములవల్లను కలిగింపబడినవో చూచి సరిగా వ్రాయవలెను.

9. మరణ విషయము పోయినవారియొక్క రక్త బంధువులను ఇంకా ఇతర సాక్షులను విచారించి వారు చెప్పిన వాఙ్మూలములను క్లుప్తముగా కేసు డైరీ ఫారములో వ్రాసి వాటిని అచ్చు రిపోర్టుతోపాటు చేర్చవలెను.

10. పైకి కనపడు మరణ కారణములను గురించి రిపోర్టు సంగతులను ఒప్పుకొను పంచాయతీదార్ల చేత సంతకము చేయించి నీవును దస్కతు చేయవలెను.

మెడికలు (శవ) పరీక్షకు గాను శవమును తీసికొని పోవుటలో పోలీసు కానిస్టేబిలు శవము వెంటనే దగ్గరగా

పోతూవుండవలెను. ఇతరులను తాకనివ్వకూడదు. డాక్టరు గారు శవపరీక్ష చేయు సమయమున వారిదగ్గర నుండవలెను. కావలసినచో ప్రదేశ పోలీసువారి సహాయము కోరవలెను. శవ పరీక్ష అయిన తరువాత శవమును దహనము చేయుటకు ఏర్పాటు చేయవచ్చును.

అపాయము :-

వీధిలో జనుల కాకస్మికముగా సంభవించు అపాయములందు

1. ప్రథమ చికిత్స చేయుము.

2. డోలీలో గాని, బండిలో గాని దగ్గరలోని ఆసుపత్రికి పంపుము.

3. స్టేషన్ హావుస్ ఆఫీసరు గారికి అపాయము విషయము, దాని కారణము తెలుపుము.

బండ్లకు అకస్మాత్తుగా అపాయము జరిగినప్పుడు :

1. ఆ స్థలము దగ్గర నున్నవారి పేర్లు, అడ్రెసులు వ్రాసికొని

2. ఎవరెవరు రోడ్డుకు ఏ వైపున బండ్లు తోలుచుండినది వారిలో ఎవరు తప్పుచేసినది చక్రముల జాడలు.

3. బండి తోలువాడు హెచ్చరిక శబ్దము చేసి నది లేనిది

4 అపాయము రాత్రి జరిగినచో బండికి దీప మున్నదా లేదా

5. బండియొక్క నంబరు చహారాలు తోలిన వారి పేర్లు సొంతదారుల పేర్లు, అడ్రసులు, బండ్లు తోలువాని బిళ్ళ నెంబరు మొదలగు విషయములను నోటుబుక్కులో వ్రాసుకొని స్టేషనువద్ద రిపోర్టు చేయుము.

6. అపాయము తగిలినవారున్నచో వారికి ప్రథమ చికిత్స చేసి ఆస్పత్రికి పంపుము.

7. గాయముతగిలిన పశువులున్నచో పశువుల ఆసుపత్రికి పంపుము.

అకస్మాత్తు మరణము :-

1. గ్రామ మేజస్ట్రీటున్నచో వారితోనే నేర స్థలమును తనిఖచేసి స్టేషను హావుస్ ఆఫీసరు వచ్చువరకు జనుల గుంపును దూరముగా నుంచుము.

2. అక్కడ ఆ దేహముగాని, ఆ చుట్టుపట్టుల స్థలమునుగాని, అక్కడనుండు వస్తువులు గాని కదిలించకుండా చూచుకొనుము.

3. స్టేషను హావుస్ ఆఫీసరు గారికి వర్తమానమంపి వారి యుత్తర్వులకు నిరీక్షింపుము.

(మునిగి చచ్చుట – శవ పంచాయితీ చూడుము.)

అక్రమ వినియోగము - సొత్తుయొక్క (చూ. నేరములు)

అక్రమ ప్రవేశము - (చూ. నేరములు).

అక్రమమైన సమూహము చెదరగొట్టుట : (అల్లరిగుంపుపై కాల్చుట చూ. నెమ్మది భంగము.)

అక్రమ ప్రవేశము - ఇంటిలో (చూ. నేరములు.)

అంటు రోగములు :-

రిపోర్టు చేయవలసినవి: నీ స్టేషను యిలాకాలో అంటురోగములు ఆరంభమైనయెడల వాటి విషయమై స్టేషను హావుస్ ఆఫీసరుగారికి తెలుపవలెను. (ఎస్కార్టు ఉత్సవ బందోబస్తు చూడుము.)

పిచ్చివారి చట్టము :-

1. తనకు తాను చూచుకొనలేక తిరుగులాడుచుండు పిచ్చివారినిగాని, జనసమూహమునకు తొందరచేయు పిచ్చివారిని గాని కానిస్టేబిలు తన స్వాధీనములో నుంచుకొనవలెను.

2. సదరు పిచ్చివానియొక్క బంధువులు కాపాడువారు వీని విషయమై శ్రద్ధ పుచ్చుకొనకుండినగాని వానిని హింసచేసినగాని స్టేషన్ హావుస్ ఆఫీసరుగారికి తెలుపవలెను.

3. పిచ్చి ఆసుపత్రినుండి తప్పించుకొన్న పిచ్చివారిని అరెస్టు చేయవలెను.

వరా :- ఇండియన్ లూనసీ చట్టము ప్రకారము అపాయకరమగు పిచ్చివారిని పిచ్చి ఆసుపత్రిలో నిర్బంధించుటకు మేజస్ట్రీటు చర్య జరిపించవచ్చును.

నెమ్మదికి భంగము :-

1. నెమ్మదికి భంగము కలిగించే ప్రతి యుద్యమమును గురించి సమాచారమును జనులయొక్క మనోభావములను తగవులు వీటిని విచారించి స్టేషన్ హౌస్ ఆఫీసరుగారికి తెలియచేయవలెను.

నెమ్మదికి భంగము కలుగునప్పుడు :-

2. జనుల గుంపును తొందరలేక తమ ఇండ్లకు పంపి వేయవలెను.

3. అవసరపడక నెమ్మదియైన మనసుతో నడచుకొనుచు నీపై యుద్యోగస్తుల యుత్తర్వును నిరీక్షించుము.

4. అప్పటికిని తొందర ఏమైన కలిగిన యెడల ఇండియన్ పీనల్ కోడ్డు 143 సెక్షను ప్రకారము ఆయన నేరము నకుగాను క్రిమిల్ ప్రొసీజరు కోడ్డు 54 సెక్షన్ ప్రకారము అరెస్టు చేయుము.

5. నెమ్మదికి భంగము కలుగకుండా అపుడల చేయుటకు పురజనుల సహాయమును కోరవలెను.

అల్లరిమూక - దొమ్మి :

1. చట్టవిరుద్ధమైన జనసంగము చెదిరి పోవుటకు తిరుగబడిన యెడల పురజనుల సహాయముతో జనులను అరెస్టు చేయుట.

దొమ్మి :—

2. ఆటంకము కలుగుననిగాని లేక నెమ్మదికి భంగము జరుగునని గాని ఐదుగురు కలుగునప్పుడుగాని గుంపులను చెదరగొట్టవలెను.

(ఇటీవల లాఠీ చార్జీలుచేసి చెదరగొట్టుట పరిపాటి యైనది.)

దొమ్మిపై కాల్పులు :

జనుల ప్రాణములకుగాని సొత్తునకుగాని అపాయము సంభవించునట్లు అల్లరిమూక యొక్క ఉద్దేశ్యము కనపడినప్పుడున్నూ సదరు విషయములో కాల్చుట తప్ప వేరే ఇతర సాధనములతో నివారించుట శక్యము కానప్పుడు మాత్రమే అల్లరి మూకపై కాల్చవచ్చును.

అల్లరిమూకపై కాల్చునప్పుడు :-

1. పోలీసు పార్టీకి ఛార్జిలోనుండే ఉద్యోగస్తుని వుత్తర్వు మేరకు మాత్రము కాల్చవలెను.

2. ఒకసారి కాల్చిన తరువాత సీజ్ ఫైర్ అను చెప్పు వరకు తనంతట తానే తుపాకిలో తోటా పెట్టి సిద్ధపరచు కొనవలెను.

పట్టణముల న్యూసెన్సు చట్టము :-

ఈచట్టముక్రింద శిక్షింపదగిన ఏ నేరమైనాఒకమనిషి ఒక పోలీసు ఉద్యోగస్థుని సమక్షములో చేసినప్పుడు సాధారణ ముగా అరెస్టు చేయకూడదు. నేరము చేసిన మనిషియొక్క పేరు అడ్రసు తెలిసికొన్న యెడల అరెస్టు చేయకూడదు. అట్లుగాక కాయమునకు భంగము కలుగునని తోచినయెడల అరెస్టు చేయవచ్చును. ఏదైన రాజవీధి, బాట, త్రోవ లేక జనులు ఉండేచోట ఈ చట్టపు నేరములు చేసిన యెడల

1. అజాగ్రత్తగా గాని, దౌర్జన్యముగా గాని పశు వులను తోలడము స్వారీ చేయడము లేక బండ్లను తోయు యే మనిషియైనా

2. అజాగ్రత్తగా పశువులను తోలి వచ్చే పోవు బండ్లకు ఆటంకము కలుగజేసిన ఏ మనిషియైనా

3. సహేతుకరమైన కారణములేకుండా బాటకు ఎడమ వైపున లేకుండా బండ్లనుతోలే లేక త్రోసే ఏ మనిషియైనా

4. తన స్వాధీనములోనుండే ఏ బండిని లేక పశువులను తగిన కట్టులో వుంచుకొనుటకు సాధ్యముకానంత దూరములో నిలిచిన ఏ మనిషియైనా

5. నిర్ణయించబడియున్న వాటికంటె యితర స్థలముల యందు సరుకులు యెక్కించడముకు గాని, దించడముకుగాని అవశ్యకమయిన దానికంటె యెక్కువ కాలము వుండేటట్టు లేక నిలిచేటట్లు చేసి బాటలో ధారాళముగా వచ్చిపోవు బండ్లకును, మనుష్యులకును ఆటంకము కలుగజేసే ఏ మనిషియైనా

6. ఆటంకము కలిగేలాగున సరుకులు అమ్మజూపే ఏ మనిషియైనా

7. అజాగ్రత్తగా గాని లేక వుద్దేశ్య పూర్వకముగా గాని ఏదైనా గుఱ్ఱమును వదిలిపెట్టి, లేక ఏదైనా క్రూరమైన కుక్కను వరాతికి చిక్కములేకుండా వదిలిపెట్టే, లేక మనిషిని గాని పశువులనుగాని పైబడేలాగునగానిలేకవుసికొలిపేలాగున చేసే యే మనిషియైనా

8. చీదర కలుగచేసేటట్టు బిచ్చమెత్తే, లేక ధర్మమిచ్చుటకై జాలిపుట్టించు ఉద్దేశ్యముతో కురుపులను గాని గాయములను గాని బయటపెట్టే ఏ మనిషియైనా

9. సతుకరమైన కారణములేకుండా ఏదైనా మురికిని గాని పెంటనుగాని యింటికట్టు సామానులను గాని బాటపైన నుంచే ఏ మనిషినిగాని

10. చీట్లు, పాచికలు, కవుంటరులను దంతపుకాయలు రూకలు లేక జూదము ఆడు ఇతర సాధనములతో జూదమాడే లేక కోడిపందెములాడే ఏ మనిషియైనా

11. బుద్ధిపూర్వకముగాను సిగ్గులేకుండానున్ను తన మానమును బయట అగుపరచే లేక జలబాధకు (విరేచనము) పోయినను లేక యేడు సంవత్సరములకు తక్కువ వయస్సు గల పిల్ల న్యూసెన్సును చేయునపుడు ఆపుచేయకుండా వుండే ఏ మనిషియైనను

12. తప్పత్రాగి ఒళ్ళు తెలియకుండా వుండే లేక అల్లరిగాను తారుమారుగాను సిగ్గులేని తరహాగా నడుచుకొనే ఏ మనిషియైనను

1. ఏదైనా నుయ్యి, చెరువు అపాయకరమైన స్థలము లేక కట్టడము వీటికి ఆవరణము కట్టించకుండా యుంచిన ఏ మనిషియైనా

2. ఏదైనా ఇంటినుండి పేడకుప్పనుండి ఫ్యాక్టరీనుండి ఏదైనా దుర్వాసనగల నీటిని వీధిలోనికి పారేటట్లు చేసిన ఏ మనిషియైనా

3. ఏదైనా జంతువును క్రూరముగా కొట్టి హింసింప చేసే లేక చిత్రబాధను పెట్టే లేక వుపయోగించుటకు తగిన స్థితిలో లేని ఏ జంతువునుగాని వాడుక చేసే

మరా : ఈ నేరములు చేసిన మనుష్యునిపేరు అడ్రసు తెలిసికొని వానిపైన తగిన చర్య తీసికొనుటకుగాను స్టేషన్ హౌస్ ఆఫీసరుగారికి రిపోర్టు చేయవలెను.

వీథుల ప్రక్కలయందు మామూలుగా నేతనేసే జనులు పరుచుకొన్న పడుగులు లేక ఎంటబెట్టుటకు వడ్లు మొదలైన సస్యములు వేసే ఏ మనిషి అయినా

బాడుగ బండ్ల చట్టము :-

బాడుగ బండ్లవారు ఈ క్రింద నమోదు పరచిన నేరములు చేసినయెడల బండి తోలేవాని పేరు బండిసొంతదారుని పేరు నేరముయొక్క వివరము వీటిని స్టేషన్ హౌసు ఆఫీసరు గారికి రిపోర్టు చేయవలెను.

బాడుగకు బండ్లను తోలునపుడు :-

1. దానిని రిజిష్టరు చేయకున్నప్పుడు

2. రిజిష్టరు నంబరు తీసికొనిపోబడిన ప్యాసింజర్ల సంఖ్య నమోదుగల ప్లేటు లేకుండ పోవునపుడు

3. జనుల యుపయోగమునకు పనికిరాని బండియైనను లేక తత్కాలానఉపయోగింపబడ్డ జంతువు పనికిరానిదై యున్న పక్షమునను

4. బండియున్న ప్లేటుయొక్క అక్షరములు గాని అంకెలుగాని కనపడక సమిసియున్న యెడలను

5. అబద్ధపు ప్లేటు వుంచుకొనియున్న యెడలను

6. డ్రైవరుకు లైసన్సులేకుండా బండి తోలునపుడు

7. డ్రైవరు తన నంబరు బిళ్ళను ధరించకుండా యున్నపుడు లేక వేరే బిళ్ళను ధరించినపుడు లేక అంకెలు సమిసి కనపడకపోయిన బిళ్ళను ధరించినపుడును

8. డ్రైవరు త్రాగి మత్తుగా నున్నపుడును

9. డ్రైవరు తన జంతువును తన స్వాధీనమున నుంచుకో లేనప్పుడు

10. తనయొక్క చెడిపోయిన నెంబరు ప్లేటును తిరుగ రంగు వేయుటకు ఇవ్వనియెడల.

11. తన నంబరు ప్లేటును పోగొట్టుకొన్న సంగతి రిపోర్టు చేయనియెడల

12. లైసన్సు కాలము ముగిసిన తరువాత ప్లేటు, బంటితోలు లైసన్సు, తన నంబరు బిళ్ళ యివ్వక పోయిన యెడల

13. బండి తోలునప్పుడు బాడుగ పట్టీని తనవద్ద నుంచుకొనక లేక పోలీసు ఉద్యోగస్థుడుగాని బాడుగకు తీసుకున్నవారు గాని కోరినప్పుడు హాజరు పరచనియెడల

14 కోరినప్పుడు బాడుగకు రానియెడల

15. పాసింజెరుల సామాను నియమించిన రేటు ప్రకారము వేసికొనిపోని సమయమున

16. నియమించిన నిబంధనల మేరకు పాసెంజర్లను ఎక్కించి తీసికొనిపోనియెడల

17. ఒకరితో బాడిగకు ఒప్పుకొని అతని అనుమతి లేక వేరే ప్యాసింజెర్లను బాడుగకు ఒప్పుకొని బండిలో కూర్చుండ పెట్టుకొనినపుడు.

18. మొదట నియమితకాలమును లేక దూరమునకు ఏర్పాటుచేసికొని తర్వాత దానికి వ్యతిరిక్తముగా బాడుగ చేసినవానిని విడిచిపెట్టుట

19. ఒక డ్రైవరు ప్యాసింజరును ఎక్కించుకొనునపుడు గాని, దింపునపుడు గాని మరియొక డ్రైవరు ఆటంకము చేసినపుడు

20. ఒక డ్రైవరు బాడుగకు ఏర్పాటు చేసుకొన్నపుడు అతనిని పోనివ్వకుండా అక్రమముగా నిలుపుదల చేసినయెడల

21. నియమించబడిన జనుల సంఖ్యకు ఎక్కువగా జనము నెక్కించుకొని పోవునపుడు

22. ప్యాసింజర్లకు అవమానకరమైనదిగా గాని దూషించినట్లుగా గాని మాటలాడినను సంజ్ఞ చేసినను

23. బాడుగలకు స్టాండు విడిచి వల్లకు వీధిలో బండిని తిరుగు లాడించునపుడును

24. ఒక శవమును గాని అంటు జాడ్యము తగిలిన ఏ మనుష్యునిగాని బండిలో తీసికొని వెళ్ళినతరువాత యీ సంగతి తెలిసియు బండిని శుభ్రపరచకయె తిరుగ బాడుగలకు తోలునపుడును

25. ఏ డ్రైవరయినా బండి నెంబరు ప్లేటుగాని తన నంబరు బిళ్ళగాని మోసకృత్యముగా వాడినప్పుడును లేక బండి ప్లేటుయొక్కయు డ్రైవరు బిళ్ళయొక్కయు అక్షరములు అంకెలు సమిసి కనపడక యున్నప్పుడును వీటిని సదరు డ్రైవరు వద్దనుండి తీసికొనవలెను

మోటారు బండ్ల చట్టము :

ఈ క్రింద నమోదుపరచియుండు మోటారు నేరములు జరిగినప్పుడు సదరు మోటారు బండియొక్క సొంతదారుడు,

డ్రైవరు కండక్టరు వీరి పేర్లు అడ్రసులున్నూ మోటారు బండిగుర్తు నంబరున్నూ తెలిసికొని రిపోర్టు చేయవలెను.

తోలడము :-

1. రిజస్ట్రేషను సర్టిఫికెట్ లేకుండా తోలినపుడు

2. లైసన్సు లేకుండా తోలినపుడు

3. పదునెనిమిది సంవత్సరములకంటె తక్కువ వయసుగల వానిచే బహిరంగ స్థలంలో తోలబడినపుడు

4. బహిరంగ స్థలములో లక్ష్యములేకుండా గాని అజాగ్రత్తగా గాని లేక జనుల కపాయకరమైన వేగముతో గాని తోలినపుడు

5. తాగి మత్తులోనుండి తోలినయెడల

6. తోలుతూవుండే మాదిరి బస్సులను తోలుటకు సర్టిఫికెట్టును పొందకయున్నప్పుడు లేనప్పుడు

7. బాడుగపోయే బండ్లకు తెల్లని రేకుపైన నల్లని యక్షరములతోను తక్కువ బండ్లకు నల్లని రేకుపైన తెల్లని యంకెలతోను నంబర్లు వేయకున్నపుడు

8. ముందు వెనుకలనుండు నంబరు రేకులకు తగినంత వెల్తురు లేనపుడు

9. సూర్యాస్తమయమునకు ముందు సూర్యోదయమునకు ముందు అరగంటలో తగినంత ప్రకాశముగల ముందరి దీపములున్ను వెనుకకు ఎర్రని దీపములు వుండని యెడల

10. మోటారుబండి రాకడను తెలియజేయునట్టిగాని సదరు బండియుండు స్థలమును తెలుపునట్టిగాని తగినంత హెచ్చరిక నిచ్చు సరియైన ఒక హారను లేనప్పుడున్ను

11. బాడుగకుపోయే మోటారుబండ్లను జి. ఫారము, డి. ఫారము పర్మిటులో లేనియెడల

12. డ్రైవరు గాక వేరే ఒక కండక్టరు బస్సుకు లేనప్పుడున్ను

విడిచిపెట్టినపుడు :-

13. మోటారుబండికి బహిరంగముగా కనపడు స్థలములో సదరు బండియొక్క పరిమాణము, అది మోయగల సామానుల తూకమున్ను వ్రాయకున్నపుడు

14. అదే వృత్తిగల డ్రైవర్లకు తమ డ్రైవింగు లైసన్సులో తన ఫొటోగ్రాఫు అతికియుంచనపుడు.

15. జిల్లా సూపరెంటెంటువారు సప్లయి చేసినటు వంటి నంబరు బిళ్ళను డ్రైవరు తనయొక్క ఎద ఎడమ

భాగమునందు బహిరంగముగా కనపడేటట్లు తగిలించు కొనని పక్షమున

చేయనపుడు :-

16. ఏ పోలీసు ఉద్యోగస్థుడైనా నిలుపుమని కోరి నప్పుడు బండిని నిలుపక పోయిన

17. ఏ మనుష్యుడైనా తన వద్దనుండే పశువులు పోవునని మోటారు బండిని నిలుపుమని కోరినపుడు నిలుపకపోయినను.

18. మోటారు బండివల్ల ఏ మనిషికిగాని లేక ఏ జంతువునకు గాని అకస్మాత్తుగా అపాయము సంభవించిన యెడల వీరలను ఆస్పత్రికి చికిత్సకు ఉచితముగా తీసికొని పోవుటకు మోటారుబండి నిలుపుమని చెప్పినపుడు నిలుప కున్నను

19. ఏ పోలీసు ఉద్యోగస్థుడైనా డ్రైవింగు లైసన్సును అడిగినపుడు డ్రైవరు హాజరుపరచని యెడలను

20. మోటారు బండ్లవల్లను ఏదైనా అకస్మాత్తు అపాయము సంభవించినపుడు పోలీసుస్టేషనులో రిపోర్టు చేయని యెడలను

21. జి. పర్మిటులో నమోదు అయియుండు వేగము నకు మించి జా సి వేగముతో పోయినయెడల

22. లైసన్సులు పొందినవాడు గాక ఇతరులు సదరు లైసన్సు నుపయోగించినయెడల

23. బండ్ల రహదారీని నడిపించుటకుగాని మోటారు చట్టము క్రిందను చర్య పుచ్చుకొనుటకు గాని బండిని నిలుపుమని చెప్పగా నిలుపనియెడల

24. డ్రైవింగు లైసన్సుగాని ఎచ్. ఫారముగల కండక్టరు ప్యాసుగాని డి. లేక జి. పర్మిట్లు తనిఖీ చేయుటకుగాని బండ్లను నిలుపుమని చెప్పినపుడు నిలుపనందుకు

రైల్వే చట్టము.

అరెస్టు :-

1. డ్యూటీపైన యుండే ఏ రైల్వే నౌకరైనా త్రాగి మత్తుగా నున్నయెడల

2. చట్టప్రకారము ఏర్పాటుకాబడ్డ నిబంధనలను జనోపద్రవము కలుగులాగున తిరస్కరించినట్టియు లేక తాను చేయవలసిన పనిని ఆలోచన లేకగాని జాగ్రత్తగా గాని చేయని ఏ రైల్వే నవుకరునైనా,

3. కారణములేక ఏ మనుష్యుడైనా, ఆడువారికిగాను ప్రత్యేకముగా ఏర్పాటుచేసిన స్థలమునకు ఉద్దేశపూర్వకముగా

4. ఏ ప్రయాణీకుడైనా త్రాగి మత్తుగాయుండి గలీజు చేసినను లేక ఇతర ప్రయాణీకులకు అసహ్యము కలుగు లాగున బూతు మాటలు ఆడినగాని, సిగ్గుమాలి, మాన హీనతగాని-నటించినగాని అతనిని

5. డ్యూటీ చేయుచున్న ఏ రైల్వే నౌకరునైనా అతని డ్యూటీని ఉద్దేశపూర్వకముగా ఆటంకము చేసినగాని

6. ఏ మనుష్యుడైన యినుపదారికి అడ్డముగా ఆటంకము కలిగేలాగున ఏ వస్తువునైనా పెట్టినా, రైల్వే దీపములు గాని సంకేతములుగాని తీసివేసినా లేక రైలులో ప్రయాణము చేయుచున్న జనులకు వుపద్రవము కలుగజేయుటకై ఏలాటి పనులనుగాని చేసినట్లయినా

7. రైలు పోవునప్పుడు దానిపై రాళ్ళు లేక వేరే ఏమయిన విసిరినగాని

8. ఇనుప దారియందుండిన, లేక ప్రయాణముచేయుచుండిన జనులు నెమ్మదికి ఉపద్రవము కలుగజేసే చట్టవిరుద్ధమైన కార్యమునుగాని లోపమునుగాని ఉద్దేశ పూర్వకముగా చేసిన ఏ మనుష్యుడైనా

9. ప్రయాణము చేయుచుండిన జనుల నెమ్మదికి అపాయము కలుగునట్లు ఆలోచన లేకను అశ్రద్ధచేతను చేయునట్టి ఏ కార్యమునుగానిలోపమునుగానిచేసినవానిని (చూడు పట్ట తగిన నేరములు)

10. నిండియుండిన బండిలో ఒక ప్రయాణికునకు లోపలికి పోవుటకు ఏ రైల్వే నౌకరుగాని నిర్బంధించి నట్లయినా.

11. ఏ మనుష్యుడైనా అనవసరముగ హెచ్చరిక చేయు త్రాడు జోలికి పోవునప్పుడును

12. నిండియుండని గదిలోనికి పోవునప్పుడు అడ్డగించు ఏ మనుష్యునిగాని

13. టిక్కెట్టు లేకుండా ప్రయాణముచేసే ఏ మనిషిని గాని (చూ. పట్టతగని నేరముల క్రమం)

పహారా డ్యూటీ.

స్టేషనులో నున్నప్పుడు :-

1. డ్యూటీకి యెక్కేముందు స్టేషనులో నుండు సామానులు, లాకపులోనుండే యెవరైనా ఖైదీలు సరిగా చూచుకుని పహారా పుస్తకములో సంతకము చేయవలెను.

2. నిన్ను బదలాయించువరకు పహారాస్థలమునుండి పోకూడదు.

3. శుభ్రముగానుండే యూనిఫారము ధరించి యుండ డవలెను.

4. నీ స్వాధీనములోనుండే బంధూకులు, చేతి సంకెళ్ళు మొదలైనవాటిని, స్టేషనున్ను శుభ్రముగా నుండు నట్లు చూడవలెను.

సబుజెయిలు ట్రెజరరి గార్డులో నున్నప్పుడు :-

1. పహారాలో ఎల్లప్పుడు హెచ్చరికగా నుండవలెను.

2. శుభ్రమైన మంచి యూనిఫారము వేసికొని యుండవలెను.

3. సోమరితనముగా కూర్చునియుండరాదు.

4. ఏ కారణమునగాని నీయొక్క ఆయుధములను విడిచి యుండరాదు.

5. తిరుగాపహారా బదిలీ అయ్యేవరకు పహారాలో నుండి రాకూడదు.

6. సాధ్యమైనంతవరకు ఖైదీలయొక్కయు సామానులయొక్కయు చూపుడు మేరదూరములోనే యుండవలెను.

7. డ్యూటీలో నున్నపుడు ఇతరులతో మాట్లాడుతూ ఉండకూడదు.

పగలు డ్యూటీలో నున్నప్పుడు :

8. ఎల్లప్పుడు బెయోనెట్టును ధరించి యుండవలెను.

సూర్యాస్తమైన తరువాత :

9. ఎల్లప్పుడును బెయోనెట్టు పెట్టిన బందూఖాను పట్టుకొని యుండవలెను.

నిలుచుని యున్నప్పుడు :

10. నీ బందూఖాను "ఆర్డరు"లోగాని "స్లోపు"లో గాని స్టాండ్ ఎట్ ఈజ్"లోగాని యుంచవలెను.

పహారాపైన తలాయించునప్పుడు :

11. సనీనుపెట్టి బందూఖాన్ స్లోపులో నుంచుకొనవలెను.

12. ఛాలెంజి చేయునప్పుడు

సూర్యాస్తమయమైన తరువాతను వచ్చువారిని జూచి అక్కడ వచ్చువారు నిలువవలెను. "Halt who comes there" అని బిగ్గరగా అనవలెను. అతడు "A Friend" - స్నేహితుడు అని చెప్పినయెడల

13. "Pass Friend. All is well" అని చెప్పి స్లోపులో నిలువవలెను. అతడు క్రొత్తవాడై అతనివల్ల యేదైనా ప్రమాదము కలుగునని న్యాయముగా తోచినప్పుడు

14. "చార్జి" లోనికివచ్చి "గార్డులు రన్ఔట్" అని కేక వేయవలెను. గార్డు ఆఫీసరు తరువాతను అతడు చేసే పనిని చూచుకొనును. సమీపించిన మనిషి విజిటింగు రౌండులకు గాను వచ్చినయెడల

15. "గార్డు టరన్ ఔటు" అని కేక వేస్తూ సమాపించిన పుద్యోగస్థునికి "అడ్వాన్సు ఫ్రెండ్ ఆల్ ఈజ్ వెల్" అని చెప్పవలెను. గార్డు ఆఫీసరు ఉత్తరువు మేరకు.

16. తక్కిన గార్డు జవానులతో పాటు ప్రెజెంట్ ఆరమును చెయ్యవలెను.

*Note :-* గార్డు టర్నౌట్ అని వినగానే గార్డు జవానులందరు తక్షణము హాజరై ఒక చోటున వరుసగా నిలబడి తమ బందూకులకు సనీలనుంచి, వీటిని స్లోపులో నుంచి నిలువబడవలెను.

( చూడు : సబుజైయిలు ట్రెజరిగార్డు )

## పోలీసు విధుల క్రోడీకరణము

పూర్వము మద్రాసు ప్రభుత్వమువారు ప్రకటించిన పుస్తకములో చెరసాల రక్షణ ఖైదీలను ఖజానాను తీసికొనిపోవుట (జైలుగార్డుడ్యూటీ. ఎస్కార్టు డ్యూటీ) మొదలగు విధులను గూర్చియు, సల్లనుంపు చట్టము, ఆబ్కారీ చట్టము, ఆయుధముల చట్టము, క్రిమినల్ ట్రయిబ్సు చట్టము, పశువుల బందెలదొడ్డి చట్టము, జంతువులపట్ల క్రూరహింసల నివారణ చట్టము మొదలగు శాసనములబట్టి ఏర్పడిన విధులను వివరింపబడినవిగాని మద్యపాన నిషేధము, అవసర సరకుల సరఫరా వినియోగములను గూర్చి సంఘ సంక్షేమమును గూర్చి చేయబడిన క్రొత్త శాసన విధులు వివరింపబడలేదు.

ఇటీవల ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు గ్రామపంచాయితీల చట్టము, జిల్లా పరిషత్తుల చట్టము మొదలగు అనేక శాసనములు చేసియున్నారు. స్వతంత్ర భారత కేంద్ర రాష్ట్రీయ ప్రభుత్వ శాసన విధులనుబట్టి పోలీసువారికి క్రొత్త బాధ్యతలేర్పడియున్నవి. మన ప్రభుత్వమువారు పోలీసువారి కేర్పడియున్న విధులనన్నిటిని క్రోడీకరించి ఒక సమగ్రగ్రంథమును ప్రకటించుటయెగాక ఆవిధులు ప్రజాప్రభుత్వ సంప్రదాయముల ననుసరించి సక్రమముగా అమలుజరుగునట్టి కట్టుబాటులు చేయుటకూడా అత్యంతావశ్యకము.



# గ్రామ మునసబుల పోలీసు విధులు

గ్రామాధికారి యగు గ్రామ మునసబునకుగల పోలీసు మేజస్ట్రేటు అధికారములు మద్రాసు ప్రభుత్వమువారు 1937 లో ప్రచురించిన గ్రామోద్యోగస్థుల యొక్కయు రైతులయొక్కయు మాన్యూల్ అను గ్రంథములోని 3వ అధ్యాయమునందు వివరింపబడియున్నవి.

పోలీసువారి తోడి సంబంధము

1816 వ సం.రపు 11వ రెగ్యులేషను ప్రకారము గ్రామాధికారికి. (మునసబుకు) అతని గ్రామములో ముఖ్యమైన పోలీసు అధికారములున్నవి. మరియు సాధారణమైన పోలీసువాండ్రు ఒక గ్రామములో పనిమీద నున్నప్పుడు గ్రామాధికారి యెడల గౌరవమును వినయమును చూపవలెను. అతని సలహా సహాయములు పొందవలెను. పోలీసు బంట్రోతులు పలుమారు గ్రామాధికారులను చూడవలసి యున్నట్లును, వారితో కలిసి మాట్లాడి వారి సలహా పొందవలసినట్లును బోధింపబడవలెను. పోలీసువారు ఒక గ్రామములో నేరమును ఆపుటయందును, కనుగొనుటయందును గ్రామాధికారియొక్క సంపూర్ణ సహాయ్యమును తోడ్పాటును పొందుట కర్హులై యున్నారు.

గ్రామాధికారి తన తలయారులతో పోలీసువారికి తన చేతనయినంత సహాయ్యమునంతయు చేయవలెను. గ్రామ హెడ్మను లేదా సామాన్యముగా మేజిస్ట్రీటు అని చెప్పబడు మనిషి గ్రామ పోలీసువిధులను నెరవేర్చుటకు బాధ్యుడుగా నుండును. ఈకార్యము నిమిత్తము గ్రామకావలి మనిషి లేదా తలయారి అతని యుత్తరువు క్రింద నుండును. వారికి పోలీసు డిపార్టుమెంటు వారిచే "గ్రామ పోలీసు" అను పేరుగల ఒక పట్టీయును ఒక లాఠీయును సరఫరాచేయబడును.

తలయారీలు గ్రామ మేజిస్ట్రీటుల వుత్తరువుల ననుసరించి వ్యవహరించవలెను. గ్రామములోను దాని హద్దులలో పలనుండు హెరోడ్లమీదను రహదార్లమీదను గస్తీ తిరుగవలెను. గ్రామమేజిస్ట్రీటు యొక్క రిజిష్టరులో నమోదుచేయబడిన నేరస్థుల రాకపోకలను, అనుమానాస్పదమైన క్రొత్త మనుష్యులు ఉండు సమాచారమును, రిపోర్టు చేయవలెను. మరియు సామాన్యముగా పోలీసువారి విధులను నెరవేర్చుటలో సహాయపడవలెను. వారు డిస్ట్రిక్టు మేజిస్ట్రీటు ఉత్తర్వులమీద వారు ఏ గ్రామమునకు చెందియుందురో దానితో నిమిత్తములేకుండా బహిరంగమైన రైల్వేలైనుమీద వారికి పబడిన భాగములలో గస్తీ తిరుగవలెను.

2. పోలీసు బంట్రోతు ఏ పనికిగాని గ్రామములోనికి వచ్చినప్పుడు గ్రామ మేజిస్ట్రీటుగాని అతడు లేనప్పుడు కరణముగాని లేక గ్రామములో గౌరవనీయుడైన యే యితర

పెద్దమనుష్యుడైనను బంట్రోతుయొక్క పహారా (బీటు) పుస్తకములో ఆ బంట్రోతు వచ్చిన ఘంటను వ్రాసిదానిలో చేవ్రాలు చేయవలసినది. అతనికి తెలియజేసిన ఏదైన సమాచారముయొక్క సారాంశమునుగూడా వ్రాయవచ్చును. సమాచారము విస్తారముగా నున్నప్పుడు దానిని ప్రత్యేకపు కాగితముమీద వ్రాసి పోలీసు బంట్రోతు చేతి కివ్వవలసినది.

3. అరెస్టు వారంట్లు సోదావారంట్లు జుల్మానాలను రాబట్టుకొనుటకయిన చరాస్తి జప్తును, విక్రయమును చేయుటకు గానయిన వారంట్లు, అమలు జరిపించు విషయములోను, పోలీసువారు ఏ నేరములో వారంటు లేకుండ అరెస్టు చేయవచ్చునో అట్టి నేరములు చేయు మనుష్యులను పట్టుకొను విషయములోను, పోలీసు బంట్రోతులు కోరు సాయమునంతయు నిచ్చుటకు (గ్రామ హెడ్డు) గ్రామాధికారియును గ్రామ తలయారులును బద్ధులు. ఒక గ్రామహెడ్డు రైల్వే సమ్మేకాలములోను మరియు యావత్తు రైల్వే సమ్మె పనులలోను, అశాంతిని నేరమును ఆపుటలోకూడా పోలీసువారికి సహాయ పడవలెను.

4. పోలీసు బంట్రోతులు తమ సామానులు మోయుట మొదలైన పనులకు తలయారీల నుపయోగించుకొనకుండ గ్రామాధికారి కనిపెట్టవలయును.

గ్రామ మేజిస్ట్రేట్లును తలయారీలును డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుయొక్కయు డివిజనలు మేజిస్ట్రేటుయొక్కయు పరిపాలనలో నుందురు.

## నేరములు జరగకుండ ఆపుట

1. గ్రామాధికారి తన గ్రామ సరిహద్దులో నేరములు జరగకుండ ఆపుటకు సర్వవిధముల ప్రయత్నించుట తన విధియని గ్రహించవలసినది.

2. దోపిడి దొంగల గుంపుల విషయమైగాని లేక తన గ్రామములోనయినను యే యితర గ్రామములోనయినను ప్రవేశించిన అనుమానాస్పదపు (గుమానీ) మనుష్యులను గురించిగాని తనకేదయిన సమాచారము తెలియవచ్చినయెడల దానిని గ్రామాధికారి పోలీసువారికి తెలియజేయుటయు దేశముయొక్క సామాన్య భద్రతకుగానుసర్వవిషయములలో తోడ్పడుటయు నతని విధి.

3. అనుమానాస్పదముగ కనబడు క్రొత్తవారు తన గ్రామములో ప్రవేశించిన యెడల వారి రాకయునుఅట్టివానిని గురించి తాను ప్రోగు చేయుటకు సాధ్యపడిన సమాచారమంతయును ప్రదేశ సబ్ మేజిస్ట్రేటుగారికిని పోలీసువారికిని రిపోర్టుచేయుట గ్రామాధికారిపని. ఈ కార్యమునకుగాను 17వ అనుబంధములో విధింపబడిన నమూనా ప్రకారము గ్రామాధికారి రిజిష్టరు నొకదాని నుంచవలెను. దానినిపోలీసు

మాజిస్ట్రేటు ఉద్యోగస్థులు తనిఖీచేయుట కాటంకముండ కూడదు.

4 నెమ్మదికి భంగము కలిగియుండుటకు కలుగవచ్చునని తోచినప్పుడు అట్టిది కలుగకుండ నాపుటకు తగు చర్య జరుపుటకు గాను మిక్కిలి సమీపమున నుండు పోలీసువారికి మాజిస్ట్రేటు గారికిని గ్రామాధికారి తక్షణమే సమాచారమును తెలుపవలెను.

5. గ్రామాధికారి తన గ్రామ సరిహద్దులలోపల వాసము చేయునట్టి ప్రసిద్ధికెక్కిన కొల్లగాండ్రనుగూర్చియు, ఎల్లప్పుడును నేరము చేయు మూకలలోని వారిని గూర్చియు, లేదా పోలీసువారికి తెలియపరచుకొనుచుండి వలసినట్లు క్రిమినల్ ప్రొసీజరు కోడ్డు 565 పరిచ్ఛేదము క్రింద నుత్తర్వు చేయబడినవారిని గూర్చియు, పోలీసువారు గ్రామాధికారిని కనిపెట్టి యుండవలసినట్లు కోరు ప్రసిద్ధికెక్కిన సందేహాస్పద మయినవారిని గూర్చియు, 18 వ అనుబంధములో నిర్ణయింపబడిన నమూనా ప్రకారము ఒక రిజిష్టరు నుంచవలసినది. రిజిష్టరులోని మొదటి ఏడు కలములలోని దాఖలాలు స్టేషన్ హౌస్ ఆఫీసరువల్లనైనను లేక అతని పై యుద్యోగస్థుని వల్లనైనను వ్రాయబడును. ఈ రిజిష్టరులో చేర్చబడిన వారెవ్వరైనను తన గ్రామములో హాజరు లేకపోయిన యెడల తక్షణమే ఆ విషయమును ఒక యాదాసు నమూనా

(దిగువనుండు 3 వ పరిచ్ఛేదము చూడుము) మూలముగా స్టేషన్ హౌస్ ఆఫీసరుకు రిపోర్టు చేయుట గ్రామాధికారి యొక్క కర్తవ్యము. అట్టి మనుష్యుడు తిరిగి వచ్చినప్పుడు వాని రాకనుగూర్చికూడా అటువంటి రిపోర్టును పంపించ వలసినది. గ్రామాధికారులచే నుంచబడు రిజిష్టరును మఱియు కినిట్టియితరమయిన పోలీసు రిజిష్టరు లన్నియును పోలీసువారి తనిఖీకి లోబడియుండును.

6. క్రిమినలు ప్రొసీజరు కోడ్డుయొక్క 45 వ పరిచ్ఛేద మును బట్టి ప్రతి గ్రామాధికారియును గ్రామ కరణమును, గ్రామ తలయారియు, గ్రామ పోలీసు ఉద్యోగియు, భూమి ఖామందు లేదా అనుభవదారుడును, ఆ భూమియొక్క నిర్వాహణమును తన హవాలాలోగల అట్టి యే ఖామందు లేదా అనుభవదారుని ఏజంటును మరియు గవర్నమెంటు వారిచే లేక కోర్టు ఆఫ్ వార్డ్సు వారిచే భూమిశిస్తు లేక పన్నును వసూలుచేయుటకు నియమింపబడిన ప్రతి యుద్యోగస్థుడును

i (a) తాను యే గ్రామమునకు అధికారియో, కరణమో, తలారియో లేక పోలీసు ఉద్యోగియో లేక ఏ గ్రామములో తనకు స్వంతభూమి యున్నదో లేదా భూమిని అనుభవించుచున్నాడో లేదా ఏజంటుగా నున్నాడో లేదా సర్కారు శిస్తుగాని నేలపన్నుగాని వసూలుచేయునో అట్టి గ్రామములో ప్రసిద్ధికెక్కిన దొంగ సొమ్ము కొను లేక

విక్రయించు వానియొక్క స్థిరమైన లేక తాత్కాలికమైన నివాసమును గురించియు

(b) అట్టి గ్రామములోని ఏ ప్రదేశమున కయినను "తగ్" అను దొంగయని గాని దోపిడికాడనిగాని, పరారీ ఖైదీయని గాని లేక ఇస్తిహారు నేరస్థుడనిగాని తానెఱిగినట్టి, లేక సకారణముగా అనుమానించునట్టి ఏ మనుష్యుడైనను వచ్చినను ఆ గ్రామముగుండా పోయినను, అట్టి సంగతిని గుఱించియు

(c) అట్టి గ్రామములో నయినను లేక దానికి దగ్గరనయినను, జామీనుమీన వదలకూడని నేరమును దేనినయినను లేదా పీనల్ కోడు (శిక్షాస్మృతి) యొక్క ఈ క్రింది పరిచ్ఛేదముల ప్రకారము శిక్షింపదగిన నేరమును దేనినయినను చేసినయెడల లేదా చేయుటకు ఉద్దేశించినయెడలను దానిని గురించియు

143. న్యాయశాస్త్ర విరోధమయిన మూకలో కలిసియుండుట

144. మరణకరమైన యెట్టి ఆయుధమునైన ధరించుకొని న్యాయశాస్త్ర విరోధమయిన మూకలో కలియుట

145. చెదరిపోవులాగున నాజ్ఞాపింపబడి యున్నదని యెఱిగియుండిన్ని న్యాయశాస్త్ర విరోధమయిన మూకలో కలియుట లేక అందులో నిలిచియుండుట

147. దొమ్మి చేయుట మరిన్ని

148. మరణకరమయిన ఆయుధములను ధరించుకొని దొమ్మి చేయుట

వరా :- 1821 వ సం॥పు 4 వ రెగ్యులేషనుయొక్క 6 వ సెక్షను ననుసరించి గ్రామ హెడ్డు తానే విచారించుటకు తీసికొను స్వల్పపు దొంగతనపు కేసులు, అవి పరిష్కరింప బడు నంతవరకు సబుమాజస్ట్రేటుకును పోలీసువారికిని రిపోర్టు చేయబడనవసరము లేదు. 6 వ సెక్షనుక్రింద 5 వ పేరాగ్రాఫున చూడుము.

డి) తన గ్రామములోనయినను లేక దాని సమీపములోనయినను సంభవించిన ఆకస్మికమయిన లేక స్వభావ విరుద్ధమయిన యేదయిన మరణమును గురించియు లేక సందేహాస్పదమయిన సందర్భములలో తటస్థించిన ఏదైన మరణమును గురించియు, లేదా అట్టి మరణము సంభవించినదను న్యాయమైన అనుమానమునకు ఆస్పదము అగు సందర్భములలో అట్టి గ్రామములోగాని దాని సమీపములోగాని ఏదైన శవము లేదా శవభాగము కనబడుటను గుఱించియు లేదా ఆ గ్రామములోనుండి యే మనిషియైనను అట్టి మనిషి విషయమున జామీనుమీద వదలకూడని నేరము జరుపబడినదను న్యాయమైన అనుమానమునకు ఆస్పదములగు సందర్భములలో గైరుహాజరగుటను గుఱించియు

ఇ) (బ్రిటిషు) ఇండియాలో♦ (ఇప్పుడుభారత యూని యన్ రాజ్యమున) చేసినయెడల ఇండియా దేశపు పీనలుకోడ్డు తాలూకు యీ క్రింది పరిచ్ఛేదములలో దేనిప్రకారమైనను శిక్షింపదగ్గ నేరమయ్యే బాబతు యేపనినిగాని అట్టి గ్రామము దగ్గర బ్రిటిషు ఇండియాకు వెలుపల నెచ్చటనయినను లేని యెడల, లేదా చేయుటకుద్దేశించినయెడల దానిని గురించియు

అవి యేవనగా :-

231. తప్పుడు నాణ్యములను చేయుట.

232. రాజుగారి ♦ నాణ్యమునకు బదులుగా తప్పుడు నాణ్యమును చేయుట.

233. తప్పుడు నాణ్యమునుచేయు కార్యము నిమిత్తము పనిముట్లను చేయుట లేదా విక్రయించుట.

234. రాజుగారి నాణ్యమునకు బదులుగా తప్పుడు నాణ్యమును చేయునిమిత్తము పనిముట్లను చేయుట లేదా విక్రయించుట.

---

♦ బ్రిటిష్ ఇండియా అనుమాట భారత యూనియన్ రాజ్యము అని సవరించి చదువవలెను.

♦ 'రాజు' అనుమాట 'భారత యూనియన్ ప్రభుత్వమువారి' అని సవరించి చదువవలెను.

235. తప్పుడు నాణ్యము చేయునిమిత్త ముపయో గించుటకు పనిముట్టును లేదా పదార్థమును కలిగియుండుట.

236. (బ్రిటిషు) ఇండియా వెలుపల తప్పుడు నాణ్యములను చేయుటయందు (బ్రిటిషు) ఇండియాలో కుమ్మకు చేయుట.

237. తప్పుడు నాణ్యములను దిగుమతి చేయుట లేదా ఎగుమతి చేయుట

238. రాణీ-రాజుగారి నాణ్యములకుబదులుగా తప్పుడు నాణ్యములను దిగుమతిచేయుట లేదా ఎగుమతిచేయుట.

302. ఖూనీ.

304. ఖూనీకాకుండా వుండే నేరముగల నరహత్య.

382. చోరీ జరిగించుటకుగాను మరణము, ఘాత లేదా నిర్బంధము ఈ నేరములు చేయుటకు సిద్ధపడి చేసినచోరీ.

392. దోపిడి.

393. దోపిడి జరిగించవలెనని ప్రయత్నము.

394. దోపిడి జరిగించుటలో స్వేచ్ఛగా ఘాతి కలుగ జేయుట.

395. బందిపోటు.

396. ఖూనీ సహితమైన బందిపోటు.

397. మరణము లేక బలమైన ఘాత కలిగించవలెననే యత్నముతోడి దోపిడి లేక బందిపోటు.

398. మరణకరమైన ఆయుధమును ధరించుకొని వుండి దోపిడిలేక బందిపోటును జరిగించుటకు యత్నము.

399. బందిపోటు జరిగించుటకు సన్నాహము చేయుట.

402. బందిపోటు చేయుటకు ప్రోగు కావడము.

435. మొత్తమునకు నూరురూపాయలు లేక వ్యవసాయపు పంట విషయములో పదిరూపాయల నష్టము కలుగజేయవలెనను ఉద్దేశముతో అగ్నితోగాని, ప్రేలెడి (వస్తువు) పదార్థముతోగాని చేయు చెఱుపు.

436. ఇల్లు వగైరాలు నాశనము చేయవలెనను ఉద్దేశ్యముతో అగ్నితోగాని, ప్రేలెడు (వస్తువు) పదార్థముతోగాని కలుగచేయు చెఱుపు.

449. మరణమువల్ల శిక్షింపబడతగిన నేరమును చేయగలందులకయి ఇంటిలోనికి అక్రమ ప్రవేశము.

450. యావజ్జీవ ద్వీపాంతరవాసమువల్ల శిక్షింపబడతగిన నేరమును చేయగలందులకయి ఇంటిలోనికి అక్రమ ప్రవేశము.

457. ఖైదువల్ల శిక్షింపబడదగిన నేరమును చేయగలందులకయి రాత్రివేళ రహస్యముగా ఇంటిలోనికి అక్రమముగా ప్రవేశించుట లేక తలుపు వగయిరాలు బ్రద్దలుకొట్టి యింటిలో జొరబడుట.

458. ఘాతకుడొమిక్కి లేక అక్రమ నిర్బంధమునకు సన్నాహముచేసి రాత్రివేళ రహస్యముగా ఇంటిలో అక్రమముగా ప్రవేశించుట లేక తలుపు వగైరాలు బ్రద్దలుకొట్టి యింటిలో చొరబడుట.

459. రహస్యముగా ఇంటిలోనికి అక్రమముగా ప్రవేశించునప్పుడు లేక తలుపు వగైరాలు బ్రద్దలుకొట్టి యింటిలో ప్రవేశించునప్పుడు చేయు బలమైన ఘాత.

460. రాత్రివేళ తలుపులు వగైరాలు బ్రద్దలుగొట్టి యింటిలో ప్రవేశించుట మొదలయిన నేరములలో సమిష్టిగా పరీఖు అయియుండే అనేక మనుష్యులలో ఒకడు జరిగించిన మరణము లేక బలమయిన ఘాత.

489. (ఎ) తప్పుడు కరెన్సీనోట్లను లేదా బ్యాంకు నోట్లను సృష్టిచేయుట.

489. (బి) సృష్టిచేయబడిన లేదా తప్పుడు కరెన్సీ నోట్లను లేదా బ్యాంకునోట్లను నిజమయిన వాటివలె ఉపయోగించుట.

489. (సి) సృష్టిచేయబడిన లేదా తప్పుడు కరెన్సీ నోట్లను లేదా బ్యాంకు నోట్లను కలిగియుండుట.

489. (డి) కరెన్సీనోట్లను లేదా బ్యాంకునోట్లను సృష్టించుటకు లేదా వాటికి బదులుగా తప్పుడువాటిని చేయుటకు పనిముట్లను లేదా పదార్థములనుచేయుట లేదా కలిగియుండుట.

లోకల్ గవర్నమెంటువారి యనుమతిని ముందుగా పొంది జిల్లా మాజస్ట్రేటు సాధారణమయిన లేక విశేషమయిన హుకుముద్వారా యెట్టివిషయములో సమాచారము తెలియ చేయవలసినట్లు అతనికి ఉత్తర్వు చేసియుండునో అట్టిదైన క్రమతగుటుక్కు రక్షణ లేక నేరముల నాపుటకు లేక ప్రాణము యొక్క ఆస్తియొక్కగాని సంరక్షణకు, బహుళిక భంగము కలుగజేయు విషయములను గురించియు.

తనకు తెలిసియుండగల సమాచారమును అతి సమీపమున నుండు మాజస్ట్రేటుకు గాని లేక అత్యంత సమీపమున నుండు ఒక పోలీసు స్టేషనును తన పహావాలాలోగల ఉద్యోగస్థునికి గాని ఎవరు మిక్కిలి దగ్గరనుందురో వారికి తక్షణమే తెలియజేయుట విధియైయున్నది.

2. ఈ పేరాగ్రాఫులో "గ్రామ" మను మాటలో గ్రామ భూములు చేరును.

(ii) ఇస్తిహార్ నేరస్థుడు అను మాటలో (బ్రిటిషు ఇండియాలో చేసినయెడల ఇండియాదేశపు పీనలు కోడు యొక్క ఈ క్రింది పరిచ్ఛేదములలో వేనిప్రకారమైనను శిక్షింపదగ్గ నేరమయ్యే బాపతు ఏ పనివిషయములో గాని, ఇండియాలో నే భాగము నందయినను * (ఆలోచన సభతో కూడిన గవర్నరు జనరలుగారిచే స్థాపింపబడిన లేదా సాగింప

* "స్వతంత్ర భారత ప్రభుత్వమువారి" అనిసవరించుకొనవలెను.

బడిన ఏ కోర్టుచేనైనను, లేదా అధికారిచే నయినను నేరస్థుడుగా ప్రకటింపబడిన ఏ మనుష్యుడుగాని చేసునా. ఆ పరిచ్ఛేదము లేవనగా - 302, 304, 382, 392, 393, 394, 395, 396, 397, 398, 399, 402, 435, 436, 449, 450, 457, 458, 459, 460.

7. వెనుకటి పేరాగ్రాఫుయొక్క ప్రారంభమున పేర్కొనబడిన ఒక హెడ్మను లేక గ్రామాధికారి, గ్రామ కరణము, గ్రామ తలయారు లేదా ఇతర మనిషి, గత పేరాగ్రాఫులో నిర్దిష్టము చేయబడిన విషయములనుగూర్చి తనకు తెలిసియుండగల యెట్టి సమాచారమునయినను అతి సమీపములోనుండు మాజస్ట్రేటు లేదా అతిసమీపములోనుండు పోలీసు స్టేషనుకును తన హవాలాలోగల ఆఫీసరులకు వీరిలో ఎవరు ఎక్కువ సమీపముననుండురో వారికి వెంటనే తెలియచేయుటకు బుద్ధిపూర్వకముగా తప్పిపోవు నెడల ఇండియను పీనల్ కోడ్డుయొక్క 176 వ పరిచ్ఛేదము ననుసరించి నేరస్థాపన చేయుబడినమీదట అతను ఒక నెలవరకు వ్యాపించగల కాలమువరకు విడికైదుతో లేదా రు 500 ల వరకు వ్యాపించగల జరిమానాతో లేదా రెండింటితోను లేదా సదరు సమాచారము ఒక నేరము జరిగియుండుటనుగూర్చినదైన యెడల లేదా ఒక నేరము జరుగకుండ చేయుటకు సదరు సమాచారము కావలసియుండిన యెడల లేదా

ఒక నేరస్థుని పట్టుకొనుటకు కావలసియుండిన యెడల, ఆరు నెలలవరకు వ్యాపించగల విడి ఖైదుతోను లేదా రు 1000ల వరకు వ్యాపించగల జరిమానాతోనులేదా ఈ రెండింటితోను శిక్షింపబడతగి యుండును. గతపేరగ్రాపుయొక్క (e క్లాజు లో చెప్పబడినట్లు ఒక నేరము చేయబడినట్లు లేదా ఇండియాలో చేయుబడినప్పుడు ఇండియన్ పీనలుకోడ్డుయొక్క ఈక్రింది పరిచ్ఛేదములలో ననగా 302, 304, 382, 393 మొదలు 399 వరకును 402, 435, 436, 449, 450, 457 మొదలు 460 వరకునుగల ఏపరిచ్ఛేదముననుసరించియైన శిక్షింపబడతగిన ఒక నేరమువంటి పని (కార్యము) సదరుగ్రామమునకు దగ్గరగా బ్రిటిషు ఇండియాకు వెలుపల నేచోటనైనను చేయుబడినట్లు తనకు తెలిసినయెడల లేదా తాను నమ్ముటకు కారణ మున్నయెడల, మరిన్ని పైన చెప్పబడిన ఆరవ పేరాగ్రాఫులో కోరబడినట్లు సదరు సమాచారమును తెలియచేయుటకు బుద్ధిపూర్వకముగా అతను తప్పిపోవునెడల ఇండియన్ పీనలు కోడ్డుయొక్క 202 వ పరిచ్ఛేదముననుసరించి నేరస్థాపన చేయుబడిన మీదట ఆరు నెలల వఱకు వ్యాపించగల కాలపరిమితి వఱకు రెండు తరహాలలో నే తరహా ఖైదుతోనైనను లేదా జరిమాతోను లేదా రెండింటితోను అతను శిక్షింపబడతగియుండును.

8. పై ఆరవ పరిచ్ఛేదముక్రింది 5 వ పేరాగ్రాఫులో చెప్పబడిన చిన్నచోరీలు గావట్టిన్ని తన గ్రామము సరిహద్దుల లోపల చేయబడినట్టిన్ని పట్టుకొనతగ్గ యావత్తు నేరములను గురించి మిక్కిలి సమీపమునందుండు మాజస్ట్రేటుకుగాని మిక్కిలి సమీపమునందుండు పోలీసుస్టేషను పైని హవాలా గల ఆఫీసరుకుగాని రిపోర్టు చేయుటకూడ ప్రతి గ్రామాధికారి యొక్క విధియై యున్నది. అట్లు రిపోర్టుచేయక తప్పినయెడల అతడు డిపార్టుమెంటలు శిక్షకు పాత్రుడగును.

9. గ్రామ తలయారులు సాధారణముగా 7 వ పేరా గ్రాఫులో చెప్పబడిన స్వభావము కలిగినట్టిగాని లేదా వేరే విచారింపతగ్గ నేరములకు సంబంధించినట్టిగాని ఏ సమాచారమునైనను ముందుగా గ్రామాధికారికి తెలుపవలెను. తమ గ్రామాధికారుల ఉత్తరువుల ననుసరించి వర్తించుటకును గ్రామములోను దానియొక్క హద్దుల లోపలనుండు ముఖ్య వీధులలోను, రహదారులలోను గస్తితిరుగుటకును, గ్రామాధికారియొక్క రిజష్టరులో నమోదుచేయబడిన నేరగాండ్ర యొక్క రాకపోకలను గూర్చియు, అనుమానాస్పదులగు క్రొత్తవారు వచ్చియుండుటను గూర్చియు, రిపోర్టుచేయుటకును పోలీసువారు వారిపనులను చేయుటలో వారికి సామాన్యముగా సహాయము చేయుటకును, వారు (తలయారులు) కోరబడుచున్నారు.

10. ఏ మనుష్యునిమీది కయినను ఆస్తిమీదికయినను దోపిడిగాండ్రు వచ్చినయెడల తలయార్లును, తమ

స్వప్రయత్నమువలనను, తాము ముందుచేసి చూపుటవలనను, గ్రామస్థులను ప్రోత్సాహపరచి అందరు కలిసి దోపిడి గాండ్రను బలముతో నెదుర్కొనునట్లు చేయవలయునే గాని వారిని చూచి పారిపోకూడదు. వారికి లోబడకూడదు. తమ యాత్మసంరక్షణయొక్క హక్కును చెలాయించుటలో చేయునదేమియు నేరము కాదనియు, తాము సాధ్యమైనంత వఱకు నిరోధచర్యలన్నియు గావింపవచ్చుననియు, తుపాకులను లేక ఇతరమయిన ఆత్మసంరక్షణ ఆయుధములను ఉపయోగించుకొనవచ్చుననియు కాని నేరస్థులను పట్టుకొనుటకే ప్రథమమున ప్రయత్న పడవలెననియు గ్రామస్థులకు తెలియునట్లు బోధింపవలెను.

11. గ్రామాధికారికి :-

1. జనసామాన్యముచే నుపయోగింపబడు లేదా ఉపయోగింపబడగల యే త్రోవనుండిగాని, నది, లేక కాలువనుండిగాని లేదా యే బహిరంగ స్థలమునుండిగాని ఏ న్యాయ విరుద్ధమయిన ఆటంకమైనను లేదా ఉపద్రవమైనను తీసివేయవలసినట్లు తోచినపుడును

2. ఏ వ్యాపారముగాని వృత్తిగాని ఏ సరుకునైనను లేక వ్యాపార వస్తువునైనను ఉంచుకోవడముగాని అది ప్రజలయొక్క ఆరోగ్యమునకుగాని దేహ సౌఖ్యమునకుగాని భంగము కలుగచేయునను కారణమునుబట్టి ఆపివేయబడవలసినట్లు లేక నిషేధింపబడవలసినట్లు తోచినపుడును

3. ఏ కట్టడమునైన కట్టుటవల్లగాని, ఏ వస్తువునైనా పరిష్కరించుటవల్లగాని బహుశః అగ్నిభయమో, ప్రేలుడో పుట్టవచ్చునని కారణముచేత దానిని ఆపి వేయవలెనని లేదా నిలిపివేయవలెనని తోచినప్పుడును

4. ఏ కట్టడమయినను కూలిపోయి సామీప్యవాసము చేయునట్టి లేక వ్యాపారము చేయునట్టి లేక ప్రక్కను నడిచి పోవునట్టివారికి బహుశః హానికలుగజేయునట్టి స్థితిలో నున్నందున దానిని తీసివేయుట లేక రిపేరు (మరమ్మతు) చేయుట లేక దానికి పోటీయిచ్చుట ఆవశ్యకమని తోచి నప్పుడును

5 అట్టి ఏ త్రోవకయినను బహిరంగస్థలమునకయినను చేరియుండు ఏ చెరువుగాని బావిగాని గొయ్యిగాని జనసామా న్యమునకు హానికలుగకుండునటుల కంచె వేసి యుంచవలెనని తోచినపుడును

అతడా విషయమును జనసామాన్యమునకు ఉపద్రవకర మైన సంగతిగా ప్రదేశ సబుమాజస్ట్రేటునకు రిపోర్టుచేయ వలెను. అంతట ఆయన ఆవశ్యకమైన చర్య జరిగించును.

నేరములను కనుగొనుట చర్య జరిగించుట :-

1. నేరస్థులను పట్టుకొనుటకు అన్ని విషయముల లోను తోడ్పడుట గ్రామాధికారియొక్క విధి.

2. చోరీసొత్తు దాచబడినట్లు నమ్మకమైన సమాచారము గ్రామాధికారికి తెలియవచ్చినప్పుడు, అట్టి సొత్తును భద్రపరచుటకు తక్షణమే ఉచితచర్యలు జరిగించనియెడల అది అపహరింపబడునని యెంచుటకు కారణమున్నయెడల, గ్రామాధికారి పరిశోధన చేయించి ఆస్తి కనుగొనబడినయెడల నేరస్థునితోకూడ దానిని పోలీసుస్టేషనుకు పంపవలెను. ఆస్తి దాచియుంచిన తావు కాపురముచేయు ఇల్లు అయినయెడల పరిశోధన సూర్యోదయమునకును సూర్యాస్తమయమునకును మధ్యమాత్రమే జరపవలెను.

3. పోలీసువారు చేయు అన్ని పరిశోధనలయందును గ్రామాధికారి హాజరయి వుండవలెను.

4. పశువులు చోరీకాబడినపుడు గ్రామాధికారి పోలీసువారికిని మాజస్ట్రేటునకును రిపోర్టు పంపుటతోనే తృప్తిచెందియుండక తక్షణమె తన తలయారులతో దొంగిలింపబడిన పశువుల జాడను కనిపెట్టవలసినది. ఈవిధిని చక్కగా గమనించినయెడల చోరీకాబడిన పశువులు దాదాపు ఎల్లప్పుడును తప్పక చిక్కును.

5. ఎకరారును (నేరము జరిగించితినని చెప్పు ఒప్పుదల) లేదా సమాచారమును సంపాదించుటకు పోలీసువారు జరిపించునట్టి దౌర్జన్యమునుగాని హింసనుగాని గ్రామాధికారి యుపేక్షింపకూడదు. పోలీసువారు అట్టి యాక్షేపకరమయిన పనులు చేయుటకు పూనుకొనినప్పుడు ఆ విషయమై మిక్కిలి

సమీపమునందుండు సబ్ మేజస్ట్రేటునకు రిపోర్టుచేయుట గ్రామాధికారి విధి.

6. పోలీసువారి విచారణ ప్రారంభమయిన తరువాత నేరము మోపబడిన మనిషిచేయు ఎట్టి ఎకరారునైనను లేదా స్టేటుమెంటునైన వ్రాతలోనికి మార్చకూడదని గ్రామాధికారి పూర్తిగా నిషేధింపబడుచున్నాడు.

ఆకస్మికమైన - విపరీతమైన మరణములు:-

గ్రామ సరిహద్దులలో ఆకస్మికమైన లేక విపరీతమైన మరణ మేదయిన జరిగినదని గాని లేక అనుమాన పడదగిన సందర్భములలో నెవరైన చనిపోయినట్లుగాని తనకు తెలియ వచ్చు ఏ సమాచారము నయినను మిక్కిలి దగ్గర మేజస్ట్రేటు కయినను లేక మిక్కిలి దగ్గర పోలీసుస్టేషనుపైన హావాలాగల ఆఫీసరు కయినను వీరిలో ఎవరు మిక్కిలి దగ్గరగానుందురో వారికి తెలియచేయుట ప్రతి గ్రామాధికారికిని, కరణమునకును కావలివారికిని విధియైయున్నది.

2. ఒక మనిషి ఆత్మహత్య చేసికొన్నాడని లేదా ఇంకొకనివలన లేదా ఒక మృగమువలన, యంత్రమువలన లేదా ప్రమాదమువలన చంపబడినాడని లేదా ఇంకొక మనిషి నేరము చేసినాడని న్యాయమైన అనుమానము కలుగునట్టి పరిస్థితులలో చనిపోయినాడని పోలీసు ఆఫీసరులకు వారులేని సందర్భములో గ్రామాధికారులకు సమాచారము తెలియవచ్చిన సందర్భములలో చనిపోవుటకైన

పైకి కనబడు కారణములనుగూర్చి వారు 1816 వ సం॥ 51 వ రిగ్యులేషను 13 వ సెక్షను ననుసరించియు క్రిమినలు ప్రొసీజరు కోడుయొక్క 174వ సెక్షను 4వ సబుసెక్షను ననుస రించి, ఒక విచారణ జరుపుటకు కోరబడుచున్నారు.

3. ఆత్మహత్యవలన లేదా ప్రమాదమువలన కలిగిన చావునుగూర్చి లేదా ఒక మనిషివలన మృగమువలన యంత్రమువలన కలిగిన ఒక చావునుగూర్చి లేదా ఇంకొక మనిషి నేరముచేసినాడని న్యాయమైన అనుమానము కలుగ జేయు సందర్భములలో కలిగిన చావునుగూర్చి ఒక గ్రామాధి కారికి వర్తమానము తెలిసిన వెంటనే అతను

(ఎ) మరణములనుగూర్చి విచారణ జరుపుట కధికార మివ్వబడిన అత్యంత సమీపముననున్న మేజస్ట్రీటుకును, అత్యంత సమీపముననున్న పోలీసుస్టేషనుకు తన హవాలాలో గల ఆఫీసరుకును తనకు ఇవ్వబడిన సమాచారమును వెంటనే తెలుపవలెను.

(బి) సదరు శవమును పరీక్షించుటకు వెళ్లి ఒక పోలీసు ఆఫీసరు లేదా మేజస్ట్రీటు వచ్చువఱకును అతడు వేచియుండ వలెను. శవము కనుగొనబడిన తరువాత న్యాయమైనంత కాలములో సదరు స్థలమునకు ఒక పోలీసు ఆఫీసరుగాని మేజ స్ట్రీటుగాని రానియెడల గ్రామాధికారి సదరు శవము గుర్తింప బడనప్పుడు తప్ప చావుయొక్క కారణమునుగూర్చి ఏదైన

అనుమానమున్నయెడల లేదా అట్లుచేయుట యుక్తమని తాను తలచగల యితర కారణమునుబట్టియైన శవపరీక్ష నిమిత్తము అత్యంత సమీపమునగల ఆసుపత్రికి సదరు శవమును పంపవలెను.

శవముతో సహా XX వ అనుబంధములో నిర్ణయింపబడిన నమూనాలో శవపరీక్ష నిమిత్తము ఒక రిపోర్టు పంపవలెను. ఇట్లు చేయబడిన వెంటనే గ్రామాధికారి కరణము యొక్కయు, చుట్టుప్రక్కల నివసించు ఇద్దరు లేదా అంతకు మించినంతమంది పెద్దమనుష్యుల యొక్కయు సమక్షమున విచారణ జరిపి XXI వ అనుబంధములో నిర్ణయింపబడిన నమూనాలో ఒక రిపోర్టు తయారుచేయవలెను.

సదరు శవము గుర్తింపబడనప్పుడు సదరు శవమును కనుగొనబడిన తరువాత త్వరితముగా ఒక పోలీసు ఆఫీసరుగాని మేజస్ట్రేటుగాని రానియెడల గ్రామాధికారి విచారణ చేయుటకు ప్రారంభించి శవపరీక్ష నిమిత్తము సదరు శవమును పంపించుటకు ముందు ఇంతకుముందే చెప్పబడిన రిపోర్టును తయారు చేయవలెను.

4. ఒక పోలీసు ఆఫీసరు లేదా మేజస్ట్రేటు వచ్చుటకు పూర్వము గ్రామాధికారివలన విచారణ చేయబడిన సందర్భ

ములో అతడు, తన విచారణాధికార ప్రదేశములో ఖూనీ చేసియుండునని ఏ మనిషినైన లేదా మనుష్యులనైన అనుమానించుటకు కారణమున్న యెడల వెంటనే అట్టి మనిషిని లేదా మనుష్యులను పట్టుకొని అతనిని లేదా వారిని స్టేషను హౌసు ఆఫీసరువద్దకు లేదా మేజస్ట్రేటువద్దకు పంపవలెను.

5. ఆసుపత్రికి పంపబడిన శవములను మోసుకొని పోవుటకు సాధనమును, పైనగల మూడవ పేరాగ్రాఫులో నిర్ణయింపబడిన యేర్పాటు చేయుట గ్రామాధికారియొక్క విధి. అట్లు పంపబడనవసరము లేనట్టియు, ఇతరులచే కోరబడనట్టియు, శవములయొక్క ఖననము నిమిత్తముకూడా అతడు ఏర్పాటు చేయవలెను.

ఈ సందర్భములో కలిగిన యెట్టి ఖర్చునైన మేజస్ట్రేటుకు ఒక బిల్లు పంపబడుట మూలముగా తిరిగి రాబట్టుకొనబడవచ్చును.

6. ఒక మేజస్ట్రేటు లేదా పోలీసు ఆఫీసరు లేనప్పుడు గ్రామాధికారి దౌర్జన్యమువలనగాని ప్రమాదమువలనగాని, గట్టి గాయములు తగిలి చనిపోవ సిద్ధముగానున్న యెట్టి మనిషినైనను సదరు గాయములు పొందిన మనిషియొక్క స్టేటుమెంటులో ప్రతిమాటను రికార్డు లిఖితమూలముచేసి సాధ్య

మైనయెడల అతని లేదా ఆమెయొక్క సంతకమును పుచ్చుకొనవలెను. ఈ స్టేటుమెంటును రికార్డుచేసిన వెంటనే గ్రామాధికారి గాయములు తగిలిన మనిషిని చికిత్సనిమిత్తము అత్యంత సమీపమునగల ఆస్పత్రికి పంపవలెను. ఇట్టి సందర్భములలో గాయములను నివారించుటకు వెంటనే పూనుకొనుట ముఖ్య విషయములలో మొదటిది. గాయములు తగిలిన మనిషిని పోలీసుస్టేషనుకు పంపుట మూలముగా చికిత్స విషయమున కాలయాపన చేయబడకూడదు.

స్వల్ప క్రిమినలు వ్యవహారముల విచారణ :-

1816వ సం॥ 11 వ రెగ్యులేషనుయొక్క 10వ సెక్షనునుబట్టి

తిట్లు, స్వల్పదౌర్జన్యములు లేక కలహములు ఇట్టి స్వల్పతర స్వభావముగల కేసులలో గ్రామాధికారులు నోటి మాట మూలముగా విచారణ చేసినమీదట పార్టీలను (కక్షిదారులను) పంపివేయుటకుగాని ఆ నేరము మోపబడిన మనుష్యులు నేరము చేసినట్లు నిరూపింపబడి వారు శిక్షార్హులైనట్లు తోచిన పక్షమున వారిని 12 గంటలకు మించని కాలమువరకు గ్రామచావడిలో కావలిలో ఉంచుటకు వారు అధికారము కలిగియున్నారు. విచారణచేసి శిక్షార్హములైన కేసులను గూర్చి తాలూకా మేజిస్ట్రేటుకు రిపోర్టు చేయవలెను.

1821 సం॥ 4వ రెగ్యులేషనుయొక్క 6 వ సెక్షనును బట్టి

నేరమును బలపరచు స్థితిగతులు కలిగియుండనట్టియు దుర్మార్గులని ప్రసిద్ధిచెందిన మనుష్యులచే చేయబడినట్టియు స్వల్ప చోరీలను చోరీ ఆస్తి విలువ ఒక రూపాయికి మించనప్పుడు విచారించి శిక్షింపవచ్చును. దీనినిగూర్చికూడా తాలూకా మేజస్ట్రీటుకు రిపోర్టు చేయవలెను.

చోరీసొత్తు విలువ ఒక రూపాయికి మించనప్పుడు గొర్రెలు, కలప, అడవియుత్పత్తి, పోరంబోకు భూములలో చెట్లు వీనికి సంబంధించిన స్వల్ప చోరీకేసులను విచారించుటకు అర్హుడు.

చట్టప్రకారము వారంటు లేనిదే అరెస్టు చేయుటకు వీలులేని కేసులలో నేరము మోపబడినవానిని పట్టుకొనకూడదు. లేనియెడల అక్రమముగ నిర్బంధమున నుంచినందుల కతడు ప్రాసిక్యూటు చేయబడుటకు పాత్రుడగును.

నేరస్థులకు బేడీలు (చేతి సంకెళ్ళు) వేయుటకుగాని జుల్మానా శిక్ష విధించుటకుగాని గ్రామాధికారికి అర్హతలేదు.

గ్రామాధికారిచే నేరస్థాపన చేయబడినవారిని పోలీసు లాకపునకు పంపగూడదు. గ్రామచావడిలోనే ఖైదుచేయవలెను. చెట్టుక్రింద నిలిపియుంచరాదు.

గ్రామాధికారి హుకుములను జారీచేసి విచారణలో అతనికి పరిచర్యచేసి గ్రామ చావడిలో ఖైదుచేయబడినవానికి కాపలాయుండుట తలారుల విధి.

గ్రామచావడి ఖైదునుండి తప్పించుకుని పోయినవారు ఇండియన్ పీనల్ కోడ్డు 224 సెక్షనుక్రింద శిక్షార్హులగుదురు. గ్రామాధికారి విచారించిన కేసుల స్టేటుమెంట్లు రిజష్టరు నకలు మేజస్ట్రీటుకు స్టేషన్‌హౌస్ ఆఫీసరుకు పంపవలెను.

పిచ్చివాండ్రు:-

పిచ్చివాండ్రును తమ్ము తామే కాపాడుకొను శక్తి లేకుండను, బంధువులచేతను స్నేహితులచేతను ఉపేక్షింపబడి దేశమంతట తిరుగుచుండునపుడును లేదా వారు అపాయము చేయువారుగా నుండునపుడును పోలీసువారికిని ఎవరి విచారణాధికారములో ఆ గ్రామమున్నదో ఆ మేజస్ట్రీటునకును ఆ విషయమునుగూర్చి తక్షణమే ఒక రిపోర్టుపంపుట గ్రామాధికారి విధి. అట్టి పిచ్చివారిని పోలీసువారు వశపఱచుకొను వఱకును గ్రామాధికారి జాగ్రత్తగా భద్రపరచియుంచవలెను.

దరిద్రులైన రోగులు - దిక్కులేని బిడ్డలు :-

1. అసహాయస్థితిలోనుండు దరిద్రులైన బాటసారులను దారితప్పినట్టియు, తల్లిదండ్రులు లేనట్టియు, దిక్కుమాలిన బిడ్డలను కాపాడుట గ్రామాధికారి విధి.

2. సంరక్షించుటకు శక్తికలిగి అట్లు చేయుటకు బాధ్యులైన బంధువులుగలవారి విషయమై సర్కారు ద్రవ్యము వ్యయము చేయుటకు గవర్నమెంటువారు పూనుకొనలేదు.

3. అన్నపానము లియ్యనియెడల పస్తుపడియుండుటచే ప్రాణభయము రాతగిన స్థితిలోనున్న నిరాధారులైన బాటసారులకును బిడ్డలకును గ్రామాధికారి అన్నపానాదు లమర్చవలెను. వారు ప్రయాణము చేయుటకు శక్తికలవారుగానున్నచో వారి స్థితిగతులను తెలియపరచుచు నొక రిపోర్టుతో వారిని దగ్గరలోనుండు మేజస్ట్రేటునకు పంపవలెను. దారిలో వారి యన్నపానాదులకు ఏర్పాటు చేయవలెను.

4. వైద్యచికిత్స మిక్కిలి అవసరముగా జరుగవలసియున్నయెడలను రోగి నడచి పోజాలక పోయినను వానిని అత్యంత సమీపమున నుండు సర్కారు వైద్య ఉద్యోగస్థుని దగ్గరకుగాని ఆసుపత్రికిగాని ఒక బండిమీద పంపవలయును. దీనినిగూర్చి రోగి పరిస్థితులనుగూర్చి మేజస్ట్రేటుకు తక్షణము రిపోర్టు పంపవలెను.

5. ఈ సందర్భములందు ఖర్చుచేసిన సొమ్మును గ్రామాధికారికి మేజస్ట్రేటు మరల ఇచ్చివేయును.

6. దైవికముగా చనిపోయినవాని శవమునుగూర్చి శ్రద్ధ పుచ్చుకొనువారు లేనప్పుడు గ్రామాధికారి ఆ శవమును పాతిపెట్టించుటకు ఏర్పాటు చేయవలెను. దానికైన ఖర్చులు బిల్లుచేసి మేజస్ట్రేటువలన రాబట్టుకొనవచ్చును.

**నేరములు చేయు జాతులు :-**

నేరములు చేయు జాతులను రిజిష్టరు చేయుటను గూర్చియు వారి నడతను కనిపెట్టుచుండుటను గూర్చియు వారిని హద్దులో నుంచుటనుగూర్చియు 1924 సం॥లో చేయబడిన క్రిమినల్ (ౙైమ్సు) శాసనములోని నిబంధనలను అమలుపరచుట గ్రామాధికారి విధి. వారి రాకపోకలు వారి చర్యలు గమనించి రిపోర్టు చేయవలెను. వారు తమ రాకపోకలు గ్రామాధికారికి తెలియజేయుచుండవలెను.

మద్రాసు ప్రభుత్వమువారు ఈ గ్రంథమును ప్రకటించిన నాటినుండి నేటివరకు దేశపరిపాలనలో కొన్ని మార్పులు జరిగినవి. అనేక క్రొత్త శాసనములు చేయబడినవి. ఈ గ్రంథమును ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు సవరించి ప్రకటించవలసియున్నది.

# శ్రీ దిగవల్లి వేంకట శివరావుకు

# ప్రభుత్వ సన్మానం

విజయవాడ, సెప్టెంబరు 4 :- ప్రఖ్యాత రచయిత, విజయవాడ న్యాయవాది శ్రీ దిగవల్లి వెంకట శివరావును రాష్ట్ర ప్రభుత్వం సన్మానించి గౌరవించడానికి నిర్ణయించింది. ఈ సందర్భంగా ఈ నెలలో జిల్లా విద్యాధికారి ఒక సభ ఏర్పాటు చేయుచున్నట్టు తెలుస్తున్నది.

శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారు కాకినాడలో 1898 సం లో ఫిబ్రవరి 14 వ తేదీన జన్మించిరి. తండ్రి వేంకట రత్నము పంతులు గారు. తల్లి సూర్యమాణిక్యాంబగారు. వీరు రాజమహేంద్రవరములోని వీరేశలింగము హైస్కూలు, చెన్నపట్టణము రాజధాని కళాశాల న్యాయశాస్త్ర కళాశాలలయందు విద్యనేర్చి 1922 నుండి విజయవాడలో న్యాయవాదిగా నున్నారు. 1947 లో న్యాయవాది సంఘాధ్యక్షులైరి. నలుబదేండ్ల నుండి అనేక పత్రికలయందు వ్యాసములను ప్రకటించిరి. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీవారి ప్రచారకశాఖను నడిపి, సత్యాగ్రహ చరిత్ర, నిర్భాగ్య భారతము, బార్డోలీ సత్యాగ్రహ విజయము బ్రిటిషు వస్తు బహిష్కారము మొదలగు చిన్న పుస్తకములను రచించిరి. ఇవి 1930-32 లో నిషేధింపబడినవి. వీరిపైన ఆనాటి ప్రభుత్వమువారు రాజద్రోహ నేరములకు పెట్టిన కేసు గాంధి ఇర్విన్ సంధివిబట్టి ఉపసంహరించిరి. వీరు విజ్ఞానచంద్రికా మండలి సంపాదక సభ్యులు. ఆంధ్ర కో-ఆపరేటివ్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరు. 1957 లో పారిభాషిక పదనిర్మాణమునకై ఆంధ్రప్రదేశ ప్రభుత్వము వారేర్పరచిన గ్లాసరీ కమిటి సంపాదక సభ్యులు. హైదరాబాదులోని శాస్త్ర విజ్ఞానము చరి

త్రల తెలుగు అకాడమీ సంపాదక సభ్యులు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు 1964 లో ఏర్పరచిన ట్రాన్స్‌లేషన్ కమిటీ సభ్యులు. ఈయన రచనలందు దక్షిణాఫ్రికా చరిత్ర, అదివివేళ స్వరాజ్యము, వ్యవహార కోశము, శాస్త్ర పరిభాష, భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము కథలు గాథలు (నాలుగు భాగములు) 1857 పూర్వరంగములు, సన్యాసుల స్వాతంత్ర్య సమరములు, ఆఫ్రికా జాతీయోద్యమము, మన ఆంధ్రత్వము, ప్రజా ప్రభుత్వము, ఇత్యాదులు ప్రకటితములు. ఆంధ్ర ప్రదేశ్ చరిత్ర, 1757_1857 స్వాతంత్ర్య సమరములు, జీవితగాథలు, ఇంగ్లాండు ఇండియా పోలీసు వ్యవస్థ. ఇత్యాదులు అప్రకటితములు.

— ఆంధ్రప్రభ 5_9_1966

# జాతీయ దృక్పథంతో ఆంధ్రప్రదేశ్ చరిత్ర రచన ఆవశ్యకత

తమకు జరిగిన సన్మానసభలో శ్రీ దిగవల్లి వెంకట శివరావు సూచన

( "ఆంధ్రజ్యోతి" ప్రతినిధి )

విజయవాడ, సెప్టెంబర్ 22 :- "చరిత్రకారునిగా జీవితం ప్రారంభించాను. చరిత్రకారునిగానే జీవిస్తాను. మేజరు బి. డి. బసు, ఎడ్వర్డ్ థాంప్సన్ ప్రభృతుల రచనలు నన్ను జాతీయ దృక్పథంతో చారిత్రక వ్యాసాలు వ్రాయడానికి ప్రేరేపించాయి. స్వాతంత్రోద్యమంలో తమ సర్వస్వం సమర్పించిన మహాత్యాగులతో పోల్చుకుంటే నేను సామాన్య





ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సన్మానం
22 సెప్టెంబరు, 1966 సం॥రం.

కార్యకర్తను మాత్రమే. జాతీయ దృక్పథంతో కూర్చిన సమగ్రమైన నిఘంటువుకాని, వ్రాసిన చరిత్రగాని లేవు. కనీసం ఆంధ్రప్రదేశ్ చరిత్రను జాతీయతా దృక్పథంతో పరిశీలించి వ్రాయవలసిన ఆవశ్యకత వున్నది" అని నేటి సాయంత్రం తమకు జరిగిన సన్మాన సభలో ప్రముఖ చరిత్రకారులు శ్రీ దిగవల్లి వెంకట శివరావు సూచించారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరపున స్థానిక ఎస్. కె. పి. వి. వి. హిందూహైస్కూల్‌లో జరిగిన ఈ సభకు శాసన సభ్యులు డాక్టర్ టి. వి. యస్. చలపతిరావు అధ్యక్షతవహిస్తూ చారిత్రక, సాంస్కృతిక, సాహిత్య రంగాలలోనే కాక ప్రత్యేకించి జాతీయోద్యమంలో శ్రీ శివ రావు వహించిన పాత్రను ప్రస్తుతించి పట్టణ ప్రజాజీవితంలో, దాని అభ్యున్నతిలో చేసిన "సైలెంట్ వర్క్" గణనీయమయిన దన్నారు.

తొలుత శ్రీ చెరుకుపల్లి జమదగ్ని శర్మ సభా పరిచయం కావించారు. శ్రీయుతులు కోకా సుబ్బారావు, గొట్టిపాటి బ్రహ్మయ్య, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, వేలూరి శివరామశాస్త్రి, నార్ల వెంకటేశ్వరరావు, వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాద్, వావిలాల గోపాలకృష్ణయ్య, గుమ్మడిదల వెంకటసుబ్బారావు, అక్కిరాజు రమాకాంతరావు, ఎమ్. భక్తవత్సలం, ఎస్. రామయ్యర్, అవినాశలింగం చెట్టియార్, డాక్టరు శంకర శ్రీరామారావు ప్రభృతులనుంచి వచ్చిన సందేశాలను అడ్వొకేటు శ్రీ టి. ఎల్. నరసింహారావు చదివి వినిపించారు. నవయుగ ఫిలిమ్స్ అధినేత శ్రీ కాట్రగడ్డ శ్రీనివాసరావు. శ్రీ గూడూరి నమశ్శివాయ, డాక్టర్ వై. సూర్యనారాయణ, శ్రీ ది. పిచ్చయ్య, శ్రీ బాడిగ శేషగిరి రావు మొదలైనవారు శ్రీ శివరావును పుష్పమాలాలంకృతుని చేశారు. గుడిపూడి ఇందుమతీదేవి ప్రశంసా పద్యాలు చదివారు. పట్టణంలోని

పెక్కుమంది న్యాయవాదులు, డాక్టర్లు, రచయితలు, నాయకులు, మహిళలు సభకు వచ్చారు.

"కళా ప్రపూర్ణ" శ్రీ విశ్వనాథ సత్యనారాయణ సభను ప్రారంభిస్తూ, శ్రీ శివరావు వ్రాసిన పుస్తకాలలో అముద్రితాలుకాక, ప్రచురితమయినవే 36 పైగా వున్నాయని, విశ్వవిద్యాలయాలవారు వాటిని పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించడం సముచితమని సూచించారు. శ్రీ శివరావు వ్రాసిన "1857 పూర్వరంగాలు" ఆధారంగా తాము వ్రాసిన నవల "ప్రళయ నాయడు"ను శ్రీ సత్యనారాయణ ఆయనకు సభలో అంకితమిచ్చారు.

శాసన సభ్యులు శ్రీ కాకాని వెంకటరత్నం ప్రసంగిస్తూ మూడు దశాబ్దాల క్రితం కృష్ణాజిల్లాలో కాంగ్రెసు వలంటీర్లకు శ్రీ శివరావు గురుదేవుల వంటివారని, ఆయన బసవరాజు అప్పారావు వంటి కవులను తయారుచేసి, వెనుకవుండి జాతీయోద్యమాన్ని నడిపారని, కనుపించని త్యాగాలు చేసి దేశభక్తులను ఉత్తేజపరచి ప్రోత్సహించారని జిల్లా కాంగ్రెసు చరిత్రకు శ్రీకారం దిద్దారని వివరించారు.

శ్రీ మల్లెల శ్రీరామమూర్తి ఉపన్యసిస్తూ శివరావు అముద్రిత సాహిత్యాన్ని వెలువరించడం ప్రజల కర్తవ్యమని, నిష్కామ సేవలు సల్పిన ఈ ఆదర్శజీవి రచనలు ప్రజలు విధిగా పఠించవలెనని, చరిత్ర పరిశోధనలో క్రైస్తవుల పరిశీలనలో ఆయన చేసిన కృషి అనన్యమైనదని ప్రశంసించారు.

శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య మాట్లాడుతూ, సాహిత్యం పరిణామాలలో సాశ్వతపు విలువలు తారుమారయినా శ్రీ శివరావు రచనలలోని సత్యాన్వేషణం, దేశాభిమానం చెరగవని, జాత్యభిమానం

ధ్యేయమని సత్యనిష్ఠ, ధర్మనిష్ఠ, ఋజువర్తనం, నీతి,ధర్మం, జాతీయత ఇవే వీరి రచనలలో కానవస్తాయని, ఇది ఒక తపస్వికి కాని సాధ్యంకాని పని అని: శ్రీ శివరావు ధన్యజీవనులు, భారతజాతి గర్వించ తగిన మనిషి అని ప్రస్తుతించి, ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ చరిత్రను వాస్తవిక దృక్పథంతో శ్రీ శివరావుచేత వ్రాయించవలెనని విజ్ఞప్తి చేశారు.

తమ రచనలద్వారా యువకులలో చైతన్యం కల్పించిన శ్రీ శివరావు అముద్రిత గ్రంధాలను ప్రభుత్వం ముద్రించవలెనని శ్రీ కంభంపాటి సత్యనారాయణ కోరారు. న్యాయవాదుల తరపున శ్రీ పాటిబండ అప్పారావు శ్రీ శివరావును అభినందిస్తూ, ఆయన విలువలు గొప్పవని, స్వభావం ఉన్నతమైనదని అభివర్ణించారు.

డి. ఇ. ఓ. అభినందనలు తెలియజేశారు.

సభానంతరము ఈ క్రిందివారి సందేశములు చేరినవి.

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు, శ్రీ మాదపాటి హనుమంతరావు, శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ కె. ఎల్. రావు, శ్రీ జే. వి. సోమయాజులు, శ్రీపోతాప్రగడ శ్రీరామారావు, శ్రీ ఆచార్య రంగా, శ్రీ వై. వితలరావు.

---

# "నే నెరిగిన శివరావుగారు"

## శ్రీ కాకాని వెంకటరత్నం

---



శ్రీ దిగవల్లి శివరావుగారు ఆంధ్రదేశంలోని మేధావులలో పేరె న్నిక గన్నవారు. సర్వతోముఖ ప్రజ్ఞాధురీణులు. శ్రీ ప్రకాశం పంతులు గారి కోవలోనివారు. శ్రీ శివరావుగారిని గురించి ఈనాటి యువకు లకు తెలియక పోవచ్చుగాని, ఆ రోజులలో అంటే 1930, 1932, సంవ త్సరాలలో కాంగ్రెసు రణరంగంలో వారు ధరించిన పాత్రలు తలుచు కుంటే వళ్ళు జలదరిస్తుంది. శివరావుగారు, ఘంటసాల సీతారామశర్మ గార్ల పాత్ర తలుచుకొన్నప్పుడు వళ్ళు పులకరిస్తుంది.

ఈ రోజులలో వేదికపై కెక్కి ఉపన్యాసాలు ఇచ్చి, ప్రభుత్వం ఇలా చేస్తున్నదని, అలా చేస్తున్నదని విమర్శించడం ఏమాత్రం కష్టం

కాదు. కాని, ఆ రోజులలో శివరావుగారు విమర్శలు చేశారన్నా, పుస్తకాలు వ్రాశారన్నా చాలా గొప్పవిషయం. వారి ధైర్యం అమితం. ఆ రోజులలో వారు మా అందరికీ ధైర్యం కలుగచేసి, వలంటీరులను ఉత్సాహపరచి రింగంలోకి పంపించేవారు. నిజమయిన - అందరికి ఆదర్శమైన నాయకులు ఆ రోజులలో ఎవరైనా మాకు వున్నారా అవి అంటే ఒక్క శివరావుగారని మాత్రం చెప్పాలి. శివరావుగారి రచనలే ఆ రోజులలో మాకు ఆధారం. అవి మమ్ములను ఉత్తేజపరచి, మాలో జాతీయ చైతన్యం కలుగజేసి విజ్ఞానవంతులుగను, దేశభక్తులుగను తయారుచేసినవని చెప్పాలి.

వారు వేదికలు ఎక్కి ఉపన్యాసాలు యివ్వనక్కరలేదు. ఇవ్వనూ లేదు. వారు నోటితో ఊఁ వెళ్ళ పరవాలేదు. అవి అంటే చాలు, మేము అందరమూ ముందుకు దూకేవాళ్ళం.

## మూర్తి త్రయం

వారి అనుచరులు, వారు కలిసి ఒక మండలి. శివరావుగారు, శ్రీ చెరుకుపల్లి వేంకటప్పయ్యగారు, డాక్టర్ ఘంటసాల సీతారామశర్మ గారు. ఈ ముగ్గురూ కలసి తిరిగేవారు. డాక్టర్ వెలిదండ్ల హనుమంత రావుగారు కూడా వుండేవారు. వారు పరమపదించారు. ఈ పై ముగ్గురు వ్యక్తులు ఒక మండలి. వారిపేరు చెపితే చాలామందికి హడలు. ఎక్కడో, ఏ రోడ్డుమీదో, ఆంధ్రరత్న భవనంలోనో కలిసేవారు. ఇంక చెరిగేవారు, విమర్శించేవారు. వారిచుట్టూ అనేకమంది కూడే వారు. పెద్ద పెద్ద వాళ్ళే వాళ్ళపేరు చెబితే చాలా భయపడి పోయేవాళ్లు

ఆ రోజులలో హెజ్మాడీ అనే జాయింటు మేజస్ట్రేటు వుండే వాడు. బహు కఠినుడు. ప్రతివారికి సంవత్సరాలకొద్దీ శిక్షలు వేసే

వారు. అందరు భయపడి వెనుకంజ వేసేవారు. మహానాయకు లెవ్వరూ లేరు. ఎవరికివారు వెళ్ళి జైళ్ళలో కూర్చున్నారు. అలాంటి సమయంలో ఇక్కడ మాకు ఒక్క శివరావుగారుమాత్రం సలహాకుగాని, ధైర్యాలకు గాని వున్నారు.

శ్రీ బసవరాజు అప్పారావు మొదలైన అనేక కవులచేత ఉద్రేక పూరితమైన పద్యాలు, పాటలు వ్రాయించి తెచ్చి పాడించేవారు. ఉదాహరణకు, తల్లులను విడిచి పిల్లలు రండోయి, పిల్లలను విడిచి తల్లులు రండోయి, భార్యలను విడిచి భర్తలు - భర్తలను విడిచి భార్యలు రండోయి అని మేమందరము పాడుతూ వెడుతుంటే, మాలో తెలియని ఆవేశం కలిగేది. ప్రాణభీతికూడా వుండేదికాదు. నిజంగా తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఆ రోజులలో నిజంగానే తల్లులని విడిచి పిల్లలును, పిల్లలనువిడిచి తల్లులు, భార్యలను విడిచి భర్తలు, భర్తలను విడిచి భార్యలువచ్చి ఉద్యమంలో చేరేవారు. ఆకస్మికంగా చేరినవారిలోడాక్టర్ రాయప్రోలు సీతారామశాస్త్రిగారు జైలులో దెబ్బలుతిని పరమపదించారు.

శ్రీ శివరావు జైలుకు వెళ్ళకపోవచ్చు, దెబ్బలు తినకపోవచ్చు; కాని ఆయన వెనుక నిలబడి మమ్ములను తయారుచేశారు. అందరు జైలుకు వెళ్ళనక్కరలేదు. వెళ్ళినవారే దేశభక్తులుకారు. వెళ్ళకుండా. సేవచేసినవారు అనేకమంది డాక్టర్లు, లాయర్లు వున్నారు. దిక్కుమొక్కులేని వలంటీర్లకు సేవచేసిన అలాంటివారు మహానుభావులు అనేకమంది అజ్ఞాతంగా ఉండి ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా అమితమైన సేవచేశారు. ముఖ్యంగా శ్రీ శివరావుగారు మాకు నాయకులు. వారుచేసిన సేవ అపారం.

## 9

## సమాచార సర్వస్వం

వారిదగ్గర ఎలాంటి సమాచారం కావలసినా దొరికేది. అది ఒక గని. చెప్పడానికి వీలుపడదు. ఆయన మాకు గురువు. మార్గదర్శి. పగటివేళ వారియింటికి వెళ్ళడానికి భయపడే వాళ్ళం. ఏమో ఎప్పుడొచ్చి పట్టుకుంటారో అని ఎప్పుడూ యింటిదగ్గర సందులో పోలీసువారు తిరిగేవారు. పట్టుకుంటే వారి వృత్తికికూడా ముప్పు. అందుకని అందరం కలసి రాత్రివేళ రహస్యంగా వెళ్ళేవాళ్లం. ఇంట్లో పెద్ద పెద్ద సమావేశాలు అవుతూ వుండేవి.చర్చలు జరుగుతూ ఉండేవి. అనేకమైన విషయాలు తెలుసుకుంటూ వుండేవాళ్లం. ఇంట్లొ సైక్లోస్టయిలు కాపీలు ఇవ్వబడుతూ వుండేవి. రహస్యంగా గోడ దాటించబడుతూ వుండేవి. అది అంతా తలుచుకుంటే చాల విచిత్రంగానే వుంటుంది.

శివరావుగారు సత్యంకోసం పాటుపడ్డారు. తనకు తోచింది ధైర్యంగా, వెనకడుగు వెయ్యకుండా చెప్పగలవారు శివరావుగారు ఒక్కరే. దెబ్బలాటలు కొట్టుకోవడం జరిగితే శివరావుగారికి చెరుకుపల్లి వెంకటప్పయ్యగారికి కలెక్టరు కబురుచేసి నిజం చెప్పమని అడిగేవారు. ఇలాంటి సందర్భాలు ఇంకా ఎన్నో వున్నాయి.

శివరావుగారు మా అందరికీ పూజ్యులు. మా అందరికొరకు పాటుబడ్డారు. వారిని ప్రభుత్వం అంటే ఆనాటి పెద్దలు కొందరు ఈనాడు మరచిపోయారే. వారికి జ్ఞాపకంచేసి శివరావును ఎలా తగు విధంగా సత్కరించాలా అని అనేకసార్లు తాపత్రయం పడ్డాను.

వారి పుస్తకాలు అచ్చువేయవలసినవి, వేసినవి, అనేకం ఉన్నాయి. వారి పుస్తకాలను పాఠ్యగ్రంథాలుగా పెట్టి, అచ్చువేసి వారిని సన్మానించవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది.

వారికి రచయితగా ఎంత పేరున్నదో న్యాయవాదిగా అంత పేరున్నది. గౌరవం వున్నది. అలాంటివారు శివరావుగారు ఒక్కరే అవి విస్పంశయంగా చెప్పగలను.

(విజయవాడలో జరిగిన శ్రీ దిగవల్లి శివరావు సన్మానసభలో శ్రీ కాకాని వెంకటరత్నం ప్రసంగంలోవి ముఖ్యభాగాలనుపైన వ్యాస రూపంలో ప్రచురించాము.)

— ఆంధ్రజ్యోతి ది 9-10-1966

---

శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు, ఎం. ఏ.,

శ్రీ శివరావుగారు న్యాయవాద వృత్తిలో వుండికూడా సుమారు 40 సంవత్సరాలు గ్రంధ రచనద్వారా తెలుగు ప్రజల్లో చైతన్యం కలిగించారు. నేను సత్యాగ్రహోద్యమంలో పాల్గొంటున్న రోజుల్లో వారి రచనలు నన్ను చైతన్యవంతుణ్ణి చేసాయి. నాలాంటి వందలాది వేలాది పాఠకులు వారి రచనలను చదివి చైతన్యవంతులయారు.

శ్రీ శివరావుగారు తన ప్రత్యర్థుల అభిప్రాయాలను ఎంత నిర్మొగమాటంగా ఖండిస్తారో వారి సుగుణాలను అత్యంత హృదయ పూర్వకంగా కొనియాడుతారు. కామ్రేడ్ వీరేశలింగం అనే శీర్షికతో నాలుగు వ్యాసాలు వ్రాసిన ఆ శివరావుగారే నవీన రష్యా ఆర్థిక నీతిలో లెలిన్ ఆర్థిక విధానాన్ని కొనియాడ్డానికి సంకోచింపలేదు.

నేను శ్రీ శివరావుగారు కలిసి ఆంధ్ర ప్రభుత్వం నియమించిన గ్లాసరీ కమిటీలో దాదాపు 1½ సంవత్సరాలు పనిచేశాం. నేను వారికి రాజకీయ ప్రత్యర్థిని. అయినా నేను చేసే సూచనలను వారు ఎంత

నిష్పాక్షికంగా యోచించి స్వీకరించేవారో జ్ఞాపకం చేసుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది.

శ్రీ శివరావుగారు తమ పార్టీకిచెందిన ఎంత పెద్ద నాయకుల అభిప్రాయాలనైనా నిర్మొగమాటంగా ఖండింపగలరు.

ఒకసారి గ్లాసరీ కమిటీలో అధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళే శ్వరరావుగారు రెండు పక్షాల వాదనలను సమన్వయపరచే ఉద్దేశంతో ఒక శబ్దానికి అశాస్త్రీయమైన అర్థంనిచ్చేమాట ఉపయోగించాలని నిర్ణయం చేశారు. ఇలాంటి రాజీపద్ధతులు శబ్దప్రయోగానికి పనికిరావని శ్రీ శివ రావుగారు ఎంతగట్టిగా చెప్పినా వినిపించుకోలేదు. దీనితో శివరావు గారికి పట్టరాని కోపంవచ్చి మరునాటి సమావేశానికి హాజరుకానని కమిటీకి రాజీనామా ఇచ్చి వెళ్ళిపోతానని చెప్పారు. శ్రీ శివరావుగారి సంకల్పాన్ని నేను చెప్పగా ఆ సాయంత్రమే శ్రీ కాళేశ్వరరావుగారు స్వయంగా శ్రీ శివరావుగారి వద్దకు వెళ్ళి తమ విచారాన్ని వెలిబుచ్చారు. శ్రీ శివరావుగారు సంతృప్తిచెంది మరునాటి సమావేశానికి హాజరయారు.

## శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారు

ఆయన 1924 నుండి 1966 సెప్టెంబరు వరకు దాదాపు 40 పుస్త కాలు రచించారు. అందులో చాలభాగం చరిత్ర వాఙ్మయానికి సంబం ధించినవి. ఆయన నిస్స్వార్థంగా, కీర్తి కాంక్ష, పదవిమోజు, ధనాపేక్ష లేకుండా పరిశోధనాత్మక కృషి సాగించారు. ఆయన రచనలలో సత్యా న్వేషణ, సత్యప్రియత్వం, సత్యపరత్వం, దేశాభిమానం, జాత్యభిమానం విశదమౌతాయి. సాహిత్యంలో మనిషి శీలం, ఆకృతి ప్రతిబింబిం

చాలి. ఆయన రచనలలో ధర్మనిష్ఠ, సత్యనిష్ఠ గోచరిస్తాయి. ఇది సామాన్యునికి సాధ్యంకావు. ఇది తపస్సులాంటిది. ఆయన వ్రాసిన గ్రంథాలు కావ్యాలతో సమానం.

మల్లెల శ్రీరామమూర్తిగారు

మూడు దశాబ్దాలకు పైగా ప్రసిద్ధ జాతీయవాదిగా, చలించని దేశ భక్తులుగా అనేక రచనలు సాగించారు. నిష్కామ సేవ చేశారు. పరిశుద్ధ జీవితమును గడిపారు. ఆశ్రయింపులు గిట్టవు. న్యాయవాద వృత్తిని సాహిత్యసేవకు ఉపాంగంగా ధర్మమార్గాన నిర్వహించారు.

కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

ప్రళయనాయడు అను తమ చిన్న నవలను అంకితము చేయుచు వ్రాసిన మాటలు.

"దేశీయులకు బహువిషయములు నాటివి తెలియచేయుటకు చాల ప్రయత్నము చేసినవారిలో విజయవాడ వాస్తవ్యులు, న్యాయవాద వృత్తి కలవారు, దేశీయాభిమానమునకు పట్టుకొమ్మవంటివారు శ్రీ దిగవల్లి శివరావుగారు.

వారు రచించిన పలుగ్రంథములు నేను చదివితిని. వారియందు నాకుగల గౌరవము పలుసార్లు ప్రకటించుటకు నూహించితిగానిపూర్వము సాధ్యపడలేదు. ఇప్పటికైన ఈ చిన్న గ్రంథము వారికి అంకితముచేయ గలిగినందుకు నేను మిక్కిలి సంతోషించుచున్నాను."

# సందేశములు:

శ్రీ కోకా సుబ్బారావుగారు,

భారత సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి.

"ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నా పూజ్యమిత్రుడు శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారిని గౌరవించుటకు నిశ్చయించినందుకు చాలా సంతోషించుచున్నాను. రాజమహేంద్రవరములో విద్యార్థిగా నున్న ప్పటినుండి నే నాయన నెరుగుదును. ఆ కాలములోనే ఆయన బహుముఖ ప్రతిభాశాలి యని విద్యాధికుడని నాకు తోచినది. విజ్ఞానరంగము లోను, న్యాయవాద వృత్తిలోనుకూడా ఆయన పేరుపొందినాడు. ఆయన పుస్తకములు, కరపత్రములు, ఆయన పాండిత్యమునకు విదర్శనములు. రాజకీయములందాయన చేసిన నిస్వార్థసేవ, ఆయన సాహిత్య, చారిత్రక రచనలు, ఆయన న్యాయవాద విధానము యువకుల కాదర్శప్రాయములని నా యభిప్రాయము. శ్రీ శివరావుగారికి సార్థకము ఆనంద ప్రదమునగు దీర్ఘాయువు కలుగునుగాక."

శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు,

పార్లమెంటు సభ్యులు, ఆంధ్రజ్యోతి సంపాదకులు.

"ఈ మధ్య భారతదేశమున బ్రిటిష్ రాజ్యాధిపత్యము భారత విజ్ఞాన వికాసములనుగూర్చిన "బిబ్లియాగ్రఫీ" చూచుట తటస్థించగా అందులో బెంగాలీవారి రచనలు చాలా కనబడి ఆంధ్రుల రచనలు చేర్పని లోపము కనబడినది. ఈ విషయములనుగూర్చి చాలా గొప్ప

పరిశోధక కృషిచేసిన శ్రీ శివరావుగారు నాకు జ్ఞాపకమునకు వచ్చారు. ఆయన రచనలు మేజర్ బి. డి. బాసుగారి రచనలతో సమానమైన విలువగలట్టివే. పైగా ఈయన మరుగుపడిపోయిన అనేక ఘట్టములను వెలుగులోనికి తెచ్చినారు. ఆయన ఖ్యాతి విస్తృతముగా వ్యాపించుట కీ సన్మానము తోడ్పడుమగాక.

శ్రీ డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు, పార్లమెంటు సభ్యులు.

శ్రీ శివరావుగారివంటి సత్పురుషుల నింత ఆలస్యముగనైనను ప్రభుత్వము, ప్రజలు, గౌరవించుట ముదావహము. మేము 1930 నుండి కొన్ని యేండ్లు చాలా అన్యోన్యముగ మెలగినాము. గొప్ప విషయము లను గూర్చి ఉద్గ్రంథములు రచించి ప్రజలలో విజ్ఞానము వ్యాపింప జేయుటలో ఆయనకుగల ఉత్సాహము నే నెరుగుదును. ఆ కృషి నాయన నిరంతరముగా కొనసాగించుచు బహు గ్రంథకర్తయైనారు. ఆయనకు నా హృదయపూర్వక అభినందనములు గౌరవము అందజేయుదు.

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు, లా కమీషన్ అధ్యక్షులు.

శ్రీ శివరావుగారు చేసిన దేశసేవను ఆంధ్రప్రదేశ ప్రభుత్వ మిప్పటికైన గుర్తించి నందులకు చాలా సంతోషించుచున్నాను.

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, శాసన పరిషత్ అధ్యక్షులు.

శ్రీ శివరావు పంతులుగారిని నేను 40 సంవత్సరములనుండి చాలా సన్నిహితంగా ఎరుగుదును. వారు దేశభక్తులు. స్వరాజ్య సంపా దనకు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు వారు ప్రత్యక్షంగాను పరోక్షం గాను ఎనలేని సహాయ సంపత్తి నిచ్చినారు.

యువకులను ప్రోత్సహించి, వారిని వీరులుగా తీర్చిదిద్ది సమర రంగమున దుమికించిన ఆచార్యసత్తము డీయన.

శివరావుగారు ఆంధ్రదేశంలోని మేధావులలో పేరెన్నిక గన్న వారు. వారు సర్వతోముఖమైన ప్రజ్ఞాధురీణులు. వారి రచనలు వారి పాండితీ ప్రకర్షను వెల్లడించుచున్నవి.

ఆయన ఆత్మగౌరవం కలిగి సత్యపంథాను వీడని న్యాయవాది.

శ్రీ పెద్దింటి తిమ్మారెడ్డిగారు

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు

శ్రీ శివరావుగారు ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారి అనుయాయులు. స్వాతంత్ర్య సమరరంగంలో ఆయన సాహిత్యసేవ మరువరానిది.

శ్రీ శివరావుగారు సత్యపథంతో సాగిన న్యాయవాది. విరాడం బరజీవి. నిర్దుష్ట నడవడిగలవారు. తాను నమ్మిన వానిని నిర్మొగమాటంగా చెప్పగల సాహసి.

శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్‌గారు

శ్రీ శివరావుగారు నిర్వహించిన వాఙ్మయసేవ గణనీయమైనది. కాలగర్భమున కప్పబడియుండియున్న అనేక చారిత్రక సత్యములను వారుద్ధరించిరి.

మహాత్మాగాంధిగారు నిస్పృహతో నిర్వీర్యమైన కర్తవ్య మూఢ మైన భారతజాతికి నవచైతన్యము పూరించినారు. దేశమంతటా స్వాతంత్ర్య కాంక్ష వ్యాపించినది కాని ప్రజాసామాన్యమునకు పర పరి పాలనవల్ల కలిగే బెడద లేమిటో తెలియవు. అవి తెలియచెప్పుట

అవాదెంతో అవసరమైయుండెను. ఆకార్యమును శ్రీ శివరావుగారు నిపుణ ముగా నిర్వహించిరి.

శ్రీ శివరావుగారు మన పూర్వ సంస్కృతి సంప్రదాయముల యందభిమాని. సత్యారాధకులు. ఋజువర్తనులు. అవినీతి అక్రమము లను సహింపజాలరు. ఈ సందర్భములలో వీరొక్కొకప్పుడు నిశితముగా విమర్శించువారు. అప్పటికవి కొందరకు అప్రియముగా నుండవచ్చును. కాని సత్యపథములో దానికి విలువగలదు.

శ్రీ గుమ్మిడిదల సుబ్బారావుగారు, గోష్ఠి, అమలాపురం.

శ్రీ శివరావుగారు ఆంధ్రచరిత్రకును వాఙ్మయమునకును మహత్తర సేవ యొనర్చినారు. రాష్ట్రప్రభుత్వ మేర్పరచిన భాషాకోశము సిద్ధపరచు టలో వారొనర్చిన సేవ ప్రసిద్ధమైనది. ముఖ్యముగ చెన్నపురి చరి త్రలోను 10వ శతాబ్దమునందును అడుగున పడిపోయిన ఆంధ్రుల వముఖపాత్రను బయటకు తెచ్చి కథలు గాథలుగను చరిత్ర పుస్తకములు గను ప్రచురించినందులకు శ్రీ శివరావుగారికి ఆంధ్రు లెంతయో ఋణ పడి యున్నారు.

బ్రహ్మశ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు

• ప్రభుత్వమువారు ఇప్పటికి మిమ్ములను గుర్తించగలిగినందులకు సంతోషం. మీరు నిష్పక్షపాతంగా నిర్భయంగా, చరిత్రలు, ఎవరికిని తెలియని క్రొత్త అంశములతో ఆవిష్కరించుటవలననే మిమ్ములను ప్రభుత్వం గౌరవించినదిగాని ఇది ఒకరి సిఫారస్ కాదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, ఆంధ్ర శాసన సభ్యులు.

"ఆనాటి జాతీయోద్యమంతో మీ రచనలు మాబోటి యువకులకు విజ్ఞాన కేంద్రాలుగా వుండేవి."

శ్రీ డాక్టరు అక్కిరాజు రమాపతిరావుగారు,

ఎం. ఏ. పి. హెచ్. డి., హైదరాబాదు.

నిరాడంబరత, అచ్ఛశీలము, సాధుస్వభావము, ఆర్జవము, క్రమ క్రమంగా మరుగైపోతున్న ఈ రోజులలో పై యోగ్యతలన్నీ కలిగి, పేరుప్రతిష్ఠలకొఱకుగాని ధనార్జనాసముత్సుకత్వంతో గాని, కాకుండా అచ్ఛమైన అభిరుచితోను, తాత్పర్యంతోను, చరిత్ర పరిశోధనకు తెలుగు దేశంలో ప్రామాణికత్వం ఏర్పరిచారు శ్రీ శివరావుగారు.

తెలుగుదేశంలో ఉన్నతశ్రేణికి చెందిన చారిత్రకులను వ్రేళ్ల మీద లెక్కపెట్టవచ్చును. వారిలో శ్రీ వేంకట శివరావుగారికి విశిష్ట మైన స్థానమున్నది. చరిత్రను సాహిత్యంగా చెప్పటమే వీరిలోని విశిష్టత. భారతదేశానికి అందునా ముఖ్యంగా ఆంధ్రదేశానికి సంబం ధించిన అనేక కథలను, గాథలను వీరు ప్రాణంపోశారు.

స్వాతంత్ర్యోద్యమము బ్రిటిషువారి పరిపాలనము మొదలైన విషయాలను చెప్పవలెనంటే శ్రీ శివరావుగారు ప్రామాణికులని చెప్ప వలసి ఉంటుంది.

శ్రీ ఎం. భక్తవత్సలం, మద్రాసు ముఖ్యమంత్రి

ఈ సంతోష సమయమున శ్రీ శివరావుగారికి నా హృదయ పూర్వకమైన అభినందనములు పంపుచున్నాను.

శ్రీ టి. ఎస్. అవినాశిలింగం చెట్టియార్, కోయంబత్తూరు

శ్రీ శివరావు చేసిన మహత్తర ప్రజాసేవకు ఆంధ్రప్రదేశ ప్రభు త్వము సన్మానించుచున్నందుకు చాలా సంతోషించుచున్నాను.

# దిగవల్లి వేంకటశివరావు రచనలు

## ముద్రితములు



పోతన వేమనలయుగము (1924)
(చెన్నపురి రాజధానికళాశాల బహుమాన వ్యాసము)

హిందూధర్మశాస్త్రసంగ్రహము (1926)

దక్షిణాఫ్రికా చరిత్ర (1928)
(విజ్ఞాన చంద్రికామండలి)

నీలాపనింద (జమీందారుల కథ) నవల. (1929)

సత్యాగ్రహ చరిత్ర (1930)

నిర్భాగ్య భారతము ,,

దరిద్రనారాయణీయము ,,

బార్డోలీ సత్యాగ్రహవిజయము ,,

బ్రిటిషు వస్తుబహిష్కారము ,,

విదేశవస్త్ర బహిష్కారము ,,

సత్యాగ్రహబోధిని ,,

(పై ఆరు కాంగ్రెసుసంఘ ప్రచురణలు : 1930-32 లో నిషేధింపబడినవి)

అధినివేశ స్వరాజ్యము (1933) (విజ్ఞానచంద్రికా ప్రచురణ)

సహకార వస్తునిలయోద్యమము (1933) కృష్ణాకోపరేటివు ఫెడరేషన్

భారతదేశ స్థితిగతులు Statistics (1933)

వ్యవహారకోశము (1934) (ఇంగ్లీషు తెలుగు పారిభాషికనిఘంటువు)

శాస్త్రపరిభాష (1935) (ఇంగ్లీషు తెలుగు పారిభాషికనిఘంటువు)
అంకుల్ టామ్కథ (1936)
నూతన ఇండియా రాజ్యాంగము (ఆంధ్రరాష్ట్రరైతుసంఘ ప్రకటన)
నవీనరష్యా ఆర్థికనీతి (1936) ,,
రాష్ట్రీయ స్వపరిపాలనము (1937) (విజ్ఞానచంద్రికామండలి)
భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము (1938)
బ్రిటిష్ ఇండియా చరిత్ర (1938)
వ్యవసాయదారుల ఋణవిమోచన చట్టము (1938)
ఫెడరేషన్ నిజస్వరూపము (1939)
(శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారితో కలిసిచేసిన రచన)
(పై గ్రంథములు పునర్ముద్రణము కావలెను)
ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర (1941)
కథలు – గాథలు మొదటి భాగము (1941)
కథలు – గాథలు రెండవ భాగము (1945)
కథలు – గాథలు మూడవ భాగము (1946)
కథలు – గాథలు నాలుగవ భాగము (1 947)
(వెంకటరామా అండ్ కో. ప్రచురణ)
1857 పూర్వరంగములు (1957 (విశాలాంధ్రప్రచురణ)
సన్యాసుల స్వాతంత్ర్య సమరములు 1058 (నవోదయ ప్రచురణ)
ఆదివాసుల స్వాతంత్ర్య యుద్ధము 1958 (నవోదయ ప్రచురణ)
ఆఫ్రికా జాతీయోద్యమము (1959)
చరిత్ర శాస్త్రవిజ్ఞానముల (అకాడెమీ)
మన ఆంధ్రత్వము (1962) (ఆదర్శ గ్రంథ మండలి)
ప్రజాప్రభుత్వము (1966) ,,
మనపోలీసు వ్యవస్థ (1966) [రామన్ ప్రచురణ]

# అముద్రితములు

1. 1857 పూర్వరంగములు (రెండవభాగము)
2. "1757-1857" స్వాతంత్ర్య సమరములు
3. ఆంధ్రప్రదేశ చరిత్ర (మూడు భాగములు)
4. కథలు-గాథలు 5, 6 భాగములు
5. లోకమాన్య తిలకు
6. ఆంగ్లప్రభుత్వయుగము
7. బిషప్ హెబరు భారతదేశయాత్ర
8. కాంగ్రెస్ పూర్వరంగములు
9. జీవితగాథలు

ఇత్యాదులు



SUPREME COURT OF INDIA

Chief Justice of India,
No 2, Motilal Nehru Marg,
NEW DELHI, the 16th Sept 1966

DEAR SRI NARASIMHA RAO GARU,

Thank you for you letter of the 6th instant. I am glad that the Government of Andhra Pradesh has decided to honour my esteemed friend Sri Venkata Siva Rao. I have known him from the time he was a student at Rajahmundry. Even in those days, he impressed me as a man of versatality and learning. He had made a mark both at the Bar and in the field of learning. His books and pamphlets bear testimony to his erudition. His selfless work in politics, his contribution to literature and history and his career at the Bar would, I think, stand out as an inspiring example to young aspirants in those fields

I wish Sri Venkata Siva Rao a long, happy and useful life.

With kind regards.

Yours sincerely,

*(Sd) K. Subba Rao.*

(K. Subba Rao).

To

SHRI T. L. NARASIMHA RAO GARU, B. SC., B.L.,
Advocate,
Vijayawada-2. (A. P.)

44 WESTERN COURT,
N. DELHI
28—10—66.

DEAR SHRI NARASIMHA RAO,

So glad to hear that you are trying to organize a fitting Sanmanam ( సన్మానం ) for our good old friend Shri Digavalli V. Siva Rao.

It has been my privilege to have known him for the past 40 years. He is one of the very few Andhra intellectuals who have continued to serve our people in a constructive manner. As an author and research worker, he has rendered great services in promoting adult education among our none — too — well educated Andhra Voters.

He devoted so much of his time to write so many books in Telugu and continued the tradition of Vijnana Chandrika Mandali of the late K. V. Lakshmana Rao and thus enriched not only Andhra Literature but also the politically awakened people.

He suffered like so many of us, in our freedom struggle aad neglected his legal practice in order to promote the causes of Harijan uplift and Kisans

What a delightful friend he has proved to be, to so many of us during all these decades.

I pray that God should endow him with long life and happy times and pleasant experiences with the slowly awakening Andhra Electorate, for he deserves well of all of us.

Yours affly,

*Ranga.*

**Kindly convey to him my personal love and regards.**

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 8 | ప్రజలేదైన | పౌరులేదైన |
| 12 | 21 | హెడ్డుఫర్డు | హెర్టుఫర్డు |
| ,, | ,, | రాక్కేలు | రాడ్డేలు |
| ,, | 22 | శాక్‌ఫర్డు | శాల్‌పర్డు |
| 12,13 | 22,1 | లాల్వరాంప్టన్ | వూల్వరాంప్టన్ |
| 13 | 1 | బారో ఇల్‌ఫర్నెస్ | బారో ఇన్‌ఫర్నెస్ |
| 17 | 14 | పరిహాసక | పరిహారక |
| 20 | 8 | juged | juge d |
| 21 | 9 | Spartive | Sportive |
| 26 | 8 | షెపీల్డు | షెఫీల్డు |
| 27 | 12 | మొదట | మొరటు |
| 31 | 4 | విశేషణాంశము | విశేషాంశము |
| 31 | 16 | సంగతులు | బయల్పడిన సంగతులు |
| 31 | 21 | బ్రిటన్ | బ్రయిటన్ |
| 33 | 1 | పైన ప్రజలకు | పైన ప్రజలకు గౌరవ ముందదు ప్రజలకు |
| 37 | 15 | సతదన్యాయ | సతదున్యాయ |
| 39 | 11 | లందనావశ్యక | లందు ఆవశ్యక |
| 40 | 8 | ఒక్క | యొక్క |
| 40 | 13 | కాంటీలకు | కౌంటీలకు |
| ,, | 14 | కాంటీల | కౌంటీల |
| 41 | 3 | కాంటీబరో | కౌంటీ,బరో |
| 41 | 13, 15 | కాంటీ | కౌంటీ |
| 42 | 8 | పీఠాధిపతి | కిరీటాధిపతి |

